సేవనంబునకు వెడలియుండె, ధర్మజుండ ట్లేలయాజ్ఞాపించెనన్నఁ జెప్పెదవినుండు, ద్రౌపదీసహితుండై రహస్థ్సలమందున్న యన్నయగు యమనందను సందర్శించి యింద్ర నందనుండు ప్రణతుండును వినయావనతుండును నై ౨౬౦

తే॥ "మానవాధీశ ! విప్రులధేనువులను దోలుకొనిపోవుచున్నారు దొంగవాండ్రు,
ఆదురాత్ములవధియించి యాల మలప, వలయు నాయుధ, మందుకై వచ్చినాఁడ"

వ॥ అనివిన్నవించుటయు యుధిష్ఠిరుండిట్లనియె, ౨౬౧

కం॥ "పొమ్ముధనంజయ! యచటికిఁ, జి మ్మాతస్కరుల నీదుశితశస్త్రమునన్,
డెమ్ము మహీసురగోవుల, సమ్మతియిచ్చితిని లెమ్ము సత్వర మింకన్, ౨౬౩

చం॥ పరసతిఁ గన్నతల్లివలె భావనసేయు వివేకి యైనఁగా,
కొరుఁడు వివిక్తదేశమున యుగ్మలిఁగూడి వసింపఁ గాంచుచో
హరహరయంచుఁ దొల్గవలె నావల, కట్లు తొలంగఁడేని దు
ష్పురుషుఁడె వాఁడు, పాపియును, జుట్టమెయైన నిఁకేమిచెప్పనౌ, ౨౬౪

తే॥ కాన నేకాంతమందునఁ గాంతతోడఁగూడివర్తించువానిని జూడఁగూడ,
దందు బంధువుఁజూచుట యతివిగర్హ్యా, మాత్మహితకాంక్షి పాటింపనగునుదీని,

శా॥ ఏనున్ ద్రౌపది రొక్కశయ్య మనుచో నేతెంచితీ, వందునన్
ధేనువ్రాతము గమ్మతించుపిదపం దీర్థంబులం గ్రుంకిర,
మ్మేనస్సంతయు ద్వాదశాబ్దములుగా నీఁగున్, ధరిత్రీజనం
బానానంచు నుతించు నిన్ను విజయా ! యావీఁకఁ గావించుటన్" ౨౬౬

వ॥ అని యిట్లు వచించుటయు వల్లెయని ధనుర్బాణంబులం గైకొని తత్క్షణంబ రథం బధిరోహించి శితశస్త్రధరుఁడై ద్విజులఁ దిరస్కరించి దొంగలు గోవులఁ దోలుకొని పోవు మార్గంబునం జని వేగంబ వారి సంహరించి మహాత్ములగు బ్రాహ్మణులకు ధేనువుల సమర్పించి యనేకతీర్థంబులం దాడుచును ననేకాయతనంబుల దర్శించుచును బాండునందనుండు క్రమంబుగా నీ క్షేత్రంబునకు నరుదెంచె, నతఁడు పూర్వ మీ క్షేత్రమును దక్షుచుగా నవలోకించియున్నవాఁడె, దుర్యోధనువివాహంబున కేగుచు నటు వచ్చియుండుట వినియుండరో కో, యంత మున్ను తాఁబ్రతిష్ఠించి యున్న యర్జునేశ్వరలింగంబును బుష్పధూపానులేపనంబులం బూజించి కౌరవులును బాండవులును స్థాపించిన తక్కటిలింగంబులకును మ్రొక్కవెట్టి యాత్మగతంబున

కం॥ "నేను నరుండను, గృష్ణుఁడు శ్రీనారాయణుఁడు తాను, సిద్ధమిది, యటుల్
గాన నిటుఁ జక్రపాణిని బూని ప్రతిష్ఠింతు జనులు పూజయొనర్పన్, ౨౬౭

తే॥ ఉర్విఁ గనివినియెఱుఁగని యొక్కగుడియు రాణఁ గట్టింతు నీచక్రపాణికిచటఁ
జెడదు కల్పాంతమునను నీక్షేత్రరాజ, మట్లె శాశ్వతమైయుండు నాలయమును"

వ॥ అని నిశ్చయించుకొని యాపాండవానుజుండు విష్ణ్వాలయంబు వినిర్మింపించి చమత్కారపురస్థులగు భూసురులఁ బిలువంబంచి తన్మతానుసారంబుగాఁ జక్రపాణిం బ్రతిష్ఠించి యనేకదానంబులం గావించియు ననేకశాసనంబుల వేయించియు నాబ్రాహ్మణులకుఁ బరమసంతోషప్రదంబులగు మఱికొన్నింటి సమర్పించియు వారిం గూర్చి దోసిలి యొగ్గి నిల్చఁబడి

చం॥ "నరుఁడని పూర్వజన్మమున నన్ను వచించెడివార, లొక్క భూ
సురునకు నాత్మజుండఁ, గడుసుందరమౌ బదరీవనంబునన్
జిరము తపంబొనర్చితిని, సిద్ధినిగాంచితి, నంతఁ బాండు భూ
వరసతి కుంతి గర్భమున వచ్చి జనించితి మానవుండనై, ౬౨౧

భుజంగప్రయాతము. జగత్ప్రసిద్ధమై రహింప శ్రద్ధ నస్మదాఖ్యతో
నగోపమానమైన యాలయంబుఁ గట్టఁజేసి యం
దగణ్యశోభమైన విగ్రహంబు నిల్పినాఁడఁ గా
నఁ గొల్వఁడీరు చక్రపాణినా వచించుచున్ సదా, ౬౨౨

ఉ॥ సూర్యుఁడుఁ జంద్రుఁడున్ మఱియుఁ జుక్కలు వర్తిలుదాఁక నాదుపే
రార్యులు విష్ణులోకమున నవ్వహమున్ స్మరియింపఁ జేయుఁడీ,
భూర్యఘమీఁగెడిన్, శయనబోధనవేళలఁ జైత్రమాసపున్
వార్యహమందు నుత్సవము నాచరతవ్యము మీకు భక్తిమై, ౬౨౩

చం॥ బదరినివీడి నేను బహుభక్తియుతంబుగ నీయుపేంద్రు స
త్పదములం బూజసేయుదును బ్రాహ్మణులార! మదుక్తమైన పై
పదముల నీచతుర్భుజుని యర్చనచేయుజనం బఘంబులన్
వదలి వి[illegible]లోకమున వాసముచేయుచునుండు హాయిగన్, ౬౨౪

కం॥ ఏవంవిధముగ మఱియును నీవిష్ణుక్షేత్రమందు నెసఁగెడి తత్త
ద్దైవతములఁ గడుభక్తిని సేవించెడిజనము గూడ శ్రేయముగాంచున్" ౬౨౫

వ॥ అనికీర్తించుటయు నమ్మహీసురులు వల్లెయని, రట్లు పాండునందనుండు [illegible] వారలకైకట్టి ప్రశాంతమైన యంతరాత్మతో నన్యతీర్థంబులును సేవించి [illegible], హృషీకేశుం డిట్లు చక్రపాణివపుర్ధారియై జంతువుల పాపంబులం బోఁదోలుచు నందు వెలసియున్నవాఁ, డిప్పటికిని నవ్విష్ణుకల చైత్రాషాఢకార్తిక[illegible] బాహ్యోక్తవిధానంబునఁ బూజనీయుఁడును విశేషించి వందనీయుఁడు నయ్యెడి,

—• అప్సరః కుండ నిర్మాణము. •—

తే॥ అట్లుమజియొక్కటియుఁగల దాస్థలమున రూపతీర్థంబనం గడు రూఢమగుచు,
నటు విరూపుండు భక్తి నీరాడెనేని యగుసురూపుండు సరవి మహర్షులార! ౬౭౭

వ॥ తొల్లి లోకకర్తయు భగవంతుండును నగు బ్రహ్మ విస్తృతంబగు చతుర్విధ సృష్టిం గావించి రూపసంచయసంయుతయగు నొక్క దివ్యాప్సరసం బుట్టింప నుద్దేశించి సకలదేవతాశరీరంబులనుండియు నొక్కొక్క నువ్వుగింజయంత రూపంబును గీసి తన్నుఁగూడ మోహింపఁజేయఁగల యత్యాశ్చర్యకరశరీర సృజియించి కైలాసంబున కరిగి మహాదేవునకు జోహారొనర్చిరమ్మని యనుపుటయు నయ్యది సత్వరంబుగం బోయి పార్వతీపరివేష్టితుండగు శంకరుదర్శింప నతండును నావిడం గనుంగొని పరమాశ్చర్యభరితుండై పార్శ్వస్థయగు పర్వతరాజపుత్రివలని భయంబున దృష్టదృష్టిం బఱపఁడయ్యె, నంత నయ్యచ్చరయు చ్చెకంటి మహేశ్వరునకుఁ బ్రణామంబొనర్చి శ్రద్ధాపురస్సరంబుగం గృతాంజలిపుటయై ప్రదక్షిణంబాచరించుడు నాదేవుండు తదాకృష్టలోచనుండై యాపె యేదిక్కునకుఁదిరిగిన నాదిక్కునవెల్ల ముఖంబుగల్పించుకొని గౌరీభీతచిత్తంబునఁ గంఠంబు నొక్కించుకయుం గదల్పకయె వర్తిల్లెఁగాని యాసమయమం దందున్న నారదమహాముని హైమవతి కభివందనంబొనర్చి ౬౭౮

క॥ "నీమగని కాముకత్వం బేమాదిరి నున్నయదియొ యీక్షింపుముమా!
యీమగువ సొగసునంతయుఁ దా మొగములు నాలుగింటిఁ దాలిచి కనెడిన్,

చం॥ జగములమూఁటు దివ్వటులు చాలరహిన్ వెలిగించి కాంచినన్
సొగసున నిన్నుఁబోలఁగల సుందరియుండమి నే నెఱుంగుదున్,
మిగిలినవారికందఱికి మిక్కిలివేద్యమె యిద్ది, ప్రౌఢగల్
దగిలిచి మేనినిండఁ దెయితక్కను బోగము దెంత నీకడన్, ౬౮౦

వారస్త్రీయఁట, పార్వతీసహితుఁడై వర్తించు గంగాధరున్
జేరన్ వచ్చినదంట, యాపెపయిఁ దచ్చిత్తంబు లగ్నంబఁట
య్యారే! తా నటునుండఁగానె శివుఁ డత్యాసక్తచిత్తుండుగా
గౌరీరూప మదెంతయంచుఁ గ్రతుభుక్కాంత లక్కడున్ నవ్వరే, ౬౮౧

చం॥ మనసటు నాటిపోయినది, మానక యాయన ప్రాజ్ఞకోటిచే
ననయము దూరమించఁబడు నగ్గణికం దనమేడమీఁద నే
యునుపఁగలాఁడు, నీదుపని యాత్తదియేయిఁక, నీగ్గుచేతఁ గి
మ్మన కిటుకూరుచుండెనిపు డంబరొ! బెల్లముఁగొట్టు రాయినాన్" ౬౮౨

వ॥ అని బోధ సేయుటయు ముఖచతుష్టయంబుచే వికృతుండైయున్న నిజనాథు వీక్షించి యాపర్వతాత్మజ బిట్టుకోపంబున మహిషీధర్మమాశ్రయించినదై యాయన కన్నులన్నియుం గప్పివైచె, నంత నఖిలశైలంబులును విరిసిపోయె, సప్తసముద్రంబులును జెలియలికట్టలుదాఁటె, నట్లు ప్రళయంబుతోఁచుటయు నిమిషమాత్రంబున బ్రహ్మకు దినక్షయమై రాత్రిసంప్రాప్తించె, సకలంబును జలమయంబయ్యె, నంత భృంగినందిపురస్సరులగు సర్వగణంబులును దత్కాలహాళనుండును భయంపడి యాగుకేశ్వరిదిక్కు మొగంబై ౬౨౪

కం॥ "విడువుము విడువుము జననీ! మృడుని కనుల్మూసి యేలమిడికింతువుమున్
విడువక యుండినచో నిప్పుడె నాశమునొందఁగలదు భువనత్రయమున్" ౬౨౫

వ॥ అని ప్రార్థించినను విడిచిపెట్టమిఁ బ్రాణంబులకంటె గరీయసియగు నాయమను వారింప నేరక మహాదేవుండు లోకంబులపైఁగల కృపాళుత్వంబున లోకరక్షాకరంబై చెలంగ లలాటంబున నొక నేత్రంబు సృష్టించె, నంత దేవతలు ౬౨౬

ఆ॥ "త్ర్యంబకములచేత నలగారుచుంటచేఁ ద్ర్యంబకుండటంచు నధికభక్తిఁ
గీర్తనీయుఁడింకఁ గృత్తివాసుండు తా నఖిలసురనరోరగాదులకును" ౬౨౭

వ॥ అని వాక్రుచ్చి, రంతఁ బర్వతపుత్రిక యాదేవుని కనులమీఁది చేతులుదీసి కోపసంరక్తలోచనయై ముందఱనుండు తిలోత్తమం దిలకించి ౬౨౮

కం॥ "పాపాత్మురాల! యుమ్మద్రూపముచేతను విడంబితుండయ్యె నిసీ
నాపతి, నాలుగుమొగములు ప్రాపించె, విరూపవగుచుఁ బడియుండు మిఁకన్"
వ॥ అని శపించుటయు

సీ॥ చతికిలఁబడి చూడఁ జాల నసహ్యమై జలుబునీళ్ళుస్రవించు చట్టిముక్కు
విరియఁబాఱినయట్టి కుబుచ వెండ్రుకలతోఁ జెలువును గోల్పోవు చిఱ్ఱనేత్రి
సినువులు బెదఱిపో నిమ్నోన్నతములౌచుఁ బాచివీడని పెద్ద బల్లపండ్లుఁ
గుండేఁడు ముదిజొన్న కూడేని క్షణములోఁ బట్టింపఁదగినంత బానకడుపుఁ
గలిగి యొకనిమేష కాలంబులోపలఁ జారుదేహమెల్ల మాఱిపోవ
వేపమానయగుచు నావె యాపార్వతి కెఱఁగి దోసిలొగ్గి యిట్టులనియె, ౬౩౦

చం॥ "ననుసృజియించి లక్షణమె నల్వ గిరీశునకుక్ భవానికిక్
బ్రణతియొనర్చి రమ్మనుచుఁ బంపఁగ వచ్చినదానఁగాని నీ
పెనిమిటిమీఁదికోర్కి భ్రమపెట్ట సమాగతఁగాను, దోషహీ
నను శపియించితంబ! యిది న్యాయముకాదు, మరల్పుశాపమున్" ౬౩౧

వ॥ అని యిట్లు వేడుటయు సత్యంబును దీనంబును నగు తద్వాక్యంబును విని
భవాని పశ్చాత్తాపసమేతయై ౧౯౨
తే॥ "స్త్రీస్వభావమునను జేసి శీఘ్రకోప మాగతంబయ్యె, నగుఁగాక యరుగుదెమ్మ,
భూస్థలంబున కిప్పుడే పోద, మచటఁ గలదు రూపదమనుతీర్థ మలఘు వబల! ౧౯౩
ఆ॥ మాఘసితతృతీయ మజ్జనమొనరింప నేరుపఱచియుంటి నేనెదానిఁ,
బోయి దానఁ బ్రొద్దుపొడువకమున్నె నీరాడుచేడె సుందరాంగియగును, ౧౯౪
కం॥ నిరతము మాఘతృతీయను జరుపుదుఁ దత్తీర్థమందు స్నానము, నేఁడా
వరతిథి; యవటికి స్నానముకొఱకేగఁగ నిశ్చయించుకొంటిని గలికీ!" ౧౯౫
వ॥ అని చెప్పి యాతిలోత్తమను హాటకేశ్వరక్షేత్రమందలి రూపతీర్థమునకుఁ
దోడ్కొనిపోయి విధిపూర్వకంబుగా మొదటఁ దాఁ దీర్థంబాడి యావిడచేత నాడించు
టయుఁ దత్క్షణమ యాభామిని యథాపూర్వంబుగాఁ గాంతిమతియై సంతసించి సురే
శ్వరికిఁ గేలుమోడ్చి యాశ్చర్యపడుచు హర్షగద్గదభాషణంబుల నిట్లనియె, ౧౯౬
కం॥ "మున్నున్నయట్టి నాదగు సన్నుతరూపంబు నాకు సమకూరెను గా
న న్నలువపట్టణమునకు నున్నతిమెయి నేగుదాన నోసఁగు మనుజ్ఞన్" ౧౯౭
వ॥ అనియిట్లు వక్కాణించుటయు గౌరి ౧౯౮
కం॥ "ఏదేని యొక్కవరమును నీఁదలఁచినదాననీకు నిందునిభాస్యా!
నాదగుదర్శన మెపుడును గాదు వృథా, కోరుకొమ్మ గ్రక్కున, నిత్తున్" ౧౯౯
వ॥ అనినవిని తిలోత్తమ మఱియునిట్లనియె, ౨౦౦
కం॥ "నేనీక్షేత్రములోన భవానీ! నాపేర నొక్కవరతీర్థంబున్
వే నిర్మింపఁగఁదలఁచినదానను, ఖ్యాతంబొనర్పు ధర నద్దానిన్, ౨౦౧
తే॥ అఖిలకాంతలు రూపభాగ్యములుగలిగి యలర నటుఁగూడ వర్షాంతమందు నీవు
స్నానమొనరించుచుండఁగాఁజను మహేశి! కరుణసేయుము మీదే నాకు ఘనవరంబు"
వ॥ అనిప్రార్థించుటయుఁ గ్రమ్మఱగౌరీదేవి ౨౦౩
ఆ॥ "చైత్రసితతృతీయ సర్వదా మధ్యాహ్నమునను నీదుతీర్థమునను స్నాన
మాచరించుదాన నఖిలకాంతాజనక్షేమమునకు నీవుచెప్పినట్లు, ౨౦౪
ఉ॥ ఎవ్వతె యాతృతీయఁ గర మెక్కుడుభక్తిని నేగుదెంచి తా
నివ్వరతీర్థమందునను నెంతయు నాచరితావగాహయౌ
నవ్వనితాశిరోమణి సుఖాన్విత రూపసమేతగూడ నై
నివ్వటిలున్ సమస్తరమణీస్పృహణీయతమై ధరాస్థలిన్, ౨౦౫
కం॥ పురుషుం డేనియు నెవఁ డవ్వరతీర్థమునను మునుంగువాఁడును సప్తో
త్తరజన్మంబుల సుఖియును దరుణీభ్రమకృత్సురూపధరుఁడును నగుఁ దాన్" ౨౦౬

వ॥ అని వాక్రుచ్చుటయు నయ్యచ్చరమచ్చెకంటి విస్తీర్ణంబును విమలోదక పూరితంబును నగు నొకకుండంబు ద్రవ్వించి తత్సవిధంబునఁ బార్వతిం బ్రతిష్ఠించి సంతుష్టాంతరంగయై బ్రహ్మలోకంబునకుఁ జనియె, నదిమొదలుకొని యయ్యప్సరః కుండంబు స్నానమాత్రంబున సకలజనులకును సౌభాగ్యంబొసంగుచును జలజాక్షులకు విశేషించి సంతతిప్రదమగుచును జగత్ప్రఖ్యాతంబయ్యె ! ౨౦౭

శా॥ ఏమీనాంబక భక్తి రూపమయమౌ నీ యప్సరః కుండమం
దామూర్ధంబును దీర్థమాడి సితికంఠార్ధాంగి దర్శించి యి
ట్లే ముమ్మాఱులొనర్చుఁ దత్క్షణమ యాయేణాక్షి జన్మాదిగాఁ
దా మున్ జేసిన ఘోరపాపములచేతన్ ముక్తయై క్రాలెడిన్, ౨౦౮

వ॥ అచ్చటనే గౌరీకుండసమీపమునం దాయమ కింకరియగు జయ యొకకుండ మేర్పఱచియున్నయది, తృతీయాదివసంబునం దందుఁ గృతాభిషేకయగు నబల సంతతి సౌభాగ్యసంపన్నయుఁ బతివల్లభయు నయ్యెడి, నట్లందు విజయాకుండమని మఱి యొక తీర్థంబునుం గల, దందు గొడ్డురాలైనను స్నానమొనర్చిన బిడ్డలంగని స్వప్నమందైనను బుత్రమరణదుఃఖంబును గాని పుత్రవియోగదుఃఖంబును గాని పొందకుండెడుఁ గాక వంధ్యయైనను దత్తీర్థంబునం గ్రుంకఁ బెక్కండ్రు కొడుకులంబడసి స్వర్గంబున వసించు”నని యిట్లు నొడువుటయు ఋషీశ్వరులు ౨౦౯

కం॥ “శుద్ధాంతఃకరణులు ప్రతిషిద్ధప్రాణివధులైన క్షితిసురులకు సం
సిద్ధి తడవైనయప్పటి శుద్ధతి సమకూరుమార్గ మొగిఁ జెప్పఁగదే” ౨౧౦

వ॥ అని వక్కాణించుటయు మరల సూతుండిట్లనియె, ౨౧౧

ఆ॥ “మాఘమాసమునను మౌని విశ్వామిత్రు ప్రాదములో నుమస్సునందుఁ గ్రుంకి
ద్విజున కధికభక్తిఁ దిలపాత్రమిచ్చుచో బ్రహ్మలోకమొందుఁ బాపమెడలి, ౨౧౨

వ॥ మఱియు సుపర్ణేశ్వరుమ్రోల నుపవసించి ప్రాయోపవేశంబునఁ బ్రాణంబులు వదలువాఁడు జన్మరహితుండయ్యెడు, నియ్యవి బ్రాహ్మణులకు దేవతలుగూడ మెచ్చఁదగు సాత్త్వికసిద్ధులు, తక్కటితీర్థంబులును దక్కటి దేవాలయంబులును స్వర్గప్రదంబులే కాని మోక్షదంబులు కానేరవు. సకలతీర్థంబులవలనను సకలదానంబులవలనను గలుగు ఫలంబును శ్రద్ధాసమన్వితులై యీయాఖ్యానంబు శ్రవణించువారు కాంచుదురు, జను లేతచ్ఛ్రవణంబువలన జన్మకోటి సంసిద్ధంబులగు కలుషంబులు వదలి నూరుతరముల వారి నుద్ధరింపఁగలుగుదురు, శ్రవణాంతంబున గోభూహిరణ్యవస్త్రాలంకారాది వివిధ దానంబులం గథకుండు పూజనీయుం, డెవఁడట్లు పూజించు వాఁడు సాక్షాత్సత్యవతీ సూనుండగు వేదవ్యాసుఁ బూజించినవాఁడెయగు, ౨౧౩

## శిభద్రోపాఖ్యానము —

కం॥ "తనరెడుఁ బుష్పాదిత్యుండను మఱియొక దేవుఁ డట, నా దేవుఁడు తా
మును యాజ్ఞవల్క్యనామక మునిచేతఁ బ్రతిష్ఠితుండు మునివరులారా! ౨౧౪

సీ॥ పుత్రసంతతిఁ గోరి పూజించు మనుజుండు సత్పుత్రులం గాంచి సంతసించు,
నర్థంబుఁ గాంక్షించి యర్చించు మర్త్యుండు లక్షాధికారియై లలి వహించు,
నరివినాశము గోరి యజయించు సుజనుండు హతసమస్తారియై యశముఁ బెంచు,
విద్యార్థియై కొల్చు విమలవంశభవుండు విద్వద్వరిష్ఠుఁడై విపులమించు,
మిత్రివార సప్తమీకృత తద్దేవదర్శనంబువలనఁ దద్దినంపుఁ
బాపమెల్లఁ దొలఁగు బ్రాహ్మణవరులార! తద్దఁ బెద్దదయ్యుఁ దక్షణమున, ౨౧౫

వ॥ ఆ సప్తమీభాను వాసరంబునం జేయు పుష్పాదిత్యపూజచే సూర్యోదయంబునఁ జీఁకట్లుపోలె సంవత్సరకృతంబగు పాతకంబును సంక్షయంబుఁ జెందెడి, ఫలహస్తులై యా దేవునకు నూటయెనిమిది ప్రదక్షిణంబు లొనరింపఁ బుట్టినది మొదలు గిట్టువఱకుం జేసిన యెట్టికలుషంబులును విలయంబునందు, నదియునుం గాక యా ప్రదక్షిణంబులు చేయు జనం బేకోర్కులు గోరిన నాకోర్కు లెల్ల సిద్ధించు, నిష్కామునకు మోక్షంబే ఘటియిల్లెడు, మేషసంక్రమణంబు గాని తులాసంక్రమణంబు గాని యాదిత్యవాసరసంయుతంబైనప్పు డా దేవునకు స్నపనక్రియ యొనరింప నభీష్టంబు సిద్ధించుఁ గావునఁ బుష్పాదిత్యుండు పూజనీయుండును దర్శనీయుండును నయ్యెడిఁ, జమత్కారపురస్థ సర్వదేవతాదర్శనంబునం గలుగు ఫలం బీయొక్కని దర్శనంబుననే చేకూరెడు" నని యిట్లు వక్కాణించుటయు ఋషులిట్లనిరి, ౨౧౬

ఆ॥ "వాస్తవముగ యాజ్ఞవల్క్యవాచంయమవరుఁడు తత్ప్రతిష్ఠ జరిపియున్న
నీ సుదైవతమున కిట్లు పుష్పాదిత్యనామ మేరుపడుట కేమికతము?" ౨౧౭

వ॥ అనిన వెండియు సూతుండు ౨౧౮

కం॥ "ఏతద్విషయంబున నొకరమ్యేతిహ్యముఁ జెప్పవాఁడ, నదివినుఁడు పైఁ ద
ద్ధేతువు తెల్లంబగు మీ కో తాపసవర్యులార! యూఁకొట్టుఁ డీకన్, ౨౧౯

సీ॥ తోవలరాయిడి కానిత్రోవ కడ్డంబాచుఁ గోటగోడలు చాలఁ గొమరుమిగుల,
గురుతల్పమెక్కిన కూళ వీఁడని శశిం బ్రాసాదముల సతుల్బందెనుంప
నారామతరుశాఖలందలి పుష్పము ల్పగటిచుక్కలుగ నభ్రమునఁ దోఁప
సింధువు ల్చుట్టును జేరివసించె నాఁ గమలాకరములు లెంకలను వెలయ
వైదిశంబని విఖ్యాతివడయు నొక్కపట్టణంబునఁ దాఁ బట్టభద్రుఁడగుచు
వ్యాధిదుర్భిక్షచోర వివర్జితముగ వసుధఁ బాలించె మును చిత్రవర్మనృపతి, ౨౨౦

వ॥ ఆపురంబున జాతిచే క్షత్రియుండై మణిభద్రుండని యొక్కఁడుండెడు,

సీ॥ తెంపలిచెట్లకే వేసి వోఁటీలను గుంజంగఁదగు మరుగుజ్జతఁడు,
కాయమంతటఁగూడ ఘనమైనముడతలు గలిగియున్నట్టి దుర్గలితుఁడతఁడు,
తలయును మొలయును దెలతెలగా మేనిపస గోలుపోయిన ముసలియతఁడు,
సౌష్ఠవశూన్యమౌ సర్వాంగములతోడ రోఁతఁబుట్టించు విరూపుఁడతఁడు,
వలసినంత ధనముగలిగినవాఁడయ్యుఁ దానుదినక యొరులకేని యిడక
వడ్డిఁబెంచి బీదవారల కొంపలమ్మించిమించుచుండు కించతండు, ౭౨౩

సీ॥ ఎద్దానియధరోష్ఠ మీక్షింప దొండపం డెద్దానివిగ్రహం బించుకోల
యెద్దానికనుదోయి యిందీవరవిశాల మెద్దానిగుల్ఫంబు లెఱుఁగరాని
వెద్దానిసెన్నడు మెన్న ముష్టిగ్రాహ్య మెద్దానియందంబు హృదయహారి
యత్స్పష్టగాత్రంబు లత్యంతరక్తముల్ యన్నారి మూఁడింట నతిగభీర
యట్టి యఖిలలక్షణాన్విత నిజజాతికన్య యొకతె తనదుకంటఁబడఁగ
నట్టివికృతుఁడయ్యు నమ్మణిభద్రుఁ డాతన్విఁ బెండ్లియాడఁదలఁచి యపుడు

వ॥ దారిద్ర్యపీడితుండగు దానితండ్రిం బిలిచి తన కిమ్మని యడుగుటయు నాతఁ డాసంగతి భార్యకు వినిపింప నాయమ దుఃఖితయై మూర్ఛిల్లెనంత నానిరుపేద యాపె సేదదేర్చి

సీ॥ "ధనవంతునకుఁ గన్యధారవోయఁగలేని విత్తహీనునివిద్య విద్యయొక్కొ,
యైశ్వర్యసంయుతు నల్లుఁగాఁబడయని నిర్భాగ్యునేరుపు నేరుపొక్కొ,
యర్థవంతునికిట్టి కాత్మజం బంపని యర్థశూన్యుని యర్థ మర్థమొక్కొ,
భాగ్యవంతున కాత్మభవఁ బత్నిఁజేయని భాగ్యహీనుని ప్రజ్ఞ ప్రజ్ఞయొక్కొ,
భాగ్యయుతునకుఁ జుట్టమౌఁ బరుఁడుగూడఁ, జుట్టమును బరుఁడగు భాగ్యశూన్యునకును
గిరులనుండి సరిత్తులక్రియఁ బెరుంగు నర్థములనుండి పనులెల్ల నగుచునుండు,

ఉ॥ పూజ్యుఁడుకానివానికిని బూజయొనర్చుచునుందురి పోయి సం
త్యాజునిగూడ శ్రద్ధమెయి దగ్గఱఁజేరి నుతింతు రన్వహం
బిజ్యునక ట్లవంద్యునకు నెంతయు వందనమాచరింతురి త
ద్రాజ్యధనప్రభావమున ధారుణిలోపల సర్వమానవుల్, ౭౨౬

చం॥ అశనమునుండి యిందిరియముల ట్లఖిలక్రియ లౌనుగానఁ దా
దృశమగు కార్యసాధనము పృథ్విఁ గనంబడ దెంచిచూడఁగా,
శిశువులుమున్నుగాఁగలుగు జీవులు సర్వులుగూడ దానికిన్
వశులయి నిప్పులోనయిన వచ్చి పడన్ గమకింతు రెంతయున్, ౭౨౭

కం॥ ధనవిరహితు లగుచోఁ దమ జననీజనకులనుగూడ సంత్యాగముఁజే
యను సాహసింతురి తక్కినజనులను విడుచుటకు నేమిసంశయముండున్" ౨౨౮

—♦ మణిభద్రుండు పుష్పుఁడను బ్రాహ్మణుని గొట్టించి యవమానించుట ♦—

వ॥ అనియిట్లు రహస్యంబుగా బోధించుడు నాయమయు నందుల కియ్యకొనియె నంత నాక్షత్రియుండు మణిభద్రుని పాదంబులుగడిగి హస్తంబున సాక్షతంబగు జలంబు విడుచుటయు నతండు ౨౨౯

ఆ॥ "పెండ్లిసేయు మిపుడె ప్రీతి నాకును నీదుకూఁతునకును నెలమిఁ గూడియుండఁ,
దన్నిమిత్తముగనె త్వద్గృహంబునకేను వచ్చినాఁడ మామ! వాస్తవముగ" ౨౩౦

వ॥ అనిపలుకుటయు నా క్షత్రియుండిట్లనియె, ౨౩౧

కం॥ "దినవారగ్రహము లిమ్మెడ ననుకూలములై రహింప, వదియుఁగా కి
ప్పుని దక్షిణాయనమునను బొనరింపఁగ రాదటండ్రు భూసురవర్యుల్, ౨౩౨

ఆ॥ ఇట్టిసమయమునను నెవతెవివాహంబు జరుపఁబడునొ వెస విచారముడిగి
దాని కొక్కయేడు దాఁటకమున్న వైధవ్యమేరుపడును దప్పకుండ, ౨౩౩

ఉ॥ జ్యోతిషికు ల్వచింప నిటు సంశ్రవణంబొనరించినాఁడ, నా
హేతువుచేత వేగపడ కీవు శుభర్క్షదినాదికాన్వితం
బై తగు నుత్తరాయణమునం దరుదెంచి వివాహమాడి సం
ప్రీతినిబొమ్ము, కల్గుదురు బిడ్డలునీకు, శుభంబుచేకురున్" ౨౩౪

వ॥ అనియిట్లువాక్రుచ్చుటయు మణిభద్రుండు ౨౩౫

ఆ॥ "అగ్నిదేవతాక మగుఁగాక నక్షత్రమగునుగాక దక్షిణాయనంబు,
మంచిమూర్తమునకు మనము యోజింప సంవత్సరాంతమగును వాస్తవముగ, ౨౩౬

ఆ॥ మన్మథాగ్ని లేచి మామకదేహంబుఁ దగులఁబెట్టఁజొచ్చెఁ, దాళఁజాలఁ,
గరుణయుంచి యిపుడె కల్యాణమొనరింపు, మడిగినంత విత్తమిడుదునీకు" ౨౩౭

వ॥ అని వేగిరించుటయు నాక్షత్రియుండు ధనలోభంబునంజేసి యిష్టంబు లేమి దుఃఖార్తయు నశ్రుపూర్ణేక్షణయు నగు నాత్మజాత నగ్నిసాక్షికంబుగా నతని కంటఁగట్టి యాక్షణంబ యంపించె, మణిభద్రుండు తత్సుందరాంగిని దనయింటికిం దోడుకొనిపోయి వలదు కుయ్యో మొఱ్ఱో యని వాపోవుచున్నను బలాత్కారంబున సురతంబున కుపక్రమించి యనేకవిధంబుల బెదరించియుఁ బీడించియుఁ దెల్లవాఱు వఱకు నిట్లట్లో తన వ్యసనంబు తాఁ దీర్చుకొనుచు నిదియేమియంత్యకాలమని యొక్కఁడేఁ

జీవాట్లు పెట్టుచుఁ గోపమున నీష్యం బరిచారకుల నందఱిని వెడలనడచి పుంస్త్వ హీనుండగు పురుషునొక్కనిమాత్ర మ్ముంచుకొని ౨౩౮

సీ॥ "పూర్వంబు మద్గృహంబున జీతమునకుండి ప్రీతిపాత్రుండైన భృత్యు నేని
కడుపు కాటుకకట్టఁ గట్టినకడవెల్లఁ గలయఁ ద్రిగ్గెడి బిచ్చగాని నేని
యింద్రియపాటవం బిసుమంతయును లేక వర్తించు ముదుసలివాని నేని
వ్రతశీలుండై యెల్లవాంఛల దిగనాడి చరియించుచుండెడి సాధు నేని
గీ॥ నాదుకడపలోనఁ బాదంబు నిడకుండ నీ వహర్నిశములు నిటవసింపు"
మనుచుఁ గాఁపువెట్టి తనదైన వడ్డివ్యాపారమునకు రాచబాటలోన ౨౩౯

వ॥ ఒక్క మేడయేర్పఱచుకొని మంత్రులుం దానును బగలెల్ల నందయుండుచు దురాత్ముండై పిల్లనిచ్చిన మామకుంగూడఁ బిడికెఁ డన్నంబు పెట్టక కట్టు పుట్టంబులం దప్పఁ గాంత నేని కనకాభరణంబులం గై సేయక యామద్వయంబున కావాసంబున కరుదెంచి భార్యకును దనకును బ్రాహ్మణున కొక్కనికిని సరిపోవు తండులంబులం గొలిచిపోసి యన్నంబు తిన్నతోడన వ్యావహారికమందిరంబున కరిగి మరల సాయంకాలంబున కరుదెంచుచుండుటయు ౨౪౦

సీ॥ పాథఃప్రపూర్ణమహా పల్వలంబునుండి మహిమీఁదఁబడినట్టి మత్స్యిభంగి
రవి యస్తమించినయవల నెట్టఁ త్యక్తవల్లభయౌ చక్రవాకిపగిదిఁ
బతిసంచరించెడి పథమెఱుంగఁగ లేక యల్లాడు నల రాజహంసిమాడ్కి
నతిభయంకరమైన యటవీస్థలంబులో మగఁడు మార్పడఁ గుందు మృగివిధమునఁ
దద్దురాత్ము పత్ని తాద్బ్రహ్మహార్మ్యమంతటికిని నొకతయగుచు నెంత
వఱకుఁగూడఁ బ్రొద్దు జరుగమికిని నిత్య మమ్మలికము గుడుచుచుండవలసె, ౨౪౧

వ॥ అతం డహరహంబును నన్నమున కరుదెంచెడి యవనీసురుం జూచి ౨౪౨

తే॥ "బాపఁడా! మద్గృహమున సాపడెడియంత సేపుఁ దలవంచుకొనియుండు, చెప్పినాఁడ,
నట్లు కాకుండఁ దలయెత్తి యస్మదబలవంకఁ జూచితివేని నీ వింక మనవు" ౨౪౩

వ॥ అని చెప్పుచుండెడివాఁడు, చెప్పుటయే కాక తలయెత్తి తనతరుణిం బరికించి నందులకై యనేకుల తలలు ద్రబ్బలొనరించికూడ నున్నవాఁడు, దానంజేసి భీతిల్లి యెవ్వరును వానియింటికి భోజనంబునకుఁ బోవకుండిరి, యంతఁగొంతకాలంబునకుఁ బుష్పం డను భూసురుండు తీర్థయాత్రాప్రసంగంబునఁ దత్పురంబున కరుదెంచె, నతండుచూడ సొంపైనవాఁడును బూర్వవయస్కుండును, దారి నడచినడచి యూఁకలిగొని మట్టమధ్యాహ్నంబున నం దరుదెంచి యాయా గృహస్థులయిండ్లకన్నార్థియై యరుగనరుగ నంత

అను మణిభద్రునింటికిం బొమ్మని మాపుటయు నతనిఁ గనియునేగి భోజ్యంబును యాచించి ౨౪౪

క॥ "తలకాయ వంచుకొనియే సలుపఁగవలె భోజనంబు క్ష్మామరవర! యా
లలి సలుప కస్మదంగనఁ దిలకించితివేని పైని దెబ్బలువడెడిన్" ౨౪౫

వ॥ అని తానును నాజ్ఞాపింపఁబడి ౨౪౬

క॥ వేదాధ్యయనమొనర్చితిఁ, బోఁదలఁచితిఁ దీర్థసేవఁ బొనరింపఁగ, నా
మీఁదట నాకలిగొంటిని, దావృశుఁడ నిఁకేల యన్యదారనుఁ జూతున్" ౨౪౭

వ॥ అని వాక్రుచ్చుటయు మణిభద్రుండు మంచిదిరమ్మని తనవెంట రాజమార్గంబునం దోడ్కొనిపోయి ద్వారపాలకుఁడగు కాజ్ఞావాని సమీపంబునం దాబాపనిం గూర్చుండఁబెట్టి గృహంబునం బ్రవిష్టుండై పరిమితధాన్యంబు భార్యకుం గొలిచియిచ్చి దేవతార్చనచేసికొని వైశ్వదేవాంతంబున వసుధామరు నాహ్వానించి చరణంబులు గడిగి యర్ఘ్యపాద్యాదులాచరించి యన్నంబువడ్డించుటయు నతండు కూర్చుండి భుజించుచు నధోముఖుండయియె యంబుజసన్నిభంబులగు నతని యర్ధాంగి యంఘ్రు లవలోకించి యవలోకించి వయోవంతుఁడగుట వలపుపట్టనేరక ముఖంబువీక్షించె, నంత మణిభద్రుండు కుపితుండై నపుంసకుంబిలిచి వీని విడంబింపుమనుటయు వాఁడువచ్చి ధరామరు శిరస్స్ఫోటనంబుగావించెఁ, దత్క్షణంబ యతఁడు నెత్తురుగ్రక్కుచు నేలంగూలుడుఁ దద్భృత్యుం డాయన పాదంబులు రెండుం బట్టుకొని జనసంచారభూయిష్ఠంబగు చతుష్పథంబువఱకు జఱజఱ నీడ్చుకొనిపోయె, నప్పు డప్పురవరంబునంగల ప్రజ లెల్లరు నది విలోకించి యత్యంతము హాహాకారంబునొనరించి, రందుఁ గొందఱు జాలిం దాలి చల్లనీళ్లుచల్లి చెవులుమూసిరి; యంతఁ గొంతవడికి నెట్టకేల కాబ్రాహ్మణుండు తెలివినొంది ౨౪౮

ఆ॥ "ఎవనిముల్లెఁగూడ నే దొంగిలింపను, నెవనియాలిమీఁద నేని పడను,
నిట్టివానిఁబట్టి కొట్టించె మణిభద్రుఁ, డార్యులార! చూడుఁడయ్య మీరు, ౨౪౯

ఆ॥ తీర్థములనుగుఱింకఁ ద్రిమ్మఱుచున్నాఁడ, బ్రాహ్మణుఁడను, మఱియు బ్రహ్మచారి,
నట్టివాని నింటి కన్నంబునకుఁబిల్చి యిట్లొనర్చినాఁడు, హితమెయిద్ది? ౨౫౦

క॥ ఈఁ డెవ్వఁడు నీపురమున లేఁడొకొ జనులార! యున్న లేశముగూడన్
గీడొనరింపనిబాపని మా డేలా పగులఁగొట్టు మణిభద్రుఁ డిటుల్" ౨౫౧

వ॥ అని విలపించుటయు జనులిట్లనిరి, ౨౫౨

శా॥ "రాజానుగ్రహపాత్రుఁడైన యితఁ డీర్ష్యాపూరితుండౌచు నీ
భూజం బెక్కురుజన్నిగట్టులను గుయ్యోయనాఁగఁ గొట్టించె, నీ

న్నీ జాల్మ! యనలేఁ డొకండుఁ, గనుకఁ జింతిల్ల కేతెమ్ము, నిన్
బూజింపంగలవార మన్నమిడి యో భూదేవ! యేమియ్యెదన్" ౨౫౩

## —* పుష్పుండు సూర్యునివలన వరంబును బడయుట *—

వ॥ అనియిట్లు బోధించుటయుఁ బుష్పుండు క్రుద్ధుండై ౨౫౪

ఆ॥ "ఈదురాత్మకునకు నేను బ్రీతిక్రియ యాచరించుదాఁక నన్నమును భు
జింపఁ గానఁ దెలియఁజెప్పుఁడీ యేదేవుఁ డిట వరప్రదుండొ యిద్ధమతులు!" ౨౫౫

వ॥ అనియడుగుటయు మఱియుఁ బ్రజలిట్లనిరి, ౨౫౬

తే॥ "ఒక్కఁడే దేవుఁ డిచ్చోట నున్నవాఁడు శీఘ్రసిద్ధిప్రదుండయి క్షితిసురాగ్ర్య!
మఱియునొకదేవతయు నిందుఁ బరఁగుచుండె, భక్తులకు నా వెగూడ శుభంబు

వ॥ అనినవిని క్రమ్మఱఁ బుష్పుండు ౨౫౮ [ లొసఁగు, ౨౫౭

తే॥ "ఎవ్వరా దేవి? దేవుండు? నీస్థలమున కెంతదవ్వున నున్నార? లేది స్థాన?
మంతయును మీర లోజనుల! సుంత కరుణయుంచి వాక్రువ్వుఁ డయ్య, నుతించువాఁడ,

వ॥ అని వేఁడుటయు వెండియుం బ్రజలు ౨౬౦

తే॥ "అల చమత్కారపురమున యాజ్ఞవల్క్యసుప్రతిష్ఠితుఁడైనట్టి సూర్యదేవుఁ
డున్నవాఁడని మును వినియున్నవార, మనఘ ప్రత్యయకారకుండఁట యతండు,

ఆ॥ సవితృవారయుక్తసప్తమి నాటయెన్మిదిప్రదక్షిణములు మిగులభక్తి
హస్తధృతఫలముగ నా దేవునకుఁ జేయ నభిమతార్థసిద్ధి యగునటంద్రు, ౨౬౧

తే॥ అట్లు కాశ్మీరసంస్థితయైనయట్టి శారదాదేవిముందఱఁ జాలభక్తి
నుపవసించినయంతనే యొనరుసిద్ధి, యేమిగలదింకఁ జెప్ప మహీసురేంద్ర!" ౨౬౩

వ॥ అనినవిని యప్పు డచ్చోటనుండి చమత్కారపురంబునకరిగి సప్తమీభానువాసరంబున స్నానంబొనరించి శుచియై సమాహితమతిం దద్యాజ్ఞవల్క్యప్రతిష్ఠితుం డగు నాదిత్యున కేకైకనారికేళఫలప్రదానపూర్వకంబుగా నష్టోత్తరశత ప్రదక్షిణంబు లాచరించి క్షుత్క్షామకంఠుండును బరిశ్రాంతుండును దృఢభక్తియుతుండును నై తదగ్రంబునం గూరుచుండి "యదేతన్మండలంజపతి, సప్తయుంజంతి రథమేకచక్రం" మొదలగు మంత్రంబులును మఱియు సూర్యప్రీతికరంబులగు స్తోత్రంబులును మఱియొక భానువారంబువఱకు నుచ్చైస్స్వరంబునం బఠించినను దద్దేవుండు పరితుష్టుండు గాకునికిఁ బౌర్ణమాసీదినంబునఁ బరమవైరాగ్యమూని భూనామమంత్రంబున స్థండిలార్థంబుగా భూమి నుపార్జించి హస్తమాత్రంబగు స్థండిలంబు స్థండిలంబునం గల్పించి యగ్నిమీళేయను మంత్రంబున నందగ్ని నారోపించి త్వక్షైః పరిస్తృణామి యను మంత్రంబున

బ్రహ్మాసనంబొసంగి సుత్రామాణ యను మంత్రంబున సమిధల స్థాపించి ప్రోక్షణ పాత్ర లాసాదించి సకలపాత్రలను స్రువాదులను యథాక్రమంబుగం బ్రోక్షించి యంత హవిస్థానంబున విజతనువుం గల్పించి యాచార్యవిధానంబుచే సూర్యాయత్వా యనుమంత్రంబున దేవతాస్థానమందు న్యాయమైన గ్రహాణప్రోక్షణంబులుగావించుచు "అయంతఇధ్మఆత్మా" యనుమంత్రంబున సమిధల మంత్రించి "అగ్నయేస్వాహా, సోమాయస్వాహా, యను రెండుమంత్రంబుల రెండాజ్యాహుతులు వ్రేల్చి భూర్భువస్స్వయని వ్యాహృతిహోమంబొనరించి 'ఏతేశత"మన్న గు మంత్రంబుల దారుణంబుగా వ్రేల్చి దేవా! పత్యక్షుడుగుమని యాహ్వానించి పదపడి శస్త్రంబుచే ఖండించి లోమంబులనుండియు దిశలనుండియు విదిశలనుండియు నిజమాంసములు హవిర్భుజుని యందు వ్రేల్చివ్రేల్చి తుద కాత్మనుగూడ వ్రేల్పంబోవుటయునూర్యుండుప్రత్యక్షంబై సాదరంబుగా స్వకరంబునం బట్టుకొని ౨౬౪

చం॥ సలుపకువిప్ర! సాహసము, క్ష్మాస్థలి నెవ్వఁడు నెప్పుడేని యే
స్థలమున నిట్టిహోమమును సల్పియెఱుంగఁడు గాన నేను నీ
సలిపినదాని కెంతయును సంతసమందినవాఁడ, నేమిగా
వలయునొ చెప్పు, మీఁదగనివాంఛితమేని యొసంగిపోయెదన్" ౨౬౫

వ॥ అని యనుగ్రహించుటయుఁ బుష్పండిట్లనియె, ౨౬౬

కం॥ "తుష్టింజెందితివేని మదిష్టం బొడఁగూర్చెదేని యి మ్మిరుఘుటికల్,
దుష్టాత్ముఁడొకఁడు నాకు ననిష్టముగావించెఁ, జని జయింపఁగవలయున్, ౨౬౭

సీ॥ క్షత్త్రియజాతినే జననమందెనుగాని కులమున కయశస్సు గూర్చినాఁడు
అర్థార్జనంబునం ధాటితేఁ ఱెనుగాని పిసినిగొట్టుతనంబుఁ బెంచినాఁడు
వామనుండనుఖ్యాతి వడయఁగల్గెనుగాని కరము వైరూప్యముం గాంచినాఁడు
ముదతలువడ నొడ లున్మదకుఁడయ్యెనుగాని స్త్రీమోహమునఁ బట్టు చిక్కినాఁడు
పాడు దేహాభిమానంబు వీడలేక పరమనీచాత్మకుం డనంబడుచు సకల
జనులచే దూష్యమాణుఁడై జగతి వైదిశాఖ్యపురమున మణిభద్రుఁడనెడివాఁడు

తే॥ గుటికలనురెంట నొకదానిఁ గొంచు నేను బుక్కిటం బెట్టుకొని యెన్నిపూఁటలుందు
నన్నిపూఁటలు మణిభద్రుఁడగుచు నుండవలయును వికల్ప మొక్కింత గలుగకుండ,

తే॥ వెండియును దాని నానోటినుండి తీసి యెపుడు రెండవదానిని నే ధరింతు
నపుడు నారూపమును నేన యందవలయు వాని చెడురూపు వానికే వదలిపెట్టి,

చం॥ ఇదియునుగాక వానియిలు నేఁజని చూచినయంతమాత్రనే
పదిలముచేసియుంపఁబడు బంగరు వెండి ధనంబు ధాన్యమున్

విదితములై చెలంగవలె, వేయివచింపఁగ నేల, వాని యా
స్పద మఖిలం బెఱింగి ప్రజ వాఁడే యనఁగ మెలంగఁగావలెన్, ౨౨౧

ఆ॥ వానిరూపుదాల్చి వానిగృహంబులో నుండునపుడు తత్పురోత్తమమున
నెవని కేని భేదమేర్పడరాదుమా సకలవర్తనమున సవితృదేవ!" ౨౨౨

వ॥ అనియిట్లు వరంబుఁగోరుటయు భాస్కరుండు ౨౨౩

తే॥ "నొకటధరియించుమాత్రన నాత్మ రూపములవడం జేయుఘుటికాద్వయముఁగ్రహింపు,
మొకటి నల్లని దందులో, నొకటి తెల్లనిదిగనుండును బుష్పావనీసుపర్వ! ౨౨౪

క॥ నల్లనిఘుటికం బుక్కిట నల్లనధరియింప నతనియాకృతి నొదవున్,
దెల్లనిదిదాల్పఁ గ్రమ్మఱఁ ద్వల్లలితాకృతి ఘుటిల్లుఁ దప్పకనీకున్" ౨౨౫

వ॥ అని వక్కాణించుటయు వెండియుఁ బుష్పుండిట్లనియె, ౨౨౬

ఆ॥ "అస్మదీయహృదయమం దొక్కసందేహమేరుపడియె నోసురేశ! యిపుడు,
దానిఁ దీర్చితేని తప్పక నీకీర్తి విస్తరించు, నానివిను వచింతు. ౨౨౭

మత్తకోకిల॥ ఆదిహారపుసప్తమిన్ ఫలహస్తుఁడై యొకనాటికి
నీమ్మఁద నెన్మిదివారములు గ్రహీనీకుఁ దా వలగొన్న చో
నేదురాత్మునకేని మెచ్చి యభీష్టమిత్తువటంచు నే
వైదికేస్థజనుల్వచింప దివాకరా! శ్రవణించితిన్, ౨౨౮

ఉ॥ పాపికి మూఢచిత్తునకె వైశమ సిద్ధియొసంగు నీవు యా
త్రాపరతం జతుష్క్రితులఁ దప్పక పారము సేసినట్టి యీ
పాపని సప్తరాత్రు లుపవాసములం గృశియింపఁజేసి హా
మోపరి దర్శనంబిడ, తహా! యిది యేమికతంబొ చెప్పుమా" ౨౨౯

వ॥ అని యిట్లు ప్రశ్నించుటయు సూర్యుండు ౨౩౦

కం॥ "తామసభావముతోడను నో మహీసుర! నీ విదంతయును జేసితి, విం
కేమని చెప్పుదు నీతోఁ, దామసమునఁజేయుపని వృథాయగుచుండున్" ౨౩౧

వ॥ అనివాక్రుచ్చి సూర్యుండు ఖండితంబులగు నతని యవయవంబులు నిర్వ
ణంబులుగా స్వకరంబున స్పృశియించి ప్రసన్నవదనుండై మఱియునిట్లనియె, ౨౩౨

ఉ॥ ఇట్టులె సౌమ్యభావమున నెంతయు నర్కసమిత్కుశాక్షతల్
వెట్టి పహాపరివారములు వేర్చినవాని మనంబులోన ను
న్నట్టి సమస్తవాంఛలను నాతఁడు కోరనివానిఁగూడ నేఁ
బట్టుమటంచు నిత్తుఁజుమి బ్రాహ్మణ! యున్న నిజంబుఁ జెప్పితిన్" ౨౩౩

వ॥ అనియిట్లు పలికి సహస్రాంశుఁడేమార్గంబునఁ జనిననియు నేర్పడకుండ దీపంబు
వోలెఁ గనఁబడక యచ్చట నే యంతర్ధానంబుఁజెందె, ౨౩౪

షీవును నేనుఁ గూడి యొకచోయఁగు బంగరుపళ్ళెరంబునన్
సావధిగా భుజింతము శుభాస్యరో! సజ్జనకాంక్షచొప్పునన్ ౨౯౬

వ॥ అనినవిని యావిడ సంతసించుచుం దదుక్తవిధంబున భోజనాచ్ఛాదనంబు లొనరించి నిర్వికల్పచిత్తంబున వర్తించుచుండుగాఁ బుష్పుండు మోహపరవశుండై తదనంతర కృత్యంబునకుఁ బాయకొనియె, నంతలో మణిభద్రుండు దాఁటకొని వ్యవహారగృహంబు నుండి లేచివచ్చి తనయింటికిఁ బ్రవేశింపఁబోయి ద్వారపాలుండగు కొజ్జావానిచే నిషేధింపఁబడియు హఠంబునఁ గవాటమ్ములఁ గాలు వెట్టునఁ దాఁచు కత్తిఁదీసి కొని బుద్ధి భ్రష్టుఁడాగాఁ బింతె, నంత నేలంబడి కర్తవ్య మెఱుంగలేక వ్యాకులభ్రాంతుండుగాఁ దన్మార్గంబునంజను జనులు వచ్చెఁ బచ్చెనని కలకలంబొనరించి ౨౯౭
తే॥ "ఛీఛీలా! యేమికార్యంబుఁ జేసితివిర, మొద్దువై కూటిలో మన్నుఁబోసికొంటి,
కిరయొనర్చినపనినుండి యిపుడు నీవు వచ్చితివి రాజుచేతిలో సత్యముగను" ౨౯౮
వ॥ అని చీకొట్టుచుము వండఁడెట్లనియె, ౨౯౯
మ॥ "నా యీకొల్వను దీయఁజూడఁ దలఁ, దెన్నన్ స్వంతరాపీడితం
బై యస్మన్మన ముండలేను, బహురూపాఖ్యుండుగాని యతం
డీ యిల్వెట్టెడి నా యనుఁగుదోరగాఁ, డేలాగొ తద్వేషమున్
వేయన్ నేరిచి యాస్న సేయుటకుఁ గా విచ్చేసె నిచ్చోటికిన్, ౩౦౦
తే॥ ఇంటిలోపలికిం బోవమీయటంచు నఱుచుచున్నను సరకుసేయక ప్రవేశ
మొనరుపంబోవుటయు నన్నొ యొక్కదెబ్బఁ గొట్టినాఁడను దలమీఁదఁ గోపవశత,
కం॥ మణిభద్రుఁడిపుడు బలభిన్మణిహర్మ్యములోన భోజనముఁజేసి సభ
ర్మిణి కాపులాత్తిఁ బకకొనె, నణుమాత్రమెఱుంగఁ డీవని యాగమనంబున్"
వ॥ అని యిట్లు పలుకుచుండుటయు నా కలకలంబువిని పుష్పుండు మణిభద్రు రూపంబునం దలవాకిటికివచ్చి ౩౦౨
చం॥ "అనుదిన మస్మదీయమగు నాకృతిదాల్చి వచ్చుమందు వీఁ, డనుచితమాచరించెఁ గను యాచకుఁగొట్టి నపుంసకుండుతా,
దిన మొకతీరువేషమును దీర్చి ధంజిలఁజేసి భూప్రజన్
ధనముగడించు నర్థజనతండముఁగొట్టుట ధర్మచూస్నొకో" ౩౦౩
వ॥ అని రక్కాణించుచుండుటయు మణిభద్రుండు లేచి యగ్రభాగంబున నాత్మసముండగు పురుషుఁ గలయవిలోకించి ౩౦౪
కం॥ "ఎక్కడివాఁడవురా యోతెక్కలికాఁడా! కృతాస్మదీయాంగుఁడవై
రొక్కమున వండు వలలోఁ జిక్కంజేసికొని [illegible] టుఁజేరితి విటులన్ ౩౦౫

ఆ॥ ప్రభువుపాలికేగి పాపీ! నపుంసక నిను వధింపఁజేయుదనుకనుండఁ
గాచటకేఁచని యిసీ తలవాఁచుము, మ్మేమిటికి వృథాగ నీలిగెదవు" ౨౦౬

వ॥ అనిపచించుటయుఁ బుష్పుండిట్లనియె, ౨౦౭

శా॥ నారూపంబును నీవెదాల్చి, కడఁకన్ నాయింటికేతెంచితి,
ట్లోరి! నేనిపు డింక లేచునుగా నున్నాఁడఁ, గొంపోయి నిన్
మా రాజేంద్రున కొప్పఁజెప్పెదను, జంపంబను నాతండు, పో
పోరా క్రూరా! వితాగ నేల యసువు ల్పోఁగొట్టుకొం దీగతిన్, ౨౦౮

వ॥ అంయి ట్లొండొరులు బాహాబాహిం బోరు దొరకొనుటయును నితరులువచ్చి యొట్టకేలకు విడిపించిరి, పదపడి మణిభద్రుఁడు బంధుగులం దయదెంచి తాదాత్మ్యమైపోయు వాలిసుగ్రీవులుంబోలెఁ గ్రోధతామ్రాయతాక్షులై నీవుకొంగవన్న నీవుకొంగవని వివదించుకొను వారియిరువురిలో మణిభద్రుఁ గుఱుతింపలేక తదుభయులం దోడ్కొని రాజద్వారంబుసొచ్చి ద్వారపాలు ద్వారంబునఁ జేరోలగంబుండు పృథివీపతికి విన్నవింప నయ్యొడయుండు నడతెంచి వేషభాషలలో నుభయులకుంగల విభేదంబు దెలియనేరక వితర్కింపమొదలిడి రహస్యంబులును బ్రత్యక్షంబులును నగు నంశంబు లిరువురిం బ్రశ్నించి యిరువురివలనను యథార్థమైన ప్రత్యుత్తరంబు వడసె, నంత బంధుగులందఱు నొక్కొక్కరి విడఁదీసి గోత్రనామాత్రంబులు ప్రశ్నింప నుభయులుం దప్పక చెప్పి, రంత నయ్యేగారవమణుఁ డెల్లరం బిలకించి ౨౦౯

క॥ "ఇమ్మణిభద్రునియిలు వేఁగమ్మగఁజని యతనిసతిని గైకొనిరం, డా
కొమ్మయె తనపతిఁ దెలుపఁగ నమ్మ ప్రమాణమ్ము, దెలియరాదిక దేనన్" ౨౧౦

వ॥ అనిసెలవిచ్చి తద్బంధువులం బంప వార లావెలఁది కఖిలంబు నెఱింగించి తోడ్కొనివచ్చిరి, పదపడి యాయమ ప్రచ్ఛాదితశిరస్కయు వ్రీడావనతాననయునై రాజసమ్ముఖమ్మున నిల్వఁబడుటయును నాయన ౨౧౧

ఆ॥ "నిజమెఱుంగలేము నీరేజముఖిరో మే, మిత్త్రబంధువులను నెఱుఁగఁజాల,
రీవె చాలసేపు భావించి నీప్రియభర్త యెవరో యిందు గుర్తుపట్టు" ౨౧౨

వ॥ అనియాజ్ఞాపింప నాప్రతీపదర్శిని ౨౧౩

క॥ "మణిభద్రుఁడు తన యీర్ష్యాగుణవహ్నిని నన్నుఁ గాల్చుకొని తినుచున్నఁ,
దణుమాత్రసుఖములే దీక్షణపముకడ నాకుఁ, బిసినిగొట్టు కరంబున్, ౨౧౪

క॥ నాతండ్రిని వంచించి వృథాతురతను నన్వివాహమాడినవాఁడీ
ప్రేత, యపు డిత్తునను కలధౌతం బిప్పటికి నీయఁదలఁపఁడు మదిలోన్, ౨౧౫

చిరి, పరకీయమైన విభవం బివ్విధంబుగా నతనికి సంప్రాప్తమగుటయు భార్యాసహితం బుగా స్వేచ్ఛమై ననుభవించె, ౨౪౯

—: పుష్పుఁడు పాపపరిహారార్థము హాటకేశ్వరంబున కరుగుట :—

ఉ॥ మరునాఁటి రాత్రి మోహిని పుష్పునకు నిద్దుర నున్నప్పు డొద్దఁజేరి
యెఱుఁగఁగోరి వివర మొనరు నవికుండ ముట్టుకొని పదంబు లిట్టులనియె,
మ॥ "యావజ్జీవ మసత్యమంబుగను నాకై తీవు నాథుండవు, నా
దేవానాంప్రియము సంత్యజించితివి ద్వత్ప్రత్యక్షమై కాన నీ
ప్రావీణ్యం బది యైంద్రజాలికమొ మంత్రప్రాప్తమో దేవతా
సేవాలబ్ధమొ చెప్పు, మీదృశుఁడవై చెన్నొందె దబ్రంబుగన్, ౨౫౦
తే॥ నగలు నాణెము లిడి నాకు సొగసుఁజేసినట్టి తొలిదినమునను నీ యఖిలవార్త
కపటసంభవమని యెఱుఁగంగఁగలిగితిని మనోనాయకా ! నేను నిశ్చయముగ"
వ॥ అని యిట్లు వక్కాణించుటయు నతండు పక్కున నవ్వి కౌఁగిటఁ గ్రుచ్చుకొని ౨౫౧
ఉ॥ "బళిబళి ప్రాణనాయికరో బాగుగ నన్నుమనంతమంతయున్
దెలిసికొనంగఁ గల్గితి, త్వదీయముఖాబ్జము చూచినంతకై
ఖలమణిభద్రుచేతఁ దల కాయపయిం బ్రహరింపఁబడ్డ యా
సులలితకాయుఁడన్ ద్విజుఁడ సుందరి ! నే నిఁక నేమి చెప్పుదున్, ౨౫౨
తే॥ హాటకేశ్వరమున కేగి యటఁజెలంగు సూర్యభగవానుఁ గొల్వ నాయార్యుఁడంత
నాకు మణిభద్రురూపమున్ జ్ఞానముఁ బ్రసన్నుఁడై దయచేసె నో చంద్రవదన!"
వ॥ అని మధురాక్షరంబుగా నుడువుటయు నప్పడంతి మఱియు నిట్లనియె, ౨౫౪
ఉ॥ "నినుఁగనుగొన్న తత్క్షణము నీరజబాణున కగ్గమైతి నాఁ
డినుఁడు తదాకృతిన్ మరల నీయక యుండఁడు, గాన నేగి య
య్యినఘు భజింతు, నిట్టినను నక్కునఁజేర్పకయున్న నాకు నీ
యనుపమరూపమే మిటికి, యౌవనమే మిటికిన్ వృథా విభూ !" ౨౫౫
వ॥ అనిన విని పుష్పుఁడు నోటనున్న ఘుటికం దీసి యా యన్నుమిన్న మున్న న్నరూపంబును ధరించుటయు నావె సంతసంబునం బొంగుచుఁ బులకాంచిత గాత్రియై యతనిని గాఢంబుగం గౌఁగిలించుకొని ౨౫౬
తే॥ "ఇపుడు సఫలమయ్యె నెంతయు నా జన్మరూపయౌవనములు రూఢముగను,
మదినిగోరినట్టి మన్మథవిగ్రహా మీవు మగఁడవై తిఁ కేమికొదవ, ౨౫౭

ఆ॥ ఇంతవఱకు నే నొకించుకయైనను బంచబాణసుఖముఁ బడసినాఁడఁగ,
ముసలినొద్ద నేమిముచ్చటందెదవు, నీ కర్గమైతి స్వేచ్ఛ ననుభవింపు॥ ౨౫౯

వ॥ అని వాక్రుచ్చుటయుఁ బుష్పుండిట్లనియె, ౨౬౦

ఆ॥ "యౌవ్వనవయసముల నొగిఁ బ్రవేశింతునా? యైక్యయందుదున త్వదంగమందుఁ
పెద్దకాలమునకుఁ బ్రేయసీ! లభియించి, తేమి సేయఁదోఁప, దేమనందు" ౨౬౧

వ॥ అని పలికి మన్మథవశుండై మైథునంబున కుపక్రమించి యెంతప్రొద్దు చని నదియు నెప్పుడు తెల్లవాఱినదియు నెఱుంగ నేరక యింతియుం దానును నేకాకృతిని భజించి యిత్థంభూతకలాశిక్షాదక్షులై యినుం డుదయించుటయు నల్లయుండ మెల్లన నోటం బెట్టుకొని మరల మణిభద్రురూపంబు ధరియించి యిట్లు పగలెల్ల మణిభద్రుండును రాత్రి పుష్పుండును నై పెద్దకాలముండి కొడుకులను బిడ్డలను గొడుకుల కొడుకులను గాంచి వృద్ధుండై ౨౬౨

ఆ॥ "మాయఁబన్ని నేను మణిభద్రుఁ జంపించి మగఁడనైతి వాని మానవతికి,
సంతుగూడఁ గంటి, నెంతయుఘమ్మున్, హాటకేశ్వరమున కరుగువాఁడ," ౨౬౩

## — పుష్పాదిత్యమాహాత్మ్యము —

వ॥ అని చింతించి కొడుకులకు వేఱువేఱ భాగంబులు పంచియిచ్చి లెక్కలేని రొక్కంబును గొంచుఁ జమత్కారపురంబున కరిగి యాదిత్యుని కాలయంబు గట్టించి సర్వాంగసుందరంబుఁ జేయించుకొని చాతుశ్చరణబ్రాహ్మణులకు సతీసహితంబుగా సాష్టాంగపడి ప్రాయశ్చిత్తముఁ జేయించుటకును దద్దేవునకుఁ బుష్పాదిత్యసంజ్ఞం బొనరించుటకును బ్రార్థింప వారలు

ఆ॥ "త్వచ్ఛుద్ధికొఱకుఁ దగిన ప్రాయశ్చిత్త మాచరించువార మంతెకాని
యాజ్ఞవల్క్యకీర్తి హాంయించుటకుమాత్ర మేము నిశ్చయముగ నిష్టపడము"

వ॥ అని చెప్పుటయు నందు మధ్యస్థవృత్తులగు మఱికొందఱు ౨౬౪

కం॥ "ప్రాయశ్చిత్తనిమిత్తము దేయం బొకలక్షధనము ద్విజపతి, కటులే
యీయాదిత్యుని వృత్తికినై యిమ్మొకలక్షతిత్తు మభిలషితంబుల్" ౨౬౫

వ॥ అని యందఱుంగలసి లక్షద్వయపరిమితధనంబు పుష్పునివలనం గైకొని తదారాధితుండగు దేవుఁ బుష్పాదిత్యసంజ్ఞం బిలువందొడంగిరి, యాజ్ఞవల్క్యప్రతిష్ఠితుండైనను నా దేవునకుఁ బుష్పాదిత్యసంజ్ఞ యీవిధంబుగా నేర్పడినది, ౨౬౬

## —౿ పురశ్చరణసప్తమీవ్రతవిధానము ౿—

శా॥ పుష్పాదిత్యుఁడటంచుఁ బేరుకొని యాభూదేవు లాభాస్కరుఁ
బుష్పార్చితుఁ జేయుచుండుటయు సంపూర్ణప్రమోదంబుతోఁ
బుష్పం డమ్మణిభద్రు భూమిపతిచేఁ బోకార్పగంజేసి త
త్పుష్పాంగిన్ హరియించుటాది సకలంబున్ స్వీయవృత్తాంతమున్ ౨౬౯
వ॥ వక్కాణించుటయు వార లలిగి ౨౭౦
కం॥ "ఛీపాపిష్ఠుఁడ! నీకిఁక నేప్రాయశ్చిత్తముండ, దీనీచిత్తం
బీపాతుఁ దిసికొనిచను, నీపాలిట బ్రహ్మహత్య నిలఁబడియుండెన్, ౨౭౧
తే॥ భూసురుఁడు క్షత్రియుఁడు వేరి మూవురును ద్విజాతులని స్మృతిశాస్త్రవిచక్షణులు వ
చించుచురు కాన క్షత్రియుఁద్రుంచినట్టి యీవు బ్రహ్మఘ్నుఁడైతి విసీ కుశీల!"
వ॥ అని నిందించుటయుఁ బుష్పండు దుఃఖించుచు బ్రహ్మస్థానంబునుండి
బయలు వెడలె, రోరూయమాణుండగు నతని విలోకించి నాగరబ్రాహ్మణులు కొందఱు
శా॥ "సర్వజ్ఞప్రతిముండు గానిద్విజుఁ డీస్థానంబునం దుండఁ, డా
యుక్త్వీదేవులయిండ్ల లేని స్మృతిముఖ్యోద్గ్రంథము ల్గానరా,
వీ క్ష్వింక్షింపుఁడువానిఁ బ్రాజ్ఞులుకరం, బేదేనిసంశుద్ధి యా
పూర్వాచార్యులు వ్రాసినట్టిసుకృతు ల్శోధింపఁగంగల్గెడిన్" ౨౭౪
వ॥ అని వాకుచ్చుటయుఁ జండశర్మయను నొకబ్రాహ్మణుండిట్లనియె, ౨౭౫
తే॥ "ఏను స్కాందపురాణమం దెప్పుడును బురశ్చరణసప్తమియటంచు రమణఁ జదువు
చుందును, బురశ్చరణమునసుండిపోలె దానసుండియుఁ బోవుఁ బాతకము, నిజము,
కం॥ కానఁ బురశ్చరణాభిధమై నెగడెడి సప్తమిని మహాశ్రద్ధమెయిన్
దానొనరించును గావుత, మేనఃక్షయమగును వెంటనే రూఢముగన్, ౨౭౬
తే॥ ఇదియునుంగాక తన్మేదినీశ్వరుండె భటులచేతను మణిభద్రు ప్రాణముల హ
రించెఁ గావున బాప మేతెంచునెడల దానికిన్ బాధ్యుఁ డాతండె తథ్యముగను,
తే॥ ఎవఁడు న్యాయాధికారియై వ్యవహృతిఁగల నిజమెఱుంగక నేరంబు నిర్ణయించి
శిక్షఁజెప్పును దాన సంసిద్ధమైనపాతకంబున కాతఁడే బాధ్యుఁ డరయ, ౨౭౯
తే॥ మఱియు నాతండ్రి భూసురమధ్యమునను బ్రీతి నీతనికిచ్చి నా పెండ్లిచేసె
ననుచు వచియించె నాతని యర్ధదేహి యాపె కేకాక యెవరి కాయఘముచెందు?
కం॥ అపకృతుఁడైయీతఁడు తా నపకృతిగావించె మగుడ, నా హేతువునన్
విపరీతముగాదిది, యిఁక సుపథముగనె నిశ్చితంబు సుజ్ఞానులచేన్, ౨౮౧
కం॥ కృతమునకుం దగుమాదిరి ప్రతికృతియును హింసమునకుఁ బ్రతిహింసనమున్
గృతమైన దోషముండదు, హితము యగును దుష్టు దౌష్ట్యహృతిఁజేత కనన్"

వ॥ అనియిట్లువాక్రుచ్చుటయు భూదేవులు ౭౭౩
తే॥ "ఇట్టులగుచో ద్విజోత్తమ! యా పురశ్చరణసమాహ్వాయస ప్తమి రమణ మీ వ
రాచరణకు నీవు వాకొను, రమణ దానివలన సంశుద్ధుఁడయ్యెడు వడి నితండు" ౭౭౪
వ॥ అనిపలుకుటయుఁ జండశర్మ యతని కదివచియించె, నతండు దాని వాచ
రించి యొక్క సంవత్సరమునకు గతకల్మషుండయ్యె" ననిన మునులిట్లనిరి, ౭౭౫
ఆ॥ "ఆ పురశ్చరణాభిధమైనయట్టిస ప్తమిని నెట్టివేళను సలుపవలయు?
సలుపువేళను దానికి వలసినట్టి విధియదెట్టిది? చెప్పుమయ్య విస్తరించి" ౭౭౬
వ॥ అని యిట్లు వాక్రుచ్చుటయు సూతుండు ౭౭౭
తే॥ "రోహితాశ్వుఁడడుగ రూఢి నా మార్కండముని వచించెఁ బూర్వమునను దీని,
నిపుడు మిమ్ముఁగూర్చి యే వచియించెద, వినుఁడు శౌనకాదిమునులు! మీరు, ౭౭౮
వ॥ మార్కండమహాముని హరిశ్చంద్రకుమారుండగు రోహితాశ్వుండు దగ్గతి
కం॥ "తెలిసియొ తెలియకొ జన మియ్యిలపై నొనరించుపాప మేమార్గమునన్
దొలఁగంగలదో యించుక తెలుపంగదె సంయమీంద్ర! తేజస్సాంద్రా!" ౭౮౦
వ॥ అనియడుగుటయు మార్కండేయుండిట్లనియె, ౭౮౧
ఆ॥ "మానసిక మొకండు మఱి వాచికము రెండు కాయికంబు మూఁడుగా నఘంబు
మూడువిధములుగను భువిలోన జనులకుఁ గలుగుచుండుఁజుమ్ము కాశ్యపీశ! ౭౮౨
కం॥ వాని వినాశనమునకై భూనాయక! మూఁడుపాయములుగల, వవి నీ
కేనువచించెదఁ గర్ర మవధానముతోఁ గూరుచుండి తప్పక వినుమా, ౭౮౩
కం॥ మానసమై యేపాపము మానవులకు సంఘటించుమహిఁ బశ్చాత్తా
పానంతర మదియుండదు క్ష్మానాయక! నిముసమేని సత్యంబిదిమా, ౭౮౪
ఆ॥ వాచికంబు వేగపడి యాచరింపక మది విమర్శచేసి మానవుండు
మానుకొనినయెడల మాసెడి నయ్యది యర్కతేజ! రోహితాశ్వరాజ! ౭౮౫
ఉ॥ కాయికపాతకంబు ద్విజకాండమునొద్దకు నేగి చెప్పి యా
ధీయుతు లాజ్ఞ యిచ్చినవిధిం గృతనిష్కృతి యైయెు లేక భూ
నాయకుచే విమృష్టుఁడయి న్యాయ్యపుఁబద్ధతిఁ ద త్సుశిక్షితుం
డైయెు తొలంగద్రోసికొనవాను యథార్థముగన్ మహీవిభూ! ౭౮౬
ఆ॥ సిగ్గుచేత ద్విజులఁజేరి వచింపక రాజదండనంబు నోజనొంద
కేవఁడు మేనునున్న యేనప్పలోడనే కూలు వానిశిక్షకుండు యముఁడె, ౭౮౭
కం॥ కావునఁ బాపాత్మకుఁ డిల జ్ఞానివిబుధులనడిగి వారియానతి యెటులా
కావిధిఁ బ్రాయశ్చిత్తము గావించుకొనంగవలయుఁ గడుయత్నమునన్" ౭౮౮

వ॥ అని యిట్లుచెప్పుటయు రోహితాశ్వుండు ౮౯౯

ఆ॥ "అఖిలపాతకముల నపనయించుటకుఁగా నుపకరించు వ్రతము హోమవిధియొ
దానమో వచింపు దయఁ బురశ్చరణవివర్జితముగ నఘముఁబాయుపొంచె, ౯౦౦

ఆ॥ అనుదినంబు మర్త్యు డఖిలకార్యములలో సలుపు నీతో యంతో కలుష మూర్వి
వానికన్నిటికిని వరుసఁ బ్రాయశ్చిత్తమాచరించుకొనఁగ నలవియగునె? " ౯౦౧

వ॥ అనినవిని వెండియు మార్కండేయుండిట్లనియె, ౯౦౨

కం॥ "కలదు పురశ్చరణంబను కలుషఘ్నవ్రత మొకండు, గ్రహపతిహితమై
చెలఁగుఁ బురశ్చరణాఖ్యాయమిళితంబై నట్టి సప్తమీతిథి యధిపా! ౯౦౩

ఆ॥ ఆచరింపఁబడిన యద్దానిచే మేనఁజెలఁగుచున్నయట్టి చిత్రభానుఁ
డపనయించుఁ బ్రాగ్భవార్జితపాపంబ, యేతదుద్భవాఘు మేమిలెక్క, ౯౦౪

కం॥ కావున నేవారిచ్చిన యీవిధమునఁజేయఁగడఁగుమీ నరనాథా !
తావకదేహమునంగల యావత్కలుషముమున ఘుతుఁడవయ్యెదు వేగకా" ౯౦౫

వ॥ అనవుడు రోహితాశ్వుండు ౯౦౬

కం॥ యమివర ! పురశ్చరణసప్తమి యేవిధిచేతఁజేయవలయునో మఱియాక
క్రమమన కది సలుపందగు సమయంబెదో యానతిమ్ము శోధించుట లలికా"

వ॥ నావుడు మఱియు మార్కండేయుండిట్లనియె, ౯౦౮

ఆ॥ "మాఘశుక్లసప్తమీఘుస్ర మర్కవాసరసమేతమగుచుఁ బరగునెడల
మకరరాశిలోన మార్తాండుఁడుండఁగా నావ్రతంబుఁజేయనగును రాజ ! ౯౦౯

శ్లో॥ పురశ్చరణకృత్యాయాం సప్తమ్యాం దివసాధిప !
ఉపవాసం కరిష్యామి అద్య త్వం శరణం మమ ౯౧౦

తే॥ అనెడిమంత్రంబు జపియించి యరుణుపొడుపుకంటెఁ బూర్వమ పలుదోమి యధిక
బతితపాషండజనములఁ బలుకరింపకుండ నుండంగవలె నాఁ డహో నృపాల![నిష్ఠఁ

తే॥ అంత నపరాహ్ణసమయమం దధికభక్తి స్నానమొనరించి శుభ్రవస్త్రములుదాల్చి
చిత్రభానుని ప్రతిమను సిద్ధపఱచి దానికిం బూజగావింపఁదగు ధరేశ ! ౯౧౨

సీ॥ మఱి పతంగాయ నమయని పాదములను మార్తాండయని జానుమధ్యమునను
దివసనాథాయని దీప్తగుహ్యమునను ద్వాదశాత్మయని తత్సునాభి
పద్మహస్తాయని బాహువులను దీక్ష్ణదీధితేయనుచు వ్వావ్వీథియందుఁ
గమలాభయంచును గంఠంబు తేజోమయాయయంచును మస్తకాంతరమున

పాదమాదిగ శీర్షపర్యంత మిట్లు రక్తపుష్పంబులను సమర్చనముచేసి
విధియుతంబుగ ధూపంబువేసి యవల నెలమిఁ గర్పూరహారతి నీయవలయు,
క॥ ఎఱ్ఱనివసనముచేతను బిఱ్ఱుగఁజుట్టంగఁబడిన పృథుపాత్రములో
నెఱ్ఱని బెల్లపుటన్నము నొఱ్ఱుగ నైవేద్య మవల నొసఁగఁగవలయుఁ,
ఆ॥ ఎఱ్ఱదారములను నెంతయు వింతగా వత్తిఁజేసి తైల మెత్తిపోసి
వేడ్కతోడ జ్యోతివెలిగించి యారార్తికంబొసంగవలయు క్ష్మాతలేశ !
తే॥ శంఖముననుండి యుదకంబు సంగ్రహించి సఫలమును రక్తచందనసంయుతమును
నాచరించి యథావిధి నర్ఘ్యమీయవలయుఁ దదనంతరంబున వసుమతీశ! ౯౧౬
క॥ "తెలిసియొ తెలియకొ నాచే సలుపంబడియున్న యట్టి సకలాఘములుఁ
దొలఁగింపు మర్ఘ్యముంగొని బలుప్రాయశ్చిత్తమిది దివాకరదేవా!" ౯౧౭
క॥ అనియిటు సూర్యుం బూజితునొనరించి యనంతరమున నుర్వీసురపూ
జన మాచరింపవలయును ఘనముగఁ బుష్పానులేపగంధాదులచే, ౯౧౮
ఆ॥ కుడుపఁబెట్టి శక్తికొలఁది దక్షిణనిచ్చి తృప్తుఁజేసి యవనిదేవునిట్లు
పుచ్చుకొనఁగవలయుఁ బో పంచగవ్యంబు కాయశుద్ధికొఱకుఁగాను దాను
ఆ॥ దోసిలొగ్గియంతె నానూర్యభగవాయవంక నిశ్చలముగఁ బఱపిదృష్టి
వక్ష్యమాణమంత్రవరమును బఠియింపవలయు రోహితాస్యవసుమతీంద్ర! ౯౨౦
శ్లో॥ "ఇదంవ్రతం మయాదేవ గృహీతం పురత స్తవ
అవిఘ్నం సిద్ధిమాయాతు ప్రసాదాత్తవ భాస్కర," ౯౨౧
ఆ॥ మాఘమాసమాది మార్తాండదేవున కావిధమునఁ బూజయాచరించి
ఫాల్గునాది పుష్యపర్యంత మట్టులే చేయుచుండవలయు క్షితిబిడౌజ! ౯౨౨
ఆ॥ కుందకుసుమపూజ గుగ్గులుధూప మన్నము నివేదనంబు విమలగోమ
యంపుఁ బ్రాశనంబు నర్ఘ్యంబులయ్యెడి ఫాల్గునంబులోనఁ బార్థివాగ్ర్య! ౯౨౩
తే॥ చైత్రమందున సురభిచే జరిపి పూజ గుణిక నైవేద్యమునుబెట్టి కోరి సర్జ
రసముతో ధూపమును వేసి రహిఁ గుశోదకమును బ్రాశనమొనరింపఁ గలుగు శుద్ధి,
క॥ మోదుగుపూలం బూజయుఁ గాదనక నివేదనంబు కలుమాంసంబుల్
గా దధి ప్రాశనమొనరిచి యీఁదగు వైశాఖమునను ఘృతధూపంబుల్, ౯౨౪
క॥ కలిగొట్టుపూలచేతను బెలుచన పూజించి పేలపిండి నివేదిం
చి లలిం గపిలాఘృత ముత్కలికం బ్రాశనముచేయఁదగు జ్యేష్ఠమునన్, ౯౨౫
ఆ॥ అవిసెపూలఁ బూజ యగరున ధూపంబు విమలధారికను నివేదనంబు
సలిపి ఘృతమొ మధువొ యెలమి నాషాఢమాసమునఁ బ్రాశనంబు జరుపవలయు,

ఆ॥ కడిమిపూలఁ బూజగావించి దగరపుంబొగల నెగయఁజేసి మోదకములు
లలి నివేదనంబు సలిపి గోమయజలాశనముచేయవలయు శ్రావణమున,

తే॥ జాజిపూవులచేతఁ బూజనముచేసి నఖసముద్భూతధూప మెంతయును వేసి
పాలు నైవేద్యమొనరించి భాద్రపదములోనఁ బాలనె త్రావనొఁ దానుగూడ, ౯౨౯

తే॥ ఆశ్వయుజమాసమందున నంబుజములఁ బూజ ఘృతపూరి నైవేద్యమును బొనర్చి
కుంకుమంపుఁబువుం బొగకుఁ గ్విధించి కప్పురము ప్రాశనముచేయనొప్పు భూప!

కం॥ తులసిం బూజ నివేద్యము కలకండయుఁ బొగకు రమ్యకాసుంభికముఁ
వలయు లవంగప్రాశన మల కార్తికమాసమున మహావీరనృపా! ౯౩౦

తే॥ గుంటగలిజేరుపూవులు గుడము పేణి వేడ్క నర్చనధూపనైవేద్యములకు
నోలి నుపయోగపఱచి కంకోలభోక్తకావలయు మార్గశిరమున గహ్వరీంద్ర!

కం॥ శతపత్రికచేఁ బూజన మతులితసహాజంబు ధూప మల పౌషమునఁ
దతకుమ్మలి నైవేద్యం బతిబల! ప్రాశుక్తమెల్లఁ బ్రాశ్యమ్మగుఁబో,

తే॥ ఇట్లు పండ్రెండుమాసంబు లినుభజించి యంతఁ దనయింటనుండిన యర్థమందు
సరిగ నాఱవభాగంబు సర్వపాపశుద్ధికై యీయవలయు భూసురున కధిప!

కం॥ తరువాత శక్తికొలఁదిగ ధరణీసురవరుల కన్నదానముగూడఁ
జరుపునది, యివ్విధము భాస్కరసప్తమిఁజేయఁ దొలఁగు సకలాఘములుఁ"

వ॥ అనియిట్లు మార్కండేయుండు రోహితాశ్వునకుం జెప్పినచొప్పునఁ జండశర్మ పుష్పునకుఁ జెప్పుటయు నతండును దద్వ్రతం బాచరించి నిజగృహంబునఁగల స్వర్ణ రజతంబులను నితరంబునను నాఱవపాలు సమర్పించె, నావిత్తభాజనంబు నాగర బ్రాహ్మణులు తిలకించి ౯౩౬

—: సూర్యవరమునఁ జండశర్మాదులు బ్రాహ్మణాగరు లగుట. —

ఆ॥ ద్రవ్యలోభమునను దక్కటిభూమిదేవులఁ దిరస్కరించి పుష్పునితఁడు
తానె పెద్దయగుచుఁ బూని ప్రాయశ్చిత్తశుద్ధుఁజేసెఁ జూడుఁ డిద్ధమతులు!

ఉ॥ ఆఱవపాలు తద్ధనమునందు గ్రహించినవాఁడుగాన నీ
వీతఁడు బాహ్యభూతుఁడిక, వీనిగృహంబున కేగి యన్నముఁ
నీరముఁ బుచ్చుకొన్న యవినీతులఁ జుట్టరికంబుఁజేయు న
వ్వారును నేఁటినుండి కులబాహ్యులుగా గణనీయులెంతయుఁ"

వ॥ అని సమయంబుచేసి స్వనికేతనంబుల కేగుటయుఁ జండశర్మ పుష్పునుద్దే శించి ౯౩౮

కం॥ "ఈయూర్ధ్వపుత్రులిద్దఱుఁ బ్రాయశ్చిత్తమునకిష్టపడుటనె నీకేఁ
జేయించినాఁడ, నైనను న్యాయమె ననుఁ బతితుఁజేసినారలు వీరల్, ౫౪౦
ఆ॥ కాన మందు నిప్పుకలలోనఁ బడి నేను వేగఁ బ్రాణములను విడుచువాఁడ,
స్వజనులందఱిని విసర్జించి బ్రదుకుట కెంతమాత్ర మింక నిష్టపడను" ౫౪౧
వ॥ అని వాక్రుచ్చుటయుఁ బుష్పుండిట్లనియె, ౫౪౨
ఉ॥ ఇందులకై విచారపడ కీవు ద్విజోత్తమ! భూమిదేవతా
బృందము ద్రవ్యలోభమున నెగ్గొనరించినవారు నీకు, వా
రందఱు నెంతవిత్తమును యాచనచేతురో యంతయిచ్చి నిక్
జెందినయట్టి నింద్యతను శీఘ్రమపాపెద, నీర్ష్యయాపెదన్" ౫౪౩
వ॥ అనియిట్లు వాక్రుచ్చి సత్వరంబుగా బ్రహ్మస్థానంబునకుఁబోయి ౫౪౪
కం॥ ధనలోభంబునమీరలు ననుఁగూరిచి చండశర్మనామకుపై నిం
దను మోపితి, రటుగావునఁ గొమఁడీ ధనమిత్తు మీరుకోరినయంతన్" ౫౪౫
వ॥ అనుటయు నాగరబ్రాహ్మణు లెల్లరుం గనులెఱ్ఱఁజేసి ౫౪౬
కం॥ "ఛీ ఛీ పాపాత్మా! నీ వాచాదోషమున జిహ్వ వ్రయ్యలగును బో,
మిమ్మఁ జండశర్మ సవిధిగఁ బాచితమొనరింపకునికి బాహ్యుండయ్యెన్, ౫౪౭
కం॥ ఒక్కఁడె ప్రాయశ్చిత్తము నిక్కముఁ నొనరించి యితఁడు నింద్యుండయ్యెన్,
బెక్కురుబ్రాహ్మణులకుఁగా నొక్కనికిం బాచితంబు నొనరుపవశమే, ౫౪౮
ఆ॥ ఈయకార్యమునకు నెల్లపురాణముల్ స్మృతులు ధిక్కృతమ్మొనరిలితనిచేత,
విత్తమునకు నితని వెలిచేయ దానికి మొగమువాయలేదు మూర్ఖ! పొమ్ము.
కం॥ ప్రాయశ్చిత్తము నలుగురుధీయుతులను గలిపికొని విధింపఁగవలెనం
చాయా స్మృతులు వచింపఁగఁ జేయించెనితం డొకండె శ్రేష్ఠుఁడననుచున్,
ఆ॥ కాన యుష్మదీయకల్మషమంతయు వచ్చి యితనియొడలు చొచ్చెనిపుడు,
దానఁజేసి మేము పూని బహిష్కారమును విధించినాము చనుమిఁకీవు, ౫౫౧
వ॥ అనివచించి స్వనికేతనంబులకుఁ జనుటయుఁ బుష్పుఁ డింటికేగి
కం॥ "ఎందాఁక సాహసింపదొ యందాఁకం బ్రజకు సిద్ధి యలవడ, దటుగా
నం దద్ద సాహసించెద నెందుఁ గృతఘ్నులకు స్థానమేర్పడకుండన్" ౫౫౩
వ॥ అనినిశ్చయించి సప్తమీభానువాసరంబునఁ బుష్పాదిత్యునకు నూటయెని
మిది ప్రదక్షిణంబులొనరించి నిజాంగంబులు శస్త్రంబున ఖండించి వీతిహోత్రంబున
వ్రేల్చి కాయశేషంబుచేఁ బూర్ణాహుతిం బొనరింపఁబోవుటయుఁ బావ ప్రత్యక్షమై

ఆ॥ "నృప! సాహసమును బొనరింపకోయి నీయెడఁ బ్రసన్నుఁడైతి నిప్డు నేను,
మరల నీవు నేమివలయునో చెప్పుకో, మెచ్చివచ్చినాఁడ నీహితమును" ౧౫౭
వ॥ అనివాక్రుచ్చుటయుఁ బుష్పుండిట్లనియె, ౧౫౮
తే॥ "క్ష్మాసురశ్రేష్ఠుఁడైనట్టి చండశర్మ నాగరబ్రాహ్మణులచేత నానిమిత్త
మై బహిష్కృతుఁడయ్యె, నాయనను వారితో సమానునిజేయు మోతోయజాప్త
తే॥ శాస్త్రముంజూచియేనాఁడు శ్రద్ధతోడఁ బాచితంబొనరించె నాబ్రాహ్మణుండు,
అట్టులైనను వెలివెట్టి రకట యతని నందఱుంగూడి యసహిష్ణులగుచువారు"
వ॥ అనవుడు సూర్యభగవానుండు ౧౫౯
తే॥ "నాగరబ్రాహ్మణుం డొక్కఁడే గరిష్ఠుఁ, డతనినుడి కన్యథాచేయ నలవిగాదు,
అందఱును నేకమై పల్కినట్టిమాట యన్యథాయాచరింపంగ నగునె వేశము, ౧౬౦
ఆ॥ అగునుగాక, యీతఁ డవని బ్రాహ్మండన ఖ్యాతినంది కరము పూతుఁడగును,
నితనిసుతులుగూడ నెంతయు విఖ్యాతి రాజమాన్యులగుచు రాజిలుదురు,
ఆ॥ ఇతనిచుట్టములును హితులును నిట్టిరే యై చరించువార లవనియెల్ల,
మత్ప్రసాదమునను ద్వాత్రింశత్యవయవము నవ్రణంబగును ధరామరేంద్ర!" ౧౬౨
వ॥ అనిపలికి యంతర్ధానంబుఁజెందుటయుఁ బుష్పుఁ డత్యంతాంగుండై చండశర్మ
యింటికరిగి వివర్ణవదనంబుననుండు నతని విలోకించి ౧౬౩

—: నాగరేశ్వరోత్పత్తి: —

ఆ॥ "నీనిమిత్తముగను నేఁ దనుత్యాగంబుజరుపుటకునుగూడ సమ్మతించి
సరసిజాప్తు సుప్రసన్నుని గావించుకొన్నవాఁడ, మెప్పుగన్నవాఁడ, ౧౬౪
శా॥ నీపాతిత్యము తత్కృపాబలముచే నేఁడేఁ తొలంగుంజుమీ,
నీపుత్రులొ్మదలైన నీకులజులుఁ నిన్నోలి యీనాగర
క్ష్మాపీయూషభుగాళికంటె ఘనులై సంతుష్టిమం, బ్రందుచే
నా పుణ్యంపు సరస్వతీనదితటంబందుండు లేలెమ్మికన్ ౧౬౫
కం॥ ఉండుట కొక్కయాశ్రమము యోగ్యముగన్ రచియించి యందు నీ
యండను నేన యుండఁగల, నగ్గలపున్ ధవముండెవాఁడు, నీ
దండవసించునందఱిని దప్పక పోవఁణపేతుఁ గాన నీ
వుండిన మానసజ్వరము నో ద్విజవర్య! త్యజింపుమీ యికన్" ౧౬౬
వ॥ అనిన విని చండశర్మ పుత్రపౌత్రబంధుసమన్వితంబుగా నగరంబుఁజొచ్చివచ్చి
నమస్కరించి కనుల వెంట నీళ్ళుగార్చుచుఁ బుష్పుంగూడి యుత్తరాభిముఖంబుగం

క॥ చెపు మస్మదీయగృహమున కిపు డీవరుదెంచు కార్య మెద్దియొ, రేత
ద్వీపుల సమస్తం బిమ్మనవుడైనను వెనుకదీయ కర్పింతు వెసన్" ౩౧౮

క॥ అనియిటు వాఁడు ప్రిచ్చుటయును "జనవర ! నీ యింటిలోనఁ జాతుర్మాస్యం
బును వ్రతకాగ్రహణమును బొనరుతు, శుశ్రూష చేయఁబూనఁగవలయున్"

ఉ॥ అని ముని యాజ్ఞయిచ్చుటయు "నట్లెయొనర్చెద" మంచు నాతఁడ
ప్పని తన భార్యతోన్ నుడువ భక్తిఁ దదంగన బిడ్డ తండ్రికిన్
బొనరుచున ట్లుపాసనము ప్రొద్దును మాపును జేసె వానికిన్
దనయెడలం గృపారసము శ్రద్ధజనింపఁగ జీవితేశ్వరా ! ౩౨౦

శా॥ చాతుర్మాస్య ముగించి యేగు నెడఁ దచ్ఛాపాయుధుం డాయమన్
బ్రీతిన్ దగ్గఱఁ జేరఁజీటి "చెపుమీ బిడ్డా ! త్వదిష్టంబు" నాఁ
జేతుల్మోడిచి యిట్లనున్, "విను మునిశ్రేష్ఠా ! మహారాజ్ఞియన్
ఖ్యాతింగాంచియుఁ బ్రాయమందు మనియున్ సంతానముం గాంచమిన్, ౩౨౧

క॥ రేయుంబవలు దహింపఁగఁ జేయంబడుచుంటిఁ గానఁ జెప్పు మపత్య
శ్రీ యొనగూడు నుపాయం, బోయనఘా ! వ్రతమొ నేమమో దానంబో" ౩౨౨

చం॥ అనవుడుఁ జాలసేపు తన యాత్మను యోజనచేసి యాతఁ డి
ట్లనియెను, "బూర్వజన్మమున నమ్మరో ! నీ యవసానకాలమం
దునను బ్రతప్తవాలుకలతోడను గౌరి నొనర్చి కొల్చి, తం
దున నిట దవ్యామానవయి దుఃఖమునందెదు రాజ్యమొందియున్, ౩౨౩

క॥ దేవత మనుసంయుక్తిని భావములందుండుఁ గాని పాషాణమునన్
దా వసియింపదు, మఱియును బావన మృత్కాష్ఠములను భాసిల దెపుడున్, ౩౨౪

తే॥ భక్తిగలభావమున మంత్రబలమునుండి యరుగుదెంచిన యీశ్వరి నరుణకిరణ
తప్తవాలుకలంజేర్చి తద్దఁగొల్చి తందునను నీదు మెయిఁ దాప మధికమయ్యె, ౩౨౫

ఆ॥ కాన రత్నమయముగాఁజేసి పంచపిండాఖ్యగౌరి భక్తి హాటకేశ్వ
రమున నిల్పి యంత రవి వృషభగుఁడుగా వారియంత్ర మామెపైని గట్టు, ౩౨౬

క॥ రాత్రిందివములు ధారాపాత్రింబుననుండి జలము పైఁబడుకోలఁదిన్
గోత్రాధీశ్వరతనుభవ గాత్రంబున శైత్యమొదవుఁ గమలదళాక్షీ ! ౩౨౭

ఆ॥ అచటఁ జల్లఁబడుడు నట్లె నీదాహంబు శాంతిఁబొందఁగలదు సక్రమముగ,
దాహమాఱ గర్భధారణమొనరించి ఖ్యాతుఁడైనపుత్రుఁ గాంచఁగలవు" ౩౨౮

క॥ అనియిటు వాఁడు ప్రిచ్చుటయును విని పద్మావతి "మహాత్మ ! వితథంబగు నీ
మనుజత్వముతో నాకిఁకఁ బనిలేదు, మదిన్ విరక్తి ప్రభవించెఁ గదున్, ౩౨౯

ఆ॥ సకలదేహధారి నికరంబు బ్రిదుకును నేటివఱదవంటి డెంచిచూడఁ,
గాన మామకీన మానుషభావంబు తొలఁగువ్రిత మెదేని తెలుపుమయ్య" 33౦

క॥ అనియడుగుడు దుర్వాసోమునివర్యుఁడు కొంతసేపు మునుచివరను ద్ర
ష్టినినిల్పి ధ్యానమొనరిచి మనుజాధిపురాణితోడ మఱి యిట్లనియెన్, 33౧

క॥ "కలదొకపుణ్యవ్రితమో యలివేణీ! గౌరికద్ది యతితుష్టికరం,
బిల దానింబొనరించిన యెలనాగలు దేవభావ మెనయుదురోజన్, 33౨

తే॥ గోమయాఖ్యమహాదేవి గోమయమునఁ జేసి గోలోకమొందిరి స్త్రీలు కొంద,
రామహాదేవిఁగావింపు మబ్జవదన! దేవతాభావమునుంబొంది తేజరిలెదు" 333

క॥ అనియిటు వక్కాణించుడుఁ గనుగొని మునివర్య "నెట్టి కాలంబున నీ
ఘనవ్రితము చేయఁగావలయును? విధియెద్ది? చెప్పుమయ్య యోగాబుషి!" యనినన్,

క॥ దుర్వాసుఁడు పద్మావతి గుర్వనుకంపామతిఁ గనుగొని యిట్లను, "నో
చార్వంగి! దేనినొనరిచి నిర్వృతిగాంచెదరొ స్త్రీలు నీకదివినుతున్, 33౫

తే॥ భాద్రబహుళతృతీయను భాస్కరోద్భవమునకుం బూర్వమే లేచి పండ్లుదోమి
శ్రద్ధమై గౌరినామము ల్చదువుకొనుచు సలుపవలె నుపవాసంబు జలజనయన!

క॥ అంత నిశాగమమున నో కాంతా! మృణ్మయములైన గౌరమ్మలు నా
ద్యంతరయొ బాగుగ నొనరిచి యంతఃపరిశుద్ధితోడ నర్చింపవలెన్, 33౬

శ్లో॥ "హిమాచలగృహే జాతా దేవి త్వం శంకరప్రియే
మేనాగర్భసముద్భూతా పూజాం గృహ్ణ నమోస్తు తే" 33౭

క॥ అనుమంత్ర ముచ్చరించుచుఁ దనయా! తొలిజాముసందుఁ దద్దేవికిఁ బూ
జనమొనరింపఁగవలయును, విను పూజాద్రవ్యములను వినిచెద నింకన్, 33౮

క॥ ధూపము కర్పూరంబున, దీపము ఘృతసిక్తవర్తికృతమాత్రమునన్,
బాపురెయన నొనరిచి జాతీపుష్పాలంకృతిని విధింపఁగవలయున్, 3౪౦

క॥ చిడుములు నైవేద్యంబుగ నిడి యెట్టినివలువఁగట్టి యెంతయుమోదం
బొడగూడ మాదిఫలమున నుడురాజనిభాస్య! యర్ఘ్య మొసఁగఁగవలయున్,

శ్లో॥ "శంకరస్యప్రియే దేవి హిమాచలసుతే శుభే
అర్ఘ్యమేనం మయాదత్తం ప్రతిగృహ్ణ నమోస్తు తే" 3౪౧

మ॥ అనుచీమంత్రము యర్ఘ్యదానమున యోజ్యంబౌను గ్రాల్గంటి! యే
ఘనవృత్తంబునఁ బూయూపూవులను దద్గౌరీమహాదేవి య

ర్పనముం జేతురో యామహీరుహపుఁ గాష్ఠంబేచుమీ దంతధా
వనముం జేయఁగ నర్హ్యు మా వ్రతమునన్ వర్తించునవ్వారికిన్, ౩౪౩

తే॥ అర్ఘ్యమునకు నుత్తమగు మాదిఫలము ప్రాశనముఁజేసి యవలి జామునందు
నగరుధూపమునను నొగిగుణ కాని వేదనమునను గువలయమునను భక్తి ౩౪౪

శ్లో॥ "వామమర్ధంశరీరస్య యా హరస్యవ్యవస్థితా
సామేపూజాం పరిగృహ్ణాతు తస్యై దేవ్యైనమోనమః" ౩౪౫

కం॥ అనునీమంత్రముచేతి న్ఘనముగఁ బూజించి యర్ధనారీశ్వరయం
చును జెప్పఁబోవు మంత్రింబునఁ గొబ్బెర నర్ఘ్యమిచ్చి భుజియింపవలెన్,

శ్లో॥ "అర్ధనారీశ్వరౌయౌచ సంస్థితౌపరమేశ్వరౌ
అర్ఘ్యోమే గృహ్యతాం దేవౌ స్యాతంసర్వసుఖప్రదౌ" ౩౪౬

కం॥ తిగజామున శతపత్రములఁ గడుం గైసేసి గుగ్గిలంపుఁ బొగలై
కెగఁబ్రాఁక ధారికాత్మకమగు నైవేద్యంబుతోడ నధికశ్రద్ధన్ ౩౪౭

శ్లో॥ "ఉమామహేశ్వరౌదేవౌ యౌతౌసృష్టిలయాన్వితౌ
తౌగృహీతా మిమాంపూజాం మయాదత్తాం ప్రభక్తితః" ౩౪౮

ఆ॥ అనెడిమంత్రమున నర్చించి యటుపైని జాజికాయతోడ సరిగనర్ఘ్యమీ
మొసఁగి యదియె తాను మెసవంగవలయుఁజూ మద్రిరాజతనయ! మహితవినయ!

శ్లో॥ "ఉమామహేశ్వరౌదేవౌ సర్వకామసుఖప్రదౌ
గృహీతా మర్ఘ్యమేతంమే దయాంకృత్వా మహత్తమాం" ౩౫౧

కం॥ అనునిది త్రిప్రహరార్ఘ్యపు మనువగుఁజూ రాజతనుజ! మఱి నాల్గవజా
మునఁ బంచపిండికాగౌరిని మార్కవపుష్పములఁ బరిష్కృతఁగాఁగన్ ౩౫౨

కం॥ కావించి గ్రంధిరజ మాదేవికిఁ బొగవేసి నేతఁదేలెడి పూరిన్
నైవేద్యంబొనరిచి నిజభావము పరిశుద్ధమగుచు భాసిలుచుండన్ ౩౫౩

శ్లో॥ "పృథివ్యాదీనిభూతాని యానిప్రోక్తానిపంచచ
పంచరూపాణిదేవేశి పూజాంగృహ్ణా నమోస్తుతే" ౩౫౪

కం॥ అనుమంత్రమునఁ బూజనమొనరిచి యందుగుఫలంబు నొగి నర్ఘ్యముకై
వినియోగింపఁగవలయును, దనయా! యదియేఫలంబు దాఁ దినవలయున్, ౩౫౫

శ్లో॥ "పంచభూతమయీదేవీ పంచధా యా వ్యవస్థితా
అర్ఘ్యమేనం మయాదత్తం సా గృహ్ణాతు సురేశ్వరీ" ౩౫౬

కం॥ శౌర్యముగనఁబడ, దితరులభార్యల బలిమిని హరింపఁ బాల్పడి రకటా!
యార్యబ్రాహ్మణవిబుధాచార్యులఁ బూజించుటన్న సరిపడ దెడఁదన్, ౩౬౩

సీ॥ వివిధజాతులచేత వేదముల్చదివించి యర్థార్జనము సేయు నల్పమతులు
కడు నీచుఁడేని కాల్గడిగియిచ్చినదాన నాసక్తిగ్రహియించు నర్థలోభు
లాచారమునువీడి యగుపడినదియెల్లఁ దృప్తిమై మెసవెడి తిండిపోతు
లాల నెద్దులఁ బెంచి వ్యవసాయవృత్తిచే గాదెలనింపు నిష్కరుణచిత్తు
లాచమనమేని చేయని యలసులగుచు భూమిసురు లుండుచున్నారు భూతలమున,
వైశ్యజాతులు మొదటికే వసుధలేరు, పాడు కలి వచ్చుకతమునఁ బ్రకృత మార్య!

తే॥ శూద్రులే ధర్మకాములు క్షోణినిపుడు, శూద్రులే సుతపస్వులుం జూడఁజూడ,
లోకయాత్రాక్రియలనెల్ల లోపములనుజూపి నవ్వెడివారును శూద్రజనులె, ౩౬౫

కం॥ ధనము వయోయుతమగు స్త్రీజనమును నెవ్వానియింట సౌందర్యంబుగనుం
డునో వానితోనె సఖ్యము పొనరించుచునుండి రిపుడు భూస్థలి మనుజుల్,

తే॥ బ్రహ్మచారులు విధవలుం బారికాంక్షు లాదిగాఁగలవారికే యధిక కామ,
మకట! వైవేషభావలే యకయఁ గాని నీతిబాహ్యంబు లవ్వారి చేఁతలెల్ల,

కం॥ పాపాక్రాంతంబయి యిస్సీ! ప్రకృతము తీర్థవితతి చెఱుపంబడె, వా
ణీపతి! యవి కలిభయమున వాపోవుచు దెసలకడలు పట్టఁగవలసెన్, ౩౬౮

సీ॥ స్వల్పనీరములైన జలదము లడచుగా వర్షింపవయ్యె నవ్వసుధలోన,
వృష్టిలోపముచేత వేసినసస్యము ల్పైరుఁగవయ్యెఁ గరంబు పిరివిగాను,
సస్యముల్పైరుఁగమిఁ జాల కాహారంబు సురభులు పాలీయఁజూడవయ్యె,
నిచ్చినపాలలో నెంతయు జిగిలేక కొల్లగా నాజ్యంబు వెళ్ళదయ్యె,
నీ వొసంగినట్టి హెచ్చైనవరముచేఁ గలి ప్రవిష్టుఁడగుచుఁ గ్రాలుచుండ
మనుజలోకమెల్ల మలమల మాడిపోయెను బితా! యిటేలయొనరిచితివో, ౩౬౯

మ॥ కలికాలంపుమహత్త్వమేమనుచు వక్కాణింతునీతోడ, యు
గ్మలు లుచ్చాటనవిద్యనేర్చి మిగులన్ గయ్యాళులై భర్తతోఁ
గలహంబాడుచు వందగాంద్ర బటువుం గాఁగిళ్ళలోఁజిక్కి వ
త్రిలుచుం జేయఁగడంగి రుత్తబతము ల్దేవేశ! యాలించితే, ౩౭౦

సీ॥ ఏకుటుంబములోను శోకారవాఘ్యమై పెండ్లామునగలవుం బెనఁగులాటె,
యేయగారములోను న్యాయావిశిష్టమై తండ్రికొమాళ్ళకుం దగవులాటె,
యేయింటిముందును నిర్ఘ్యాసమేతలై యత్తయుం గోడలు మొత్తుకొనుటె,
యేవాడయందును నిహిహీయనం బ్రజల్ చుట్టంబు లొండొరు లొట్టుకొనుటె,
యేబజారునఁ గనుగొన్న నింటివారు జీతగాండ్రును బోరికి సిద్ధమగుటె,
యేపురంబునఁజూచిన నేలికలును జోరులును బోరులొనరింపఁ దారసిలుటె? ౩౭౧

తే॥ ఇంత కాలంబునుండి నే నిటకు రాక మెలఁగుటకు హేతు వేమనితలఁచితివొ,
కలహములఁ గంచు మర్త్యలోకమునునుంటి, నెడఁద జిలవుట్టెఁ, గ్రమ్మఱ నడతు నటకె
కం॥ గులగుల వెట్టెడిఁగడు నిచ్చలు నస్మ న్మానసహృదయ చరణంబుల, నా
గులగుల సురనరహరులకుఁ గలహంబులుగలిగినపుడు క్రమముగ ననఁగున్ " ౩౯౩

—♦ బ్రహ్మ లోకరక్షార్థమై భూతలంబునకుఁ గమలమును వదలుట. ♦—

వ॥ అనియిట్లువాక్రుచ్చుచుయుఁ బితామహుండు పుష్కరంబుపొంతఁ జింతా
వ్యాకులితేంద్రియుండై
ఉ॥ "భూమిని మామకీనమగు పుష్కరతీర్థము తప్ప కేత దు
ద్దామకలిప్రభావమునఁ దా లయమందును గాన దాని నే
దో మఱియొక్కచోటఁ గలియుండమిఁజూచి ప్రవేశపెట్టెదన్,
క్షేమముపొంతె నచ్చటికిఁ జేరును దక్కటి యెల్లతీర్థముల్, ౩౯౫
కం॥ కలికాలం బంతయు నిర్మలజలముఁజతోడ నచట మని యాతీర్థ
మ్ములు కలిసనుపైఁ దమతమనిలయమ్ములనుండు మరల నిరపాయముగన్" ౩౯౬
వ॥ అని హృదయంబున నిశ్చయించుకొని ధ్యానించి కరగతంబగు కమలమును
విలోకించి ౩౯౭
కం॥ "కలిసొచ్చనట్టి ధాత్రీస్థలమునపం బోయి పడుమ జలజమ! వేగన్,
లలిఁ బుష్కరతీర్థముఁ దత్థ్స్సలముగఁ జేర్తు నీకు సహవాసముగన్" ౩౯౮
వ॥ అనిచెప్పిపంపుటయు నయ్యది మహీతలంబెల్లఁ గ్రుమ్మఱి ౩౯౯
సీ॥ నిరశనవ్రత మెచ్చునియతిమైఁ బూనియు దినమున నొకపూటఁదినియు మఱియు
రెన్నాళ్ళకొకసారి యన్నంబు మెసవియు మూన్నాళ్ళకొకమాఱు భోక్తలయియుఁ
గృచ్ఛచాంద్రాయణకృచ్ఛంబులూనియుఁ బారాకసువ్రతభాక్కులయియు
మాసోపవాసముల్ చేసియు నర్మమట్టకులయ్యుఁ బర్ణభక్షకతమనియుఁ
బండ్లుదినియు భయముపడక దంతోలూఖలులయియును ద్విజేంద్రు లలఘుతపము
నాచరించుచున్న యాహాటకేశ్వర క్షేత్రసవిధమునకుఁ జేరఁబోయి ౪౦౦
సీ॥ పావన భూదేవపాఠ్యమానమై మేటిఋగ్ధిధ్వను లిమ్ముమీట్టఁ
దత్త్వవిత్సందోహతంతన్యమానమై శాస్త్రార్థపాఠము ల్సందడింప
శ్రౌతానలత్రయజాజ్వల్యమానమై క్రతుభూమి సంప్రీతిగలుగఁజేయ
దేవాధ్వపర్యంతదేదీప్యమానమై బహుళయూపస్తంభపంక్తి యొంప
బావనంబని యొకచోటఁబడియు లేచి మఱియునొకచోటఁబడి వడి మగుడలేచి
యింకనొకచోటఁబడియె మునీంద్రులార! పడినకడ నెల్ల గుంటలై పరిఢవిల్ల, ౪౦౧

వ॥ ఆకుంటలమూఁడింటను స్ఫటికసన్నిభంబును స్వచ్ఛంబును నగు జలంబూఁనుటయు జలజాసనుండు స్వయంబుగ నం జనుదెంచి వేదవేదాంగపారగులగు వివిధ విప్రులచే వేష్టితంబును వ్రతచర్యాపరాయణులగు ననేకతపస్వులచే నాక్రాంతంబును నగు హాటకేశ్వరక్షేత్ర మంతటం గలయ నవలోకించి ౪౦౨

తే॥ "అహాహా! యీ క్షేత్ర మెంతరమ్యము కనంగ, బ్రాహ్మణప్రియ మత్యంతపావనంబు.
గాన విప్రజనాశ్రయంబైనయిచట యజ్ఞ మొకటి యథావిధి నాచరింతు, ౪౦౩

క॥ ఆ పుష్కరముల మూఁడిటి నీపురికిం దెచ్చి వాని నీగోతులలో
నాపూరితముల్సేసెదఁ బాపపుఁ గలిదోష మెల్లఁ బాసెడిరీతిన్" ౪౦౪

వ॥ అనినిశ్చయించుకొని ధరాతలంబునఁ గూరుచుండి తడవు ధ్యానించి జ్యేష్ఠ మధ్య కనిష్ఠపుష్కరంబుల మూఁడింటిని రావించి సంతసంబు వెలిపుచ్చుచు ౪౦౫

శా॥ "ఏకత్పుష్కరనామతీర్థములు మూఁ డిచ్చోటికిన్ నేను సం
ప్రీతిం దెకొనివచ్చినాఁడఁ గలిదోభీతిన్, జనుల్వచ్చి సు
స్నాతుల్గానిట శ్రద్ధతోడ నెపుడున్ నాశంబు లేకుండ వి
ఖ్యాతంబైతగు సిద్ధిఁబొందుదురు సత్కారుణ్య మేపారఁగన్, ౪౦౬

తే॥ ఎవరు కార్తికపూర్ణిమ నిచట శ్రాద్ధమాచరింత్రో సమాహితులగుచువచ్చి
యల గయాశీర్షమందున నాచరించు శ్రాద్ధపుం బుణ్యమును వారు సంతరింత్రు, ౪౦౭

క॥ ఆం దాద్యంబగుపుష్కరమందునఁ గార్తికిని గృతము యజ్ఞము నాచే,
నందొనరుచు స్నానాదులఁ బొందుదురు శతాధికంపుఁ బుణ్యము మనుజుల్, ౪౦౮

క॥ వైశాఖపూర్ణిమాతిథి నే శాస్త్రోక్తప్రకార మిఁక రెండవదౌ
నీశుభపుష్కరమునఁ గలినాశమునకుఁ జేసెదను ఘనంబుగఁ గ్రతువుల్" ౪౧౦

—♦ బ్రహ్మ యజ్ఞార్థ ముపకరణంబులం గూర్చుట. ♦—

వ॥ అని వాయుదేవు దక్కొంగ్ంబై ౪౧౦

సీ॥ "తిమిరహా ద్వాదశాదిత్యులతోడను శోభిల్లు సప్తవసువులతోడ
రౌద్రమూర్తులయిన రుద్రులతోడను విపులులైన మరుద్గణములతోడఁ
దౌర్యత్రికాఢ్య గంధర్వులతోడను సుకృతులౌ లోకపాలకులతోడ
విద్వద్వరేణ్యులౌ విద్యాధరులతోడ సంసిద్ధులౌ సిద్ధచయముతోడ
ద్రుతముగా బిడౌజుఁ దోడ్కొనిరమ్ము బొమ్మ యిల! యస్మదాజ్ఞ యవధరించి
యారభిష్యమాణ యజ్ఞకర్మంబున బాసటయి వసింపవలయుఁగాన" ౪౧౧

వ॥ అని యానతిచ్చుటయు నతండు హరిహయు నగారంబునకరిగి యంతయు నివేదింప నాయన సర్వగీర్వాణగణంబులతోడం జనుదెంచి చతుర్ముఖునకు సాష్టాంగ మొరఁగి యేమియాజ్ఞయన నతం డిట్లనియె, ౪౧౨

కం॥ "నేను గలికాలభీయమునఁ బూనికి సఫలంబు గాఁగఁ బుష్కరములయూఁ
డానీతంబులు సేసితి, మానుగ వైశాఖి మూఁడు మఖములొనర్పన్, ౪౧౩
ఆ॥ తన్నిమిత్తముగ శతక్రతూ! సంభారములను సిద్ధపఱచవలయు నీవు,
పిలువఁబంపు వేదవేదాంగపారగులయి తపస్వులైన యవనిసురుల" ౪౧౪

వ॥ అని యిట్లు సెలవొసంగుటయు శతమఖుండు సవినయంబుగా వల్లెయని సత్వరంబ సంభారంబు లన్నిటిం దెప్పించి యష్టాలగు నవనీసురులరావించె, నంత నంబుజాసనుండు యథాశాస్త్రంబుగను సర్వదక్షిణంబుగను యజ్ఞంబులాచరించె" నని యిట్లు వాక్రుచ్చుటయు ఋషులిట్లనిరి, ౪౧౫

యజ్ఞ ప్రారంభము

తే॥ "సూత! యాక్షేత్రమందున ధాతచేతఁ గ్రతువుకృతమయ్యెననియెది కీర్తితంబొ
యది మహాద్భుతమొదవించె, నధ్వరముల నాతఁడేకద యష్టవ్యుఁ డరసిచూడ,
కం॥ యష్టవ్యుఁడైన యేతత్స్రష్టయె యజమానుఁడగుచు జన్నమొనర్పన్
విష్టపముల నాయనకిఁక యష్టవ్యుఁ డెవండొ చెప్పుము యనఘా! మాకున్, ౪౧౭
సీ॥ ఎవరు ఋత్విజులైరి యీయనప్రత్యక్షమం దధ్వరక్రియ లాచరింప?
నాయగ్రజన్ముల కంబుజాసనుఁడు తా నెయ్యది దక్షిణయిచ్చినాఁడు?
యజ్ఞముం జేయింప నధ్వర్యుఁడెవ్వరు? హోతృత్వ మెవ్వరి కొసఁగఁబడియె?
నెవ్వఁ డాగ్నీధ్రుండు? నెవ్వాఁడు బ్రహ్మగా సంస్థితుండయ్యెఁ దత్సదమునందు?
నెవ్వ రుద్గాత? యాచార్యుఁ డెవ్వరచట? నబ్బురముగల్గఁజేయు నీ యజ్ఞగాథ
యంతయును సవిస్తరమ్ముగా నానతిమ్ము, వినఁ గుతూహలమయ్యెడి మనమునందు"
వ॥ అని యిట్లు ప్రశ్నించుటయు సూతుండు ౪౧౯
ఆ॥ "నేను మీకుఁ గాను నిఖిలమౌ యజ్ఞీయవార్త దెలియఁబఱతు వరుస వినుఁడు,
ఎవరొ తత్సదస్యు లెవ్వరో ఋత్విక్కు లేని దక్షిణార్థ మీయఁబడెనొ, ౪౨౦

వ॥ అవ్విధంబున యజ్ఞకాముండగు నతనిపాలికి నమరనాథుండును నష్టమూర్తి ము నఖిలామర్త్యగణసహితంబుగా నరుగుదెంచుటయు మర్త్యధర్మసమాశ్రితులగు వారి విలోకించి వారిజాసనుండు వినయోపేతంబుగం గృతాంజలిపుటుండై ౪౨౧
ఉ॥ "స్వాగతమయ్యె మీకు సురసత్తములార! యనుగ్రహింపుఁ, డీ
బాగగు నాసనంబులకుఁ బై నుపవిష్టులుకండు చక్కగా,
యాగములందు మంత్రిముమహాత్తను గష్టముగామవచ్చు మీ
రాగతులైనవారలు స్వయంబుగ, ధన్యుఁడనైతి నేనిఁకన్" ౪౨౨
అని పలుకుటయు దేవత లిట్లనిరి, ౪౨౩

కం॥ "భవదీయాధ్వరపుంగ్రియ కెవ రేమియొనర్పవలెనొ యి మ్మాత్రతి, గీ
ర్ధవ! తద్వ్యాపార్యంబును సవిశేషముగా వచింపు, శ్రవణింతు మొగిన్" ౪౨౪

వ॥ అని యిట్లు వచించుటయు వెండియు బ్రహ్మదేవుండు ౪౨౫

ఆ॥ "విశ్వకర్మ! నీవు వేవేగఁజని యజ్ఞమంటపము రచింపు మంజులముగ,
యజ్ఞవేదికలును నట్లె పత్నిశాల యమరుపుము మనోజ్ఞమై రహింప, ౪౨౬

సీ॥ ఎటనెద్ది విహితంబొ యటునద్ది యుండంగఁ బృథుకుండము తీరిపింపుమయ్యా,
గ్రహములు చమసము లస్రహిత మేకుఱకుండఁ బాత్రలన్నియు సిద్ధపఱచుమయ్యా,
కాష్ఠమయంబైన కడియముల్దగిలించి యూపము ల్స్రయించి యుంచుమయ్యా,
పాత్రలుంచుట కర్హభంగిగం గుదిరించి పాయులు త్రవ్వింపఁగఁ బూనుమయ్యా,
చంచనములకయి పదివేలుఁ బయి శతాష్టకంబు నిటికెలఁగాల్పింపఁ గడఁగుమయ్యా,
వరహిరణ్మయపురుషునొక్కరు రచించి తెచ్చియిమ్మయ్య నీవొయ్య దేవశిల్పి!

సీ॥ సురగురూ! పదియాఱుగురు బుత్విజుల నీవ యార్జింపు, మన్యుల కది యశక్య,
యమరనాయక! శ్రాంతులైవచ్చు ద్విజులకు సంగమర్దన సేయు మధికభక్తి,
నరవాహనా! దక్షిణల నిచ్చుపని నీది తలకించి యెపుడెద్ది దేయమగునొ,
హరి! నీవు బాగోగులరయుచుండుము సదా క్రియమాణమౌ ప్రతికృత్యమునను,
లోకపాలురార! మీరు సురక్ష్యముల్ దెసలు భూతవితతి తిరుగకుండ,
నెవరి కెది ప్రియంబొ యెఱింగి యజ్ఞేశ్వరా! యొసఁగుచుండు ధనమొ వసనములనొ

క॥ వసురుద్రాదిత్యమరుద్విసరంబులతోడఁ గూడి విశ్వేదేవుల్!
మెసవఁజనుదెంచుజనులకు విసువక వడ్డించి తృప్తిపెట్టుఁడు మీరల్" ౪౨౯

వ॥ అని యాదేశించుచుండ ససంభ్రమంబుగా విశ్వకర్మసనుదెంచి ౪౩౦

ఆ॥ "సవనమంటపంబు సంసిద్ధమైనది యంచతేజి నెక్కియాడు రాత!
యన్యభవగువీరితాఖిలపరికరమ్ములును సిద్ధమయ్యె లలితముగను" ౪౩౧

వ॥ అనిచెప్పుచుండ బృహస్పతి యరుగుదెంచి ౪౩౨

కం॥ "దేవా! పద్దియార్గురు భూదేవతలను దోడితెచ్చితిని, వారలదౌ
ప్రావీణ్యంపుఁబరీక్షం గావించి వరింపు యజ్ఞకర్మంబునకున్" ౪౩౩

వ॥ అనిపలుకుటయు బ్రహ్మ స్వయంబుగా వారిం బరీక్షించి బుత్విక్త్వంబున
నియోగించి యర్హణంబుగావించె" నని వక్కాణించుటయు బుషులిట్లనిరి. ౪౩౪

ఆ॥ "ఎవరికేమి కార్యమేర్పాటుచేసెనో యాసరోజయోని యధ్వరమున
వారివానివేళ్ళ వరుసఁగాఁగీర్తింపు రోమహర్షణీ! కరంబు ప్రేమ" ౪౩౫

వ॥ అని ప్రశ్నించుటయు వెండియు సూతుండు ౪౩౬

సీ॥ "భృగునకు హౌత్రంబుఁ బ్రీతి గావిష్టుత్వము గాలవాహ్వయమునికి నొసఁగె,
మైత్రావరుణసంజ్ఞ మతిఁ జ్యవనుం జేసె, సలిపెనచ్ఛావాకు లలి సురీచి,

నధ్వర్యుఁ గావించె నల పులస్త్యమునీంద్రు, నత్రిఁ బ్రస్తోతగా నాచరించె,
నొనరించె నున్నేత నోజ సనాతను, రహి నుంచె నేష్టగా రైభ్యమునిని,
బ్రాహ్మణాచ్ఛంసి గర్గుండు, బ్రహ్మ నారదుఁడు, భరద్వాజుఁ డాగ్నీధ్రుఁ, డడుగ నేల
మనపరాశరసూనుండె మానులార ! తాతయజ్ఞంబునం దాను హోతయయ్యె, ౪౩౭
ఆ॥ జడదారులార ! శాండిల్యుఁడు దాఁ బ్రతిహర్తయుచటు, సుగ్రావత్వం
బిడె గోభిలాఖ్యముని, కాతఁడు సామమునందుఁ జాల దక్షుండరయఁగ, ౪౩౮
॥ కాథుమాభిధానఘుఁడు దాఁ బ్రస్తోత యజ్ఞభవుఁడుజరుపు నధ్వరమున,
నంగిర స్తపస్వి యుచట సుబ్రహ్మణ్యుఁడైనవాఁడు పుణ్యమానులార ! ౪౩౯
వ॥ యజ్ఞసిద్ధిపొంటె నాఋత్విజులఁ జతుర్ముఖుండు సవినయంబుగా వస్త్రా
భరణశోభితులం గావించి గృహ్యోక్తవిధానంబునం బూజించి ౪౪౦
॥ "ధరణిసురులార ! వీఁడు మీశరణుఁజొచ్చుచున్నవాఁడు ప్రసాదింపుఁ డూర్జితముగ
యజ్ఞదీక్షం బ్రవేశింప నాజ్ఞయిచ్చి వెసఁ గృతార్థునిఁజేయుఁడీ వేడుకొందు" ౪౪౧

— శ్రీ బ్రహ్మ నాగర బ్రాహ్మణులకు వరమిచ్చుట —

వ॥ అనియిట్లు దీక్షారంభంబుఁ జేయనుండుట యు నాగరబ్రాహ్మణులెల్లరును
గర్తాతీర్థసముద్భవుండగు మధ్యగుం బిలిచి ౪౪౨
సీ॥ "ఓరీ మధ్యగ ! నీవుపోయి ద్విజన్ముత్యుచ్చని దుర్మతియగా
నా రాజీవభవున్ గురించి చెపు మీవ్యాహార, మహ్యుద్భవం
బారంభింబు సుపూరితంబయినపై వర్షించి యీ క్షేత్రమున్
గౌరీనాథుఁడు మాదుపూర్వికులకుంగా నిచ్చెఁ బూర్వంబునన్, ౪౪౩
తే॥ నూటయెనుగురబ్జజు శ్రేష్ఠికైరి యరయ నిది మాకుఁ గైవసమైనదాది,
ధిక్కరించియొఱుంగ రం దొక్కరేని నినువినా మమ్ము నో క్రూర ! నీతిదూర !
తే॥ నాగరద్విజులకు వెలిగాఁగ నిచట యజ్ఞయాగములం జేయుచతఁడు వధ్యుఁ,
డంచువలనిఫలం బాతఁ డొందఁజాలఁ, డిటుల నీ క్షేత్రమిను నాఁడె యీశుఁడనియె,
ఆ॥ కాన నిటుజన్న మొనరింపఁబూనె దేని నాగరులఁబిల్చి కావింపు బాగుగాను,
లేనిచో యజ్ఞఫలమును లేశమేని పడయఁజాలవు ధర వారు బ్రదికియుండ" ౪౪౪
వ॥ అని వాక్రుచ్చుటయు నమ్మధ్యగుండు యజ్ఞమంటపమ్మునకు దూరమ్ముగా
బ్రాహ్మణపరివారితుండై యున్న బ్రహ్మపాలికింజని నాగరోక్తంబు వక్కాణింప
మానుషభావవిశిష్టుండైన యన్నలువ సాంత్వపూర్వకంబుగా నతని కిట్లనియె, ౪౪౫
తే॥ "మధ్యగా ! నీవునొడివినమాట నిజమె కాని యిటుచేయవలెనన్న కాంతుఁ గాక
ఘోరపడి వరించినాఁడను బూర్వ మఖిలఋత్విజులఁ గాన నేనింక నేమిసేతు,

కం॥ కావున నీస్థానమునకు రావింపుము పోయి నాగరబ్రాహ్మణులన్,
వే వారినెల్లఁ గొని పోవుదు మఖమంటపమ్ముపాంతము వేగన్"

వ॥ అనవుడు మధ్యగుఁడు

తే॥ "ఈవు దేవత్వమునకీడి యిపుడు మనుజభావముం బొందియున్నాఁడ వోవి
యట్టి సామాన్యుఁడైన నీయంతికమున కేఁగతిం దద్విజాగ్రిణు లాగఁగలారు!

కం॥ ఆవులు పశువులలోపల నేవిధమున శ్రేష్ఠ్యము వహించెనొ జగమం
దావిధమున నాగరులకు క్ష్మావిబుధసమూహమందు శ్రేష్ఠ్యముగలిగెన్,

ఆ॥ అట్లుగాన నీవు యజ్ఞసంప్రాప్తికై చిత్తమందు వాంఛ సేయుదేని
రాణ వెలయు నాగరబ్రాహ్మణులయనుగ్రహము వడయుమెమ్మె కమలజన్మ

వ॥ అనినవిని ధాత భీతుండై ఋత్విక్సహితంబుగాఁ దత్కల్పితనాగర బ్ర
సన్నిధానంబున కరిగి సవినయంబుగా సాష్టాంగపడి కరములు జోడించి

శా॥ "ఏతత్క్షేత్రమునందు మీకు వెలిగా నేకర్మముం జేసినన్
ఖ్యాతిం జెందక వ్యర్థమౌట మదికిన్ జ్ఞాతంబె, కానీ సమా
నీతం బిందుఁ ద్రిపుష్కరంబు, లనియే నిక్షేపముల్గాను సం
ప్రీతిం గైకొని స్వీయతీర్థములుగం బ్రేమింపుఁడీ నాగరుల్!

శా॥ మీయాధిక్యమెఱుంగక ఋత్విజులు సంప్రీతిన్ సురాచార్యుచే
నేయానీతులు, గాన నెంచి క్రతువున్ వీరే సమాసీనులై
చేయింపన్ వెలవిందు, గండు, కలిసంసిద్ధించినప్డేనియున్
నా యీ తీర్థము త్వత్కృతాఘములఁ జెండాడన్ సమర్థంబగున్"

వ॥ అని ప్రార్థించుటయు నాగరబ్రాహ్మణు లిట్లనిరి,

కం॥ "నాగరులకు బాహ్యముగా నీగతి మఖ మీవు నేసెదేని క్రమముగా
సాగింతురు పెరపురలును, బాగుగఁ గావింత్రు భూమిపాలురుగూడన్,

తే॥ విన నగుఁగాక నేనిఁక నాచరింపకుండ నుండనటంచని మొండిసలచి
మమ్ములం జిన్న పుచ్చక మానవేని తరలు మాయొద్దనుండి యేతత్క్షణంబ"

వ॥ కావునఁ జతురాననుం డిట్లనియె,

ఆ॥ "ఏతదాదిగాఁగ నిచ్చోట నాగరబ్రాహ్మణాగ్రణులకు బాహ్యయుగను
శ్రాద్ధమో మఖంబో సలుపుచో నది వృథా యగును గాని ప్రాప్య మగు వ

కం॥ నాగరు లేతత్క్షేత్రము బాగుగ లేదనుచు నెటుల పనివిని శ్రద్ధన్
ఆహూతులకా కావించినఁ గాఁగల వయ్యనియు వ్యర్థ కార్యము లింకన్,

తే॥ ఇట్లు మర్యాదచేసితి నేనుగానఁ గరుణయుంచి మదీయయజ్ఞమున కాజ్ఞ
యొసఁగు భూదైవతములార! యిపుడవోయి సక్రమంబుగ దాని నుపక్రమిం

## —• నారదుఁడు సావిత్రిం దోడ్కొనిరా బ్రహ్మలోకంబున కేగుట •—

వ॥ అని వాగీశుండు వాక్రుచ్చి సంతుష్టులైన నాగరబ్రాహ్మణుల యాజ్ఞం
గైకొని వృతులైన విప్రుల ద్వారంబున యజ్ఞంబొనర్ప యత్నించుటయు విశ్వకర్మవిచ్చేసి
నాగరానుమతంబున మస్తకమండనంబు గావించెఁ, బదపడి బ్రహ్మదేవుండు వాద్య
మాన వాద్యంబులను గీయమాన గీతమ్ములను బఠ్యమాన వేదంబులను శ్రవణించుచు ససం
తోషంబు గానుండి పులస్త్యుఁ డరణిం బట్టుకొని పత్ని పత్నియని బహువారంబులు
పలుకుటయు దారం దోడితెమ్మని నారదునకు సంజ్ఞ చేసె, నతఁడరిగి సమరప్రియుండగుట
సావిత్రికిఁ జతుర్ముఖునితో భేదంబు గలిగించువాఁడై ౪౬౪

కం. "నను నాజనకుఁడు నీకడ కనిపినవాఁ డో మరేశ! యాయన వీతో
డనుగూడి యజ్ఞమంటపమునకుం జనవలయునంట, మూర్తము పెట్టెన్, ౪౬౫

ఉ. ఒక్కతె వేగి యెట్టులటు నుండెదవమ్మ యనాథవోలెనీ,
వక్కమలాశచీముఖసురాంగనలం బిలిపింపు, చుట్టునన్
గ్రిక్కిరియంగనుండి కడుఁ గీర్తన సేయఁగ వార లేగుదె
మ్మక్కడికిన్ విలాసముగ నధ్వరశాల యలంకరింపఁగన్ " ౪౬౬

వ॥ అనిచెప్పి తండ్రిపాలికిం జని ౪౬౭

ఆ. "జనక! నేను నాదుజనయిత్రిపాలికిం జేరమెత్తిపోయి పిలిచివాఁడఁ,
గాని కూరుచున్న కడనుండియేని యా కలభ యాన తాను గదలదయ్యె " ౪౬౮

వ. అనినవిని యాత్మభువుండు పులస్త్యుదిక్కు మొగంబై ౪౬౯

ఉ. "పొమ్ముకుమారనీవు, మతిపోయిన మాయమఁ దోడితెమ్ము, పో
మమ్ముభరమ్ముచేనణఁగు మత్పిరముం దిలకిమ్ము, యజ్ఞకా
ర్యమ్మున వేళ దాఁటఁగల, దాచరణీయము మంటపప్రవే
శమ్ము, ముహూర్తమెంతయును సన్నిహితంబయియున్న దారయన్ " ౪౭౦

వ. అనినవిని యమ్ముని యతిత్వరితగతిం జని యాటపాటులయం దమర కర్తలైయున్న
యమ్మంగని ౪౭౧

శా. "దేవీ! నీవు విచారశూన్యవయి యీతీరుంటు యుక్తంబె? యా
దేవజ్యేష్ఠుఁడు సోమభారమున నార్తిం జెందుచున్నాఁడు, నీ
యావత్కార్యము లట్టెపెట్టి యరుదెమ్మవ్వేటి, కయ్యజ్ఞకా
లావస్థవ్యముహూర్త మిప్పటికి స్వల్పంబాయు శేషించెడిన్ " ౪౭౨

వ॥ అని పలుకుటయు సావిత్రి యిట్లనియె, ౪౭౩

కం. "నాయన! మీనాయన నారాయణముఖసకలనిర్జరప్రవరయుతుం
డై యుండ నే నొకర్తను రా యోగ్యమె యసదవోలె రాణచెడంగన్, ౪౭౪
ఆ. కాన నొక ముహూర్తకాలంబు సుత! నిరీక్షించుచుండుమనుచుఁ జెప్పి మరిగి
యింతలోనె గౌరి యిందిర యింద్రాణి పెరసురాంగనలును నరుగుదెంతు, ౪౭౫
ఆ. వారితోడఁగూడి వచ్చెద నేను దద్యజ్ఞమంటపమున కర్హభంగి,
నపుడె గంధవాహు నాస్త్రీలఁ దోడితేఁ బనిచియున్నదాన ననఁగుఁదనయ!"
వ॥ అని యిట్లు వచించుటయు నతం డతిత్వరితగతింజని సోమభార్యార్థితుండగు
సురజ్యేష్ఠుంగని ౪౭౬
శా. "రా దేమందుఁబితా! మదంబ, గృహకార్యవ్యగ్రయైయున్న, ద
న్మాదం బెత్తెనొయేమొ, దేవవనితామధ్యస్థయై వత్తునం
చేదో వాక్యము చెప్పిపుచ్చినది, యం దీక్షింప నాస్త్రీలలో
లే దొక్కర్తయు, నెప్డువచ్చెదరొయాలేమ లుదరూహ్యంబగున్, ౪౭౭
కం. ఇయ్యది యున్న పరిస్థితి, యయ్యా! తెలిసికొని దీని నాచరణీయం
బెయ్యదొ యోజింపుమది, నయ్యెం గాలాత్యయంబు యజ్ఞంబునకున్"
వ॥ అనిన విని బ్రహ్మదేవుండు సమీపస్థుఁడగు శక్రుదిక్కు మొగంబై ౪౮౦
- బ్రహ్మ యింద్రుని గన్యాన్వేషణమునకుఁ బంపుట -
తే. "హరిహయా! విను సావిత్రి యరుగుదేర దెంతయును బుద్ధిశూన్యయై యిప్పుడిచటి
కట్టిభార్య బలాత్కృతిఁ బట్టితెచ్చి జన్న మొనరింప నేనింక సమ్మతింప, ౪౮౧
కం. శాలాప్రవేశసముచిత కాలాత్యయ మించుకేని కాకుండఁగ నే
మేలైన యనుద్వాహితబాలికఁ గొనితె మ్మొకర్తఁ బనివిని మఘవా!" ౪౮౨
వ॥ అనినవిని శక్రుండు సమన్వేషించుచుం బోవువాఁడు ౪౮౩
సీ. గరిమ షోడశకళాపరిపూర్ణుఁడౌ నిశాకరుఁ బోల్పఁదగు నెమ్మొగంబుతోడ
నాకర్ణదీర్ఘంబులై చెల్వుమీఱుచుఁ గలువ రేకుల గేరు కనులతోడ
సాముద్రికాఖ్య సచ్ఛాస్త్రసమ్మతమైన కమనీయతమ లక్షణములతోడఁ
బ్రాయంపురాక బల్బాగుగాసూచించు స్తనపురోగాంగసౌష్ఠవముతోడఁ
దక్రఘుటమొండు లీలమైఁ దలధరించి యరుగుదెంచెడి గోపకన్యక నొకర్తఁ
గాంచి "యెవ్వర? వెవరు నీకన్నతండ్రి? యయ్యెనా లేద పెండ్లి" యంచడుగు
[టయును
తే. "మంగళమునీకు దేవ! నేమజ్జిగమ్మ్మకొనుటకై యేగుదెంచిన గొల్లపిల్లఁ,
గావలసియున్నచో నీకుఁ గాని కొంక్క ముంతచొప్పునఁ బోసెద, మూల్యమిమ్ము"

—♦ ఇందుఁడు గోపకన్యకం బరిశుద్ధఁజేయుట ♦—

వ॥ అనినవిని యింద్రుండు దాని గోపికఁగాఁ దలంచి రమ్మురమ్మని రయమ్మునఁ దచ్చిరమ్మునఁగల తక్రఘటమ్ము భూస్థలమ్మునకు డొల్లనేసి యేడుచుచున్న నువిడువక గోవక్త్రంబునఁ బ్రవేశపెట్టి గుహ్యామార్గంబున గుంజివైచి జ్యేష్ఠకుండస్థ శుద్ధజలంబుల జలకమాడించి పరిశుద్ధంగావించి చలువవలువగట్టించి సంతసించుచు సకలదేవతాసహితంబుగం జదురుదీర్చికూరుచున్న చతురాస్యసవిధమునకుఁ బట్టుకొని పోయి ౪౮౬

ఉ. "సర్వసులక్షణాఢ్యయయి చక్కనిచుక్కనఁ దేజరిల్లు నీ
పార్వికశర్వరీణుమ్మఖి వివాహముగానిది, తక్రమమ్ముకొం
చుర్విఁ జరింప గొల్లదని యొయ్యన గోముఖమందుఁ ద్రోసి బి
ట్టార్వ గుదప్రదేశమున నాగతఁజేసితి వెండి శుద్ధగాన్" ౪౮౭

వ॥ అని చెప్పుటయు వాసుదేవుం డిట్లనియె ౪౮౮

ఆ. గోవులయును భూమిదేవులయును గులం బొకడె ద్విప్రకార మొందె జగతి
మంత్రసమితి యొకట మఱియొక్కచో హవిర్వితతి యుండి బిట్టు వెలయుచుండ.

కం. గోగర్భంబుననుండి సమాగతయగు నీపె బ్రాహ్మణాన్వయభవయే
యాఁగానఁ బెండ్లియాడుము యాగారంభార్హ కాల మరుదేరకమున్ " ౪౯౦

వ. రుద్రుండిట్లనియె, ౪౯౧

ఆ. "విను గవీముఖప్రవిష్టయై పశ్చిమద్వారముననుమగుడబయలువెడలు
కతన నీదుపత్ని గాయత్రియను పేరఁ బూజనీయయగును భూతలమున " ౪౯౨

వ. అనవుడు బ్రహ్మ బ్రాహ్మణులదిక్కు మొగంబై ౪౯౩

తే " గోపకన్యకయయ్యు నీగోల తాను బ్రాహ్మణశ్రేష్ఠయగు టెట్లొ బాగుగా వి
మర్శనముఁజేసి చెపుఁడయ్య మఱియుమీరు బ్రాహ్మణోత్తములార! మీభావమేమొ

వ. నావుడు బ్రాహ్మణులిట్లనిరి, ౪౯౫

ఆ. " గోపభావమెడలి యీపెతా బ్రాహ్మణశ్రేష్ఠయయ్యె, మేముఁజెప్పినార
మట్లుగాన నింక నాలసింపక నీవు పెండ్లియాడుమయ్య ప్రీతిధాత " ౪౯౬

వ. అని యిట్లందఱు నంగీకరించుటయు బ్రహ్మ యాయమ పాణిగ్రహణంబు గావించెఁ, బరమపవిత్రయై యమ్మహాదేవి సోమమ్ము దలఁదాల్చె, నిట్లుచతురాననుండు గాయత్రిని భార్యఁగాఁబడసి పరమసంతోషంబునఁ బయనంబై యజ్ఞమంటపంబుఁ బ్రవేశించె, గాయత్రియు గోపభావంబువదలి యాఁదల నరణిం బెట్టుకొని వాద్యంబులు వాయింపఁబడ గంధర్వగానంబులు గావింపఁబడ వేదఘోషంబులు వియత్పథంబుముట్ట

సర్వదేవద్విజోపేతుఁడగు చతుర్ముఖునితోడ నడచె, నంత విశ్వకర్మ యేతెంచి విధాతకుఁ గేశనిర్వపణంబును గాయత్రికి నఖనికృంతనంబును గావించెఁ, బులస్త్యుఁ డౌదుంబరదండంబును శృంగసహితకృష్ణాజినంబును జేతికిచ్చె, మౌంజీమయంబగు మేఖలచేఁ గటిం గైసేసి మౌనధారిణియగు గాయత్రితో నజుండు యజ్ఞశాలం బ్రవేశించి పరిశిష్టంబు జరుపుచుండఁ బ్రవర్గ్యసమయంబున దిగంబరుండొకఁడు కపాలపాణియై నిషేధింపఁ బడుచును సదస్సునం జొచ్చి గంతులువేయఁ గడంగుటయు సదస్యులు ४౯౭

ఉ. "ఎచ్చటినుండివచ్చితిర యీ వికృతాకృతితోడ మూఢ! నీ
చొచ్చుట కీ మఖీయమగు క్షోణి యనర్హము, వెళ్ళిపొమ్మువే,
వచ్చుగోప మబ్జభవవాసవముఖ్యసురాళికిన్ ద్విజుల్
కచ్చెరుఁ గాలు ద్రవ్వి నినుఁ గట్టెలతోడను గొట్టి సెట్టెదర్" ४౯౮

వ. అని యదలించుటయు వాఁడిట్లనియె, ४౯౯

ఉ. "అయ్యెడు బ్రహ్మయజ్ఞమని యత్యధికంబగు దూరమందునన్
నెయ్యురు చెప్ప రోయుచును నేనరుదెంచితి నన్నచింతనిం,
దయ్యయొ! తిట్టఁబూనితిరి, యంధదరిద్రవినీచు లెంతయున్
నెయ్యయు నన్నముం దిని గణించిన యజ్ఞమె యజ్ఞమయ్యెడిన్, ౫౦౦

కం. అన్నసమృద్ధము కానిది జన్నమెకా దరయ, మఱియు సంతుష్టియమునకున్
దెన్నది, యిద్దానికిఁగా నున్నది శాస్త్రప్రమాణ, మొగివినుఁ డీరల్! ౫౦౧

శ్లో. అన్నహీనో దహే ద్రాష్ట్రం, మంత్రహీనస్తు ఋత్విజః,
యాజ్ఞికం దక్షిణాహీనో, నాస్తి యజ్ఞసమో రిపుః"

వ. అని యిట్లునొడువుటయు బ్రాహ్మణులు ౫౦౩

ఉ. "అన్నముఁగూర్చి నీవిటకు నాగతుఁడౌటయె నిక్కమైనచో
నున్నదిపొమ్ము సత్ర, మట నొక్కమొగిన్ భుజియించుచున్న వా
రన్నముఁ దాపసుల్ కృపణు లంధులు దీనులు, వి త్తవస్త్రసం
పన్నతఁగోరినన్ ధనదుపాల లభించును దానశాలలోన్, ౫౦४

తే. అంతియే కాని యేలోప మరయ లేని బ్రహ్మయజ్ఞంబు దూషించి పాతకంబు
మూటగట్టుకొనంబోకు మూర్ఖ! నీవు, పొగడఁదగినది యిది, భూరిపుణ్యదంబు"

—ః దిగంబరుఁడు యజ్ఞమంటపమునఁ గపాలంబువైచుట ః—

వ. అనినవిని యతండు కపాలంబు నేలంబడవైచి దీపంబువోలె నంతర్ధానముగుటయు

కం. సదమున వైవంబడి యిట్లెదురుగ నుండఁ గపాల మిఁక నెప్పగిదిన్
గుదురును యజ్ఞక్రియ, లియ్యది యవలకుఁ ద్రోయ నెవరు నగుపడ రకటా ! " ౫౦౭
వ॥ అని సదస్యు లొకపురుషుని బహుభంగులం బ్రేరేచుటయు వాఁడు దండం
బున దాని నవలఁ ద్రోయుటయే తడవుగా నట్టిదే మఱియొక్క తలపుఱ్ఱె యచటఁ గనంబ
డియె, నదియును దీసివేయఁబడుడు నింకొకటి సిద్ధమయ్యె, నిట్లు నూఱులు వేలు లక్షలు
కోట్లు వచ్చి యజ్ఞవాటమంతయు వ్యాపింప యజ్ఞకర్మ ప్రదూషకంబులగు తత్కపాల
సంఘంబులం గనుంగొని యందఱును హాహాకారంబొనరించి, రంతఁ బితామహుండు
కృతాంజలిపుటుండై ౫౦౮

— బ్రహ్మచేఁ బ్రార్థితుండై శివుఁడు కపాలంబులఁ బోఁద్రోలుట —

కం. " దేవా ! యజ్ఞం బీవిధిఁ గావు టనర్హంబుమిగులఁ, గాఁబట్టి కపా
లావిర్భావం బణఁచుమ యీవుండం గర్మలోప మేర్పడఁ దగమిన్ " ౫౦౯
వ. అని మహేశ్వరుఁ బ్రార్థించిన నతండిట్లనియె, ౫౧౦
ఆ. " అది మదిష్టమైన యాహారపాత్రంబు, వైర మేల దానిపైని ద్విజుల,
కదియుఁగాక యొక్కయాహుతియేనియు వేయఁజూడ రకట ! వీరునాకు, ౫౧౧
తే. కాన నిర్విఘ్నముగ నీదు క్రతుసమాప్తి యభిలషించెదవేని నీ వాత్మలోన
నుఱుకపాలంబులో హవ్యముంచుఁడంచు భూసురాధములకు వేగఁ బోయిచెప్పుము,
చం. మఱియును నాలకింపు మొకమాటవచించెద, నెల్లవేల్పులన్
గుఱిచి యెటు ల్హవిస్సు శుచికుండమునందున వ్రేల్తు రట్లు నన్
గుఱిచియు మంత్రపూతమగు నుత్తమహవిస్సును వ్రేల్వనౌఁ, ద్వద
ధ్వర మటులైనఁ బూర్తియగుఁ, దప్పినఁ గాదు, నిజంబుచెప్పితిన్ " ౫౧౩
వ॥ అని యిట్లువచించుటయుఁ బితామహుండు ౫౧౪
శా. " నీరూపంబులు భిన్నరూపములుగ న్లెక్కింపరాకుండఁ బో
ల్పారున్ లోకములోన, నన్నియును సంభావ్యంబు, లం దీమఖా
కారంబొక్కటి, యట్లుగాన రహి నీకర్మంబు నిర్విఘ్నమై
మీఱంగావలెఁ గాని చేడ్పడుటలో మేలుండ దూహింపుమా, ౫౧౫
కం. శ్రుతికివిరుద్ధంబుగ నీక్రతువుం గావించుటన్నఁ గడుఁగష్టము, నీ
కుతుకముదీర్పక వేఱొకగతి నేగను నుత్సహింపఁ గ్రతువిధ్వంసీ ! ౫౧౬
తే. నేఁటినుండి యజ్ఞముల భూమినిర్జరులకు నలపురోడాశరూపమౌ హవ్యమెల్ల
మృత్కపాలంబులను బ్రాప్య, మత్కటుంపుశాసనంబిది, దాఁటంగఁజనదు దీన్ని ౫౧౭

కం. నిన్నుద్దేశించియును మహోన్నత! శతరుద్రియమున హోతవ్యము, పేల్
జన్నమ్ములనెల్ల జగత్సన్నుత! తన్మంత్రవరము జాప్యము శ్రద్ధన్, ౧౧౮
కం. సమ్మతిఁగపాలముల ద్వారమ్మున నీరూపమిచటఁ బ్రకటించితిగా
న మ్మహనీయ! కపాలేశమ్మన నీలింగ మొకటి సంస్థాపింతున్, ౧౧౯
తే. ఈకపాలేశలింగంబు నెవఁడు మొట్టమొదటఁ బూజించి యజ్ఞంబు మొదలువెట్టు
వాఁడు నిర్విఘ్నముగఁ దుదవఱకు దాని నిర్వహింపఁగఁగలిగెడి నిశ్చయముగ" ౧౨౦
వ॥ అనివాక్రుచ్చుటయు నసంఖ్యాకంబులగు నాకపాలంబులన్నియు హరునిచే నంతర్ధానంబు గావింపఁబడియె, నంతఁ జతుర్వదనుండు సంతసించి తత్క్షణమ తత్క్షేత్రంబునఁ గపాలేశ్వరలింగంబును స్థాపించి ౧౨౧
తే. "నా త్రిపుష్కరములఁ గృతస్నానుఁడగుచు నీకపాలేశలింగంబు నెవఁడు భక్తిఁ
బూజనము సేయు వాఁ డతిపూజ్యుఁడగుచు నపునరావృత్తమగులోక మందఁగలఁడు,
కం. కార్తికశుక్లచతుర్దశి నార్తత నీలింగసవిధమందునఁ గృతసం
కీర్తనత జాగరము నిర్వర్తించిన జన్మసిద్ధపాపము తొలఁగున్" ౧౨౩
వ॥ అనివక్కాణించుటయుఁ ద్రిపురాంతకుండు సంతృప్తుండై యజ్ఞమంటపస్థ వేదీమధ్యంబునం గూరుచుండె, బ్రాహ్మణులు విస్మయోత్ఫుల్లనయనులై యమ్మహేశ్వరునకు నమస్కరించి మగుడ యజ్ఞకర్మ మారంభించిరి, యీప్రకారంబునఁ దచ్చతుర్ముఖుండు యజించుచుండుటయు నాసమాచారంబువిని ౧౨౪
సీ. బ్రహ్మదేవుఁడుతాను బత్నీసమేతుఁడై యెటు యజ్ఞదీక్ష వహించినాఁడొ
పైతామహంబౌచుఁ బరఁగు నాజన్న మే తెన్నున వర్తించుచున్న యదియొ
స్వీకృతార్త్విజ్యులై చెలఁగెడి తత్రత్య కాశ్యపీసురు లెంతగట్టివారొ
హాటకేశ్వరసంజ్ఞ నలరారుచున్న యాక్షేత్రంపువిధ మద్ది కీదృశంబొ
చూచివత్తమటంచు నచ్చోటి కాద్యవాసరర్క్ష సమేతవైవస్వతతిథి
మట్టమధ్యాహ్నమునఁ దప్యమానులగుచు దాక్షిణాత్యులుకొంద ఱుద్ధతిని వచ్చి
వ॥ ఒక జలాశయంబున దిగి స్నాతులగుటయు ౧౨౫
సీ. వక్రనాసంబుల వంకలన్నియుఁదీఱె, బానపొట్టలు బిట్టు పలుచఁబాఱె,
శంకుకర్ణంబులు చక్కనై కనుపట్టె, నత్తులందఱిరోఁత యడుగువట్టెఁ,
జేటచెవు ల్చాలఁ జిన్నవైరహింమించెఁ, బెదవులదైర్ఘ్యంబు ప్రిదులఁగాంచె,
స్థౌల్యంబువిడనాడి తలలు సొంపునహెచ్చె, నొడళులందలిసల్పు సడలఁ జొచ్చె,
నిడుపుకుతికెలు సమములై నివ్వటిల్లె, వ్రణకిణంబులఁ జరణము ల్వదలఁబడియె,
గోళ్ల వెడలును బోడువును సళ్లసాగె, బక్కపండ్లును గుందపువ్వంబులయ్యె. ౧౨౬

వ॥ అట్లు మన్మథాకారులై యమ్మునులు స్వాంగంబులఁ గలయవిలోకించుకొని యది యొక్కతీర్థంబుగా నెఱింగి ౫౨౮

కం. "ఇం దవగాహన మొనరిచినందున నే రూపవంతులైతిమి మన మి-
ట్లందునఁ జేసి జగంబుల నందెడు నిది రూపతీర్థమన విఖ్యాతిన్, ౫౨౯

కం. ఎవరిటు శ్రద్ధాయుతులై యవగాహన మాచరింత్రో యవ్వారలు తా
రవుదురు రూపోపేతులు భవభవమున గతసమస్తపాతకులగుచున్, ౫౩౦

కం. జలములనేనియు నేతత్స్థలమునఁ బితరుల నెవండు సంతృప్తులుగన్,
సలుపు గయాశ్రాద్ధాధికఫలమును నవ్వాఁడు రూఢిఁ బడయంగలుగున్, ౫౩౧

కం. ఎవరిచట రత్నదానము లవనీదేవులకు భక్తి నర్పింతురొ వా
రవనీశ్వరులగుదురు ప్రతిభవమునను దీర్ఘమహిమఁ బ్రభుత నెలంగన్, ౫౩౨

కం. ఉండుద మేతత్తీర్థముదండనె మన మింక, నెంతదండిదియైనన్
గొండొకతీర్థముకడ కిటనుండి చనన్ వలవ దెంతయును రూఢముగన్" ౫౩౩

— ♦ ప్రథమ దివస యజ్ఞవృత్తాంతము ♦ —

వ॥ అని యొండొరు లనుకొని యొక్కరొకరు యజ్ఞోపవీతమాత్రంబుగాఁ దత్తీర్థంబును విభజించుకొనిరి, యిప్పటికిని జగద్గురువు ప్రథమ మాతీర్థోదకంబును నిత్యమ్మును స్పృశించు, నిష్కాముఁడయ్యు నందు నీరమాడిన మర్త్యుండు సిద్ధిలక్షణంబగు పరమ శ్రేయంబు పడయంగలుగు, నివ్విధం బమ్మునులందఱు నా సరస్సుం బంచుకొని సాయంసంధ్యాదికంబును నచటన నిర్వర్తించి నిశాముఖంబున దీక్షితుఁడై యజుఁడు మానమూని కూరుచున్న యజ్ఞమంటపమునకుఁ బోయి యాయనకు జోతవెట్టి పగటి యజ్ఞక్రియాకరణంబునఁ బరిశ్రాంతులై యింద్రాదిసురలు కాళ్ళుగుద్దుచుం బరిచరింపఁ గూర్చుండియున్న ఋత్విజులకడకరిగి వారికందఱకిని నమస్కరించి తదగ్రంబునం గూరుచుండి క్రతుగాథలం గాలంబుపుచ్చుచు సోమపానవిషయంబున నుద్గాతకును నధ్వర్యునకును బరస్పరము పొడమిన వ్యత్యాసంబున ౫౩౪

సీ. వాస్తవార్థంబును వాక్రుచ్చి రొకకొంద ఱొకపక్షమునఁ జేరకుండఁదాము,
తుంబురుకొప్పంగ నింద సేసిరికొంద ఱుపపక్షమున నేది యేర్పరింప,
కర్గలంబగువాద మాచరించిరికొంద ఱదియెల్ల మీమాంస ననుసరింప,
మాధ్యస్థ్యమూని సమ్మతవెట్టి రొకకొంద ఱనుకూలపరిశిష్ట మాశ్రయించి,
తగవులాడిరికొంద ఱంతయునుగినుకఁ గడుఁ బురోడాశచయనాదికములఁగూర్చి,
యిట్టి వాదోపవాదంబు లినుమడింపఁ బుచ్చి రారాత్రి యంతయు భూమిసురులు,

-• రెండవదినమున యజ్ఞశాలలో నొక బ్రహ్మచారి పామును వేయుట. •-

వ॥ రెండవదినంబగు ద్వాదశీతిథి నఖిలదేవతలకును నాశ్చర్యజనకంబగు నొక కథ ప్రవర్తిల్లె, ద్విజోత్తములారా! దాని తెఱంగెఱింగించెద సావధానులరై యాలకింపుఁడు, వేదపారగులగు విప్రర్షులు యజ్ఞకర్మ మారంభించుటయు బ్రహ్మచారి యొకం డొక నీరుకట్టియం బట్టుకొని వచ్చి సదంబునం బ్రవేశించి ప్రహసించుచు భయంకరం బగు నప్పామును బ్రాహ్మణాంతికంబునం బడవైచె, నంత నయ్యురగం బిటు నటు తొరతొరం దిరిగి సవనకర్మప్రసక్తులగు బ్రాహ్మణులనడుమఁబడి ప్రేమం బ్రవర్తించు హోత శరీరమంతయుం జుట్టుకొనుటయు నతండు ప్రాయశ్చిత్త భయంబునఁ బదంబు గదలింపక చయనన్యస్తలోచనుండై నోరెత్తి పలుకకుండెఁ గాని విషజంతుప్రశంసచే విప్రుల హాహాకారంబుమాత్రము విశేషించె, మైత్రావరుణకర్మస్థుఁడగు హోతకొడుకు సర్పవేష్టితుఁడగు జనకుం దిలకించి యప్పని వటుకృతంబౌట తెలిసికొని భయాతిశయం బునం బ్రభవించు కోపావేశంబున

క॥ "పాపాత్మ! సదమునందున హా! పామును వైచినాఁడ, వటుగావున నా
శాపంబును గ్రహియించుచు నా పామవ యగుము పొమ్ము వ్యర్థుఁడ! యింకన్"

వ॥ అనిశపించుటయు వటువిట్లనియె, ౧౩౮

కం. "జలసర్పమిద్ది, సభలో విలాసముగ దీని నేను వేసితి, నీయ
య్యలలితదేహమునం గ్రాదలిగి యిటు ల్యాపమీయ నర్హమె నీకున్" ౧౩౯

వ॥ అనివాక్రుచ్చి సర్పాకారంబుధరియించి దుఃఖించుటయు బ్రాహ్మణు లతని చుట్టుం జుట్టుకొని, రతఁడు వైచిన పన్నగము హోతృశరీరమువిడిచి యన్యత్రచనియె, నంత నవ్వటువు బాష్పపూరితనేత్రుండై భృగువుపాలికింజని ప్రణమిల్లి గద్గదస్వరంబున

క॥ "వనజాసను మనుమండను సనాతనుని సుతుఁడ నేను, జ్యవనాఖ్యుఁడ నీ
తనయుఁడు శపించె నిర్దోషిని, శాపవిమోచనంబు సేయు మహాత్మా!" ౧౪౧

వ॥ అనివేడుకొనుటయు భృగువు కరుణించి చ్యవనుం దిలకించి ౧౪౨

శా. "తాతా! విప్రవటున్ శపించితివి, యుక్తంబౌనె నీకున్, విషో
పేతంబైనభుజంగమంబె ననుఁదాఁబీడింపఁగంజాల, దే
రీతిన్ నిర్విషమౌ జలాహి యిఁక ధర్షించున్, ననుంగూర్చియే
యాతం డియ్యది వైవఁ, డందునను శాపాంతంబు గావింపుమా" ౧౪౩

వ॥ అనిపలుకుటయు నతండిట్లనియె,

తే॥ "అబ్ధి మర్యాదవీడుచో నర్యముండు శీతలత్వంబునొందుచో శీతభానుఁ
డధికశోష్ణత్వుఁడైనచో వస్మదుక్తి యనృతమగుఁగాని యందాఁక నట్లుకాదు, ౧౪౪

## — బ్రహ్మచారి శాపవిమోచనము —

వ॥ ఇట్లు భృగుసుతుండు పలుకుటవిని పితామహుండు తాన సర్వరూపధరుం
డగు మనుమండున్నచోటికి వచ్చి ౫౪౬

చం॥ "చిలువతనంబువచ్చుటకుఁ జింతిల కస్మదుదీరితంబు ని
శ్చలముగవిన్ము, తొమ్మిదవసర్పకులంబు సృజించుకోర్కి ని
ట్టలమయియుండెనా, కది దృఢంబుగ నీవలనం బ్రపూర్ణమా,
బలమగు కట్టుబాటున విభాసిలుఁ దత్కుల మివ్వసుంధరన్, ౫౪౭

తే॥ మంత్రకాండ్రను నోషధీమహితులకును బాధగలిగింపకుండ నీఫణికులంబు
భక్తిఁ బూజింపఁబడుచుండుఁ బ్రజలచేత నఖిలసర్వంసహాచక్రమందుఁ దనయ!

కం॥ ఏతత్క్షేత్రస్థముఁ బరిపూతంబును నైనయట్టి పుష్కరమున సం
స్థాతవ్య, మచట నియమాన్వితంబుగఁ దపమొనర్చు నినుఁబిలిచి రహిన్ ౫౪౮

సీ॥ తనదుబిడ్డనొసంగి యొనరించుఁబెండ్లి కర్కోటకాభిధానకుండలీంద్రుఁ,
డంత నవమమైన యహికులంబు సృజింపఁబడి చెలంగుఁ గట్టుబాటుగలిగి, ౫౫౦

తే॥ శ్రావణకృష్ణపంచమిని జక్కఁగఁ బూజితమయ్యెడుం జుమీ
క్ష్మావలయంబునందు నవమంబగు సర్పకులంబు, త్వత్సరః
పావనవారి నేఁటిసుత పంచమహాఘవినాశకారియై
కేవలనాగతీర్థమనఁ గీర్తివహించు జగత్త్రయంబునన్, ౫౫౧

కం॥ ఎవరీశ్రావణపంచమి నవగాహనమాచరింతు రాతీర్థమునన్
బవనాశనములభయ మయ్యువనీప్రజ కుండ దొక్కయబ్దముదాఁకన్, ౫౫౨

కం॥ విమతుల కెక్కనట్టిఁడు ఋషిసేవితమైనదీన స్నాతుఁడుగా ని
ర్విషుఁడై సుఖముం బడయును, మృషగాదిది యాలకింపుమీ తనుజాతా! ౫౫౩

ఆ॥ పుత్రకామయైనపూఁబోఁడి పంచమిభాస్కరోదయమున భక్తితోడ
ఫలకరాధ్యయగుచు జలకంబులాడుచో గొడ్డురాలుగాడ బిడ్డగనుమ" ౫౫౪

వ॥ అని వక్కాణించుచుండ వాసుకి తక్షక పుండరీక కృశోదర కంబ ళాశ్వ
తర శేష కాళియులు యజ్ఞంబున కాహూతులై యరుదెంచి యజున కభివాదమాచరించి

తే॥ "నాగరాజుల మోశతానంద! మేము, వచ్చితిమి జన్నమున సాయపడమ్మ, గాన
సెలవొసంగుము కర్తవ్య మెలమిమైని సిద్ధమున్నార మద్దానిఁ జేయుటకును" ౫౫౫

వ॥ అనుటయు బ్రహ్మయిట్లనియె, ౫౫౬

ఆ॥ "నాగరాజులార! నామాటమీఁద నీనాగరాజుతోడ వేగమీరు
నాగతీర్థమునను నయమొప్పనుండుఁడీ, యిదియె మీసహాయ మిష్టమునాకు, ౫౫౭

## —• నాగతీర్థమాహాత్మ్యము •—

సీ॥ శాకినీ మానినీకుల ల్కాతికకానఁగ మెక్కి సంచరించెడి దైత్యసముదయంబొ
యొంటిమైఁగనఁబడ్డ యుర్విప్రజం గొట్టి యేచఁగఁజాలు పిశాచగణమొ
సుఖితులైమను గృహస్థులఁబట్టిపీడింపఁ బూనుచుండెడి ప్రేతభూతతతియొ
యురుభుజాబలముచే సరకుసేయకయేరి నతికరయించెడి మానవాధముండొ
ద్రోవ్యమునుపహించి తామీమఖంబున విఘ్నమాచరింప వెదలునెడల
రక్షసేయుఁడయ్య చక్షుశ్శ్రవోనాథు! లిదియె మీరుఁగృత్య మిటుఁ దలంప, ౫౯
కం॥ భాద్రపదబహుళపంచమిఁ గద్రూసుతులార! పూజఁగైకొన వీరల్
భద్రముగ మనుఁడు, చనుఁడనుపద్రవమగు నాగతీర్థపాథస్సులకున్ " ౬౦

వ॥ అనియిట్లు నోదువుటయు వల్లెయని సర్పరాజులు సనాతనసుతయూతంబుగం
జని యాసరస్సునాశ్రయించియుండె, నది మొదలుకొని స్నాతులగు జనులకుసకలకామదం
బగుతీర్థంబు నాగతీర్థంబునా స్మృతంబయ్యె, ౬౧

సీ॥ భద్రముల్గలిగించి చెనయఁజాడవు ప్రేతభూతపిశాచము ల్భీతిదముగ,
క్షయకుష్ఠవిస్ఫోటకశ్లేష్మపిత్తాది జాడ్యము లూర్మిమాడఁజాల వెపుడుఁ,
గదలింపఁగాలేవు కాసంతయేనియుఁ జింతాభరంబులు స్వాంతములను
ధిక్కరింపఁగఁజాల వొక్కింతయేనియు బలవంతమయ్యు సపత్నగణము,
నాగతీర్థమున సనాతనసుతముఖ్య నాగరాజపూజనం బొనర్చి
తుష్టభూసురులకు మృష్టాన్నమిడునట్టి జనములకును సప్తజన్మములను, ౬౨

సీ॥ ఆనాగతీర్థమం దవగాహనము సేయ ప్రజ యన్వయమె సర్పభయముఁబొంద,
దాతీర్థమాహాత్మ్య మాసక్తి శ్రవణించ నహికీడ ఘటియింప దబ్ధమెల్లఁ,
దత్తీర్థమహిమంబు తానె పూనిపఠింప ఫణిదష్టుమైకూడ బ్రదుకుజనము,
భక్తి నేకత్కథాభాగంబులిఖియించి యుంచుచో నహిశ్చేట నుండదరగ,
యిట్లు గాన శౌనకాదిమునీశ్వరుల్! నాగతీర్థ మెంతయో గరిష్ఠ
మహిమఁగుఁడయ్య యంతరంగంబులం, దింతకన్నఁజెప్ప నేమిగలదు, ౬౩

వ॥ మాఁడవదినంబగు త్రయోదశీతిథిం బ్రాతస్స్నవనంబుగైకొని ఋత్విజులెల్లరుం
దమతమ కార్యంబుల నప్రమత్తులై యుండుటయు ౬౪

ఉ॥ పెట్టుఁడుపెట్టుఁ డందఱును బక్వైరము ల్మహిదేవసంఘముల్!
పెట్టుఁడుపెట్టుఁ డన్నమును ప్రీతి భుజించినయంత తృప్తిగన్
బొట్టలునిండ నెల్లరును బోయి తినుండు తినుండటన్న వి
స్పష్టతరోక్తి యొక్కటియె ముఖ్యముగా వినవచ్చె నయ్యెడన్, ౬౫

—• బ్రహ్మయజ్ఞంబున కొకయతిథి వచ్చుట. •—

వ॥ హేమరత్నంబుల నెవఁడెయ్యదియాఘ్రించిన వానికది నాలుగురెట్లుగా లభించెఁ, బర్వతోపమంబులై పక్వాన్నరాసులును నదీసంకాశంబులై ఘృతక్షీరంబులును దానార్థముంపఁబడిన ధనసముదయంబులును గలిగి యాబ్రహ్మయజ్ఞము సర్వకామసమృద్ధమును సర్వగుణసముదితంబును నై కనుపట్టుచుండ భూతభవిష్యద్వర్తమానవేది యగు నొక్కయతిథి యక్కడికరుదెంచి బ్రహ్మకు నమస్కరించి తదంతికంబునం గూరుచుండి తన యాబాల్యవృత్తాంతమంతయుం జెప్పఁజెప్పఁ గర్మాంతరప్రసక్తులగు ఋత్విగ్బ్రాహ్మణులు విస్మృతంబులగు నిజవృత్తంబులు జ్ఞప్తికివచ్చుటంజేసి యత్యంతగర్వ్యంబగు నాత్మీయవృత్తంబు నభిమానశూన్యతం బ్రకటించినందుల కయ్యతిథి యాత్మజ్ఞానంబున కచ్చెరుపడి యగ్గించుచుఁ గౌతుకావిష్టచిత్తంబులం దదభిముఖులై

క॥ "లోకోత్తర విజ్ఞానము, నీ కేగతిఁబట్టువడెనొ నిజమును మాకుం
వాకొని నీ గురువెవ్వరొ యోకాశ్యప్యాదితేయ ! యొగిఁ జెప్పఁగదే,　　　　౫౬౭

ఉత్సాహము॥ ఏమిజ్ఞాన మేమిజ్ఞాన మిచట నీకడం వలెం
భూమి నెచటఁ గనము వినము భూసురేంద్ర ! మేమహో !
తామరసభవుండు దీనిఁ దానుబోధఁజేసెనా ?
యామురారియా ? హరుండ ? యానతిమ్ము సర్వమున్ "　　　　౫౬౮

వ॥ అని యడుగుటయు నతండిట్లనియె,　　　　౫౬౯

సీ॥ పింగళయను పేరునం గరంబుఁజెలంగు నానర్తదేశపు నంగనయును
బొలమీఁదఁగలయాస బొత్తిగావిడనాడి కడుసుఖంపడిన పెన్నదపులుఁగును
నిదినాదునిలయమం చెట మమత్వములేక వీలైనకడనుండు విషధరమును
బ్రతినికొక్కొకయింత మకరందరసమును సంగ్రహించెడి మత్తమధుపవమును
ఘటకుఁడైనట్టి యొక యిషుకారకుఁడును మామకీనయుగ్మైన కుమారికయును
నైరిగురువులు నాకు, నీయాఱుగురి విచేష్టితంబులుగన జ్ఞానసిద్ధియయ్యె"

వ॥ అని యిట్లుపలికిన వెండియు బ్రాహ్మణు లిట్లనిరి,　　　　౫౭౧

సీ॥ "పింగళ మొదలైన వీరార్గురునునీకు వరుస నేవిధమున గురువులైరి ?
వారిసన్నిధి నెట్టివర్తనములఁజూచి జ్ఞానంబు సాధింపఁగలిగితీవు ?
ఏదేశమందుండు నేపరిదేశంబున నీ వుద్భవంబంది వృద్ధిఁగాంచి ?
తెయ్యది నీపేరవెసఁగాడివర్ణంబు ? తేగోత్రమునఁ బుట్టువెనసితీవు ?
ఆనుపూర్వ్యముగను నంతయుమాకు సవిస్తరముగఁజెప్పు ద్విజవరేణ్య !
త్వత్కథామృతంబు త్రావంగ మా శ్రోత్రయుగళు లెదురుచూచుచున్న వితడు"

—◆ పింగళోపాఖ్యానము ◆—

వ॥ అనియిట్లు ప్రశ్నించుటయు నయ్యతిథి ౫౭౩

కం॥ "ఈపురమునుండి శునశ్శేఫుండు మొదలైన విప్రసింహులు నలువుర్
గాం బురమువీడిచని చేయాపదకో యగ్గమగుచు, నవ్వారలలోన్ ౫౭౪

సీ॥ బ్రాహ్మణశాఖలం బ్రాధాన్యమువహించి యొప్పు నాగరులలో నుద్భవించి
ఛందోగుండను పేర జ్యేష్ఠలిపిఖ్యాతిగనిట్టి ఋషి గోత్రమునకుంజేరి
యత్యంతనిష్ఠ షడంగసంయుతముగా నాల్గువేదములు సాంతముగం జదివి
శమదమాదిక సర్వసద్గుణసంయుక్తిం బశ్చిమవయమునం బరంగియున్న
శార్దుండనువానికిని నేను బ్రథమసుతుండం, బ్రాణములకంటె నతనికిం బరమహితుండ,
నాకు యౌవనమేతెంచునాంటి కట్టిపిత మృతుండయ్యె, నేనుంచుం బేరుగాందు,

తే॥ ఇంతలోపల నానర్తమేలునట్టి సుతపుండనురాజు మామకసుగుణములను
గాంచి తనయంతిపురమునం గంచుకినిగ నుంచుకొనియెను నమ్మకంబొదవ మదికి,

కం॥ ఆయనకుంగలరు నూర్గురు ప్రేయసు, లవ్వారిలోనం బింగళయనంగన్
ధీయుత యొక్కర్తుక,యానాయికచేష్టితమె కతము నా జ్ఞానమునన్, ౫౭౭

సీ॥ అత్తరుపన్నీరు మాదిగాంగలయట్టి తత్తత్సుగంధవద్ద్రవ్యములను
శ్రీవాసవృకధూపపిష్ట కాలాగురువంశకాదిక ధూపవస్తువులను
మల్లికాకేతకీమాలతీ చాంపేయపారిజాతాదిక ప్రసవములను
విలువగల్గినయట్టి వెండిబంగరుజరీ చెఱంగులంజెలువారు చేలములను
వలఘుపరిమళీముల కలపంబులను దమ పడుకటింట్ల సిద్ధపఱచుకొని య
నంగబాధ కగ్గమైయుండంజొచ్చి రారాణు లహరహంబు రాత్రివేళ, ౫౭౮

కం॥ "ఈరాతిరినుంబిలుచును భూరమణుండు పడుక" కనుచుం బొంగనొకతెనన్
జేరంగంబిలుచు" నవిరొక సారసదళనేత్ర బిట్టు జగడములాడున్, ౫౭౯

కం॥ ఈవిధముననొండురు లాదేవేరులుం వాదులాడి తిట్టుకొనంగన్
జ్యేష్ఠభుం డంచొకరితం దావలచి యలంకరించుం దచ్ఛయనంబున్, ౫౮౦

కం॥ అంతం దన్నిశం దక్కటి కాంతలు నిట్టూర్పువిడిచి కన్నులు బాష్ప
ప్రాంతములుగాంగ నిద్దుర నుంతయులే కతనుబాధం జొక్కెడివారల్, ౫౮౧

కం॥ "అకట మహాదుఃఖంబు, విరాళమహాసుఖ" మటంచు నాపింగళదా
నాకాపాళముంగోపి విరాళను సుఖనిద్రం జెందు యామినులంగున్, ౫౮౨

చం॥ ధవునికి నుంగిటన్ మమచు దర్పకలీలలనోలలాడు నా
పత్నులలోడ నింపుకడయ స్పర్ధయౌవర్పక మన్మథార్తిచే

నవకేతనొంది చింతిలక యంబరమాల్య విభూషణాదులన్
దవిలిధరించి తల్పకయుఁ దత్సతి హాయిగ నిద్దురించుచుండఁగన్, ౨౭౩
కం॥ నేనును బ్రతివాసరమున నీనారీచేష్టితంబు లీక్షించియొగిన్
లూనాశాపాశౌఘుఁడనై నిద్దురవోవుచుంటి హాయిగనిశలన్, ౨౭౪
ఆ॥ ఎవరు రాత్రివేళ నెంతయునిదురింత్రో వారిజాఠరాగ్ని వర్ధిలెడిని,
దిన్నయన్న మెల్లఁ గ్రన్నజీర్ణించి యగునుబుష్టికరము మిగులనంత, ౨౭౫
ఆ॥ అస్మదీయ తేజ సభివృద్ధినొందుట కిదియొకతము భూసురేంద్రులార !
పింగళాభిధాన పేర్మినీవిధమున నొయ్యనయ్యె మొదటియొజ్జనాకు, ౨౭౬
కం॥ ఆశావశులై పగ లయ్యాశాపూర్తికి యతించునట్టిరు రాత్రుల్
లేశంబును బడుకొన రయ్యాశే తీరమినివగచు చాత్మలలోనన్, ౨౭౭
తే॥ ప్రజ్వరిల్లదు జఠరాగ్ని బాగుగాను, దాన నాహారవాంఛయే తగ్గిపోవు,
నంతఁ దేజోభివృద్ధిగా, దట్టుగాన నాశలనువీడియుండుట యర్హభంగి, ౨౭౮
ఆ॥ అఖిలజనులకోర్కె కవధిగనంబడ దించుకంతయేని యెంచిచూడ,
ఘృతహవిస్సునుండి కృష్ణవర్త్మమువోలె నిచ్చతీరుకొలఁది నింకఁబెరుఁగు, ౨౭౯
కం॥ దుప్పి యొదిగినకొలందిని దప్పక కొమ్మెదుగుమాడ్కి ధరణీప్రజకున్
జప్పునఁ దమతోపాటుగ నెప్పుడును మనోరథంబు లెదుగుచునుండున్, ౨౮౦
ఆ॥ ఈ తెలంగెటెంగి యెంతయు సుఖముగా రేయి నిదురవోవురీతిగాను
బవలె యున్న పనుల బాగుగాసవరించుకొనుట యర్హభంగి కోవిదునకు, ౨౮౧
కం॥ పింగళ నావక గురువగుసంగతియంతయును మీరు శ్రవణించితి, రిం
కం గురరంపుగురుత్వమ్ముంగూడ వచింతువినుఁడు భూసురవర్యుల్ ! ౨౮౨

—• అతిథి పెన్నడపులుఁగువలన గుణగ్రహణము సేయుట •—

ఉ॥ తాతయుఁ దండ్రియున్ వెనుకఁ దాము గడించియొసంగిపో నసం
ఖ్యాతధనంబు ధాన్యమును నస్మదగారము నిండియుండె, నా
జ్ఞాతులఁదొట్టి బంధుజనసంఘము బెల్లపుబుట్టమీఁది క
ళ్యాతురతం బిపీలికలయట్టు లెగంబడి రాధనంబుపైన్, ౨౮౩
సీ॥ "అవి పెట్టు మివి పెట్టు" మని నాదుముంగిటం గూరుచుండిరివచ్చి కొంతమంది,
భేదముల్గల్పించి వాదముల్పచరించి రంతుచేసిరిహెచ్చి కొంతమంది,
"యటుచేతు మిటుచేతు" మని బిట్టుభయపెట్టి కొనిపోవఁజూచిరి కొంతమంది,
కట్టియల్చేపట్టి నెట్టుకొం చిటుసొచ్చి కొట్టంగఁడంగిరి కొంతమంది,

ఇట్టు లెవ్వరెవరి కే ధనధాన్యంబు లిడవో వారువారు సేగుదెంచి
బాధ పెట్టు వారిపార్శ్వంబునుండి సౌఖ్యం బొకింతయేని గాంచనైతి, ౫౯౪
కం॥ రేయుం బవలును నేనటు లాయుధములఁగడచుపొంచె యత్నించియుఁ జిం
తాయుతుఁడనై తిఁగాని యుపాయంబు లభింపదయ్యె బ్రాహ్మణులారా! ౫౯౫
మ॥ అటు చింతించుచునుండనుండ నొకనాఁ డాకాశమార్గంబునన్
జటులక్రోధికృహీతమాంసమయి యత్నంబొప్పఁ బర్వెత్తు చు
ద్భటపక్షివ్రజ మాపాలంగుఁజేచి యుద్ధంబాచరింపంగ మి
క్కుటమౌసంకటమొందు పెన్నడపులుంగుం గంటి నే నొక్కచోన్, ౫౯౬
ఉ॥ ఈవిధ మాపతత్రి ముద మేది తదామిషముం త్యజించుచున్
ద్రోవయి పోవనర్చు పెరపుల్గులు తత్పలలంబువడ్డ యా
త్రోవను జొచ్చిపోయె, నది కృత్స్నముగం దిలకించి నేను నా
త్రోవమెనయర్థమును గ్రక్కున వీడఁదలంచి యంతటన్ ౫౯౭
క॥ కొడుకుల మనుమలఁ జుట్టల వడివడిఁబిలిపించి ధనము వశమొనరిచి ము
వ్విడుతలు కృతశపథుఁడనై యెడతే కవ్వారితోడ నీవిధమంటిన్, ౫౯౮
క॥ "లేదింతకన్న మిక్కిలి నాకుగృహంబున ధనంబు, నమ్మవదు క్రిన్
వాదములాడకయందఱు నీధనముం బంచుకొని గ్రహింపుఁడుమీరల్" ౫౯౯
కం॥ అనియిటునొడువ్వను వారలు పనివిని రర్థంబుగొంచు బాధింపకనన్
మనుచుంటి హాయిగానిట్లు, కనుకం గురరంబు నాకు ఘనగురువయ్యెన్, ౬౦౦
క॥ లోభమునకుఁ గతమర్థము, మోహము దుర్గతికిఁగతము, మోక్షమునం బి
ట్టీహకలట్టిఁ డనర్థావాహనకర మర్థ మర్థి వదలఁగవలయున్, ౬౦౧
కం॥ జలములఁ జేపలచే భూస్థలమందునఁ బులులచేతఁ దారాస్మృతిఁ బ
క్షులచేతఁ బలలముం బలె బలిమిని నెల్లెడల నర్థి భక్షింపఁబడున్, ౬౦౨
కం॥ జనబాధపరిభృతులచే ధనికుఁడు నిర్ఘోషుఁడయ్యుఁ దాఁ బీడితుఁడౌ,
ధనహీనుఁడు దోషంబుల నొనరిచియు నుపద్రవంబు నొందఁడు జగతిన్,
కం॥ పడఁబోవుచు నడుగడుగున వడవెద రితరావలంబనమువన ధనికుల్,
తడఁబడుదురు నడిపెడిచోఁ బుడమిని గలుగ్రావినట్టి పురుషుఁడువోలెన్, ౬౦౪
తే॥ కొంచెమౌ గోష్పాసదృశ క్షణోటి యొడలఁ బ్రియమొనరిచిన ధనికుండు పయికిఁదాను
లోన ద్వేషంబె యువ్వాని యావనంబు క్రౌర్యయుక్తంబనైమె సదా శానఁబడును,
సీ॥ ఎన్నిరాబట్టంబు లెనయునొడఁగ నూర జార్జింపఁగాఁబడ దర్థమనిన,
జార్జితంబైన యర్థసంపదయును వెతలుచేయుడ రక్షితము గాదు,

దొరలో దొంగలో దాని హరియింపఁగలుగుచో నేద్యోఁగావలసెడి నెంతయేని,
వ్యయముగావింపఁగవలసినయెడ నేని యుమ్మలికముఁ జెందుకుంటు కష్ట,
మట్లుగాన నట్టి యతిదుఃఖభాజనం బర్థ మేల కాల్పనా తలంప ?
నర్థకాంక్షి కాటికైననుజనుఁ బ్రీతి, నర్థహీనుఁ గొమరుఁడైన విడుచు, ౬౦౬
తే॥ కొడుకునకుఁ దండ్రి తండ్రికిం గొడుకుఁ గూర్చు టర్థసంబంధముండనియంతవఱకె,
యర్థసంబంధ మెపుడు తా నంతరించు నపుడె యొండొరులకు వైరమంకురించు,
తే॥ ఇదికతంబుగ నాకున్న యెల్లధనము విడిచిపెట్టినవాఁడ నోవిప్రులార !
దాన సుఖముండుచున్నాఁడఁ దద్ద నేను గురరపత్యుపదేశంపుగరిమవలన, ౬౦౮

— * సర్పము వలని గుణగ్రహణము * —

తే॥ వినుఁడు మునులార ! నాకు దర్వీకరంబు గురువయినభంగి చెప్పెద సరవిమీకుఁ,
దద్విచేష్టిత మీక్షించి తడయకేను గృహమువదలిన తెఱఁగెఱిఁగించువాఁడ, ౬౦౯
కం॥ గృహమున దుఃఖంబులకుఁ గృహమ యగుంగాని సౌఖ్యకృత్తెపుడుంగా,
దహి యితరజంతుకృతమగు గృహమున మనికాదె సుఖము నెనసెడి నిచ్చల్, ౬౧౦
చం॥ ఒక గృహమందుఁ గొంతవడి యుండి సుఖంబుగ వెండి యట్టి వే
ఱొకగృహముం గుఱించి చనుచుండును, నంతియ కాని యద్ది మా
మకగృహమంచు నెందును మమత్వము పెట్టదు పన్నగంబు, దా
నికి స్వగృహంబు లేదు నిజనిర్మితమెద్దియుఁ గాకయుండుటన్, ౬౧౧
కం॥ పరిపరివిధముల శ్రమముల కిరవయి కట్టింత్రు మేడ లెంతయు మనుజుల్,
మరణించు నెడల నేనియు నరుగవు కద వారివెంట నవి సత్యముగన్, ౬౧౨
ఆ॥ గృహముతోడ గృహిణి గృహిణితోఁ గొడుకును గొడుకుతోడఁ గూఁతుఁబడసి రాజ
తన్నిమిత్తముగను దత్తదకృత్యముల్ సలుపు చాత్మ నెఱుఁగఁజాలఁ డెవఁడు, ౬౧౩
సీ॥ ఒకరివెంబడి నొక్క రోగి నేరుపడేయెడి కొడుకులం గూఁతుంద్రఁ గూరిచియును
తత్పుత్రపుత్రికాత్యుత్పత్తిహేతువై కొమరారు పెండ్లాలఁ గూరిచియును
నగ్గలంబగులిబ్బి వ్యయపెట్టికట్టిన గొప్పవౌ లోగిండ్లఁ గూరిచియును
వ్రీహిముద్గయవాది వివిధధాన్యముఁబండు పేరైన భూములం గూరిచియును
సక్తమగుచు క్షీణరక్తంబులో వనగజములట్లు లోభకర్దమాబ్ధి
మునిఁగి కష్టపడెడు ననయంబు జంతువు లవిదితాత్మతత్త్వమైనకతన, ౬౧౪
కం॥ ఒక్కఁడు పాపములొనరుచుఁ, బెక్కండ్రు ఫలంబుఁగుడిచి ప్రియపడుదురు, తా
రక్కాలలకు బాధ్యులుగా, రక్కట ! తద్దోషలిప్తుఁడగుఁ గర్తయతండె, ౬౧౫

తే॥ ఈకతంబునఁ జేసి ఋషీంద్రులార! యమృతమార్గార్గళంబగు నాత్మగృహము
నుజ్జగించి చరించుచునున్న వాఁడెఁ జిరముఁ దిలకించి సర్వవిచేష్టితంబు, ౬౧౬

—• యతిధర్మ నిరూపణము •—

ఆ॥ పల్లెనొక్కనాఁడుఁ బట్టణమున మూఁడునాళులుండి యవలనడచువాఁడె
యతియనంగఁబడెడి, నన్యుండు యోగవిడంబకుండు తా నిజంబుగాను, ౬౧౭
ఆ॥ పాయలలోననిప్పు బొత్తిగాఁ జల్లారి పొగ యొకింటఁగూడ నెగయనపుడు
మహీసురాలయముల మాధుకరంబెత్తువారె కాని యతులు కారు పెరలు, ౬౧౮
ఉ॥ ఈదిన మన్న మెట్లొ యని యెప్పుడుఁ జింతిలకుండ దండియై
భూదివిజుండు పిల్చునెడఁ బోయి గ్రహింపఁగవచ్చు భిక్షయున్,
గావన రెవ్వ రద్దియును, గాని విరాగితనుండుటొప్పు, నిం
కేదొ విధింజరించునతఁ డెప్పటికిన్ యతి కానె కాఁడిలన్, ౬౧౯

సీ॥ తమిఁ బట్టుపరుపె మెత్తని సెజ్జఁ బన్నుండి ఋసకొట్టుచున్ నిద్రపోవుటయును
స్వాశ్రమార్థము గాని వ్యర్థమౌ నన్న మెక్కడో యొక్కడం జేరి తడుచుటయును
స్త్రీకథల్వినుటకై చెవియిచ్చి యవ్వారిపై మోహదృక్కులం బఱపుటయును
మల్లెపూవన్నియ మఱపింపఁగలయట్టి కడుతెల్లవల్వలం గట్టుటయును
స్వర్ణమయములైన చక్కనిభూషలం దమయొడళ్ళయందుఁ దాల్చుటయును
బతన హేతువులుగఁ బరికీర్త్యమానముల్గాన విడువవలయు వీని యతులు, ౬౨౦
చం॥ సమముగఁ జూచుకొంచు మది శత్రుని మిత్రునిఁ గూడ నయ్యదే
క్రమమున మట్టిపెళ్లలటు జాళులఁబోలెఁ బసిండిఁ గాంచుచున్
గొమరులమీఁద నేనియును గూర్మివహింప కుపేక్షమై గత
భ్రిముఁడగువాఁడె కాని యతి బ్రాహ్మణులార! తదన్యుఁ డెట్లగున్, ౬౨౧
ఆ॥ సరిగఁ జూచుకొనుచు సన్మాన మవమాన మెలమి యాముష్మికము నెనయకుండ
స్వపరదేశములను జరియింపఁగలవాఁడె యతి, తదన్యుఁ డర్థరతి గణింప, ౬౨౨
కం॥ ఏగృహమున భిక్షాదులు బాగుగఁ గావింపఁబడునొ బహుమానముగా
నాగృహమునకుం గ్రమ్మఱ పోఁగనివాఁడే యతి కాని యితరుఁ డగునే, ౬౨౩
ఆ॥ పడగదారితీరు పలుమఱుం దిలకించి నేర్చువాఁడు నిట్టినీతి నేను
పలికివాఁడ సర్వసంగపరిత్యాగమిదియె మోక్షమునకుఁ గుదురటంచు, ౬౨౪
ఆ॥ ఈప్రకారముగ నహింసత్వమయ్యె సద్గురువు నాకుఁ బుణ్యచరితులార!
శత్రుభావమునఁ బఱంబడి యాతేజ మేరుపడినయది శరీరమందు, ౬౨౫

ఉ॥ అయ్యెకిమీఁదు దవ్వరుగు నావల భృత్యుఁడు వచ్చి "యెంతసే
పయ్యెడినయ్య రాజుచని" యంచటు చక్కఁగనిల్చి బాణముల్
చయ్యనఁజేయు నప్పురుషు సంభ్రమ మొప్పఁగఁ బ్రశ్న సేయఁగా
నయ్యెషు కారుఁ డిట్లనియె నాతనిఁగూరిచి క్రిందఁజూచుచున్, ౬౩౭

కం॥ "నారాచకర్మసక్తుఁడ, నేరాజును జూచియెఱుఁగ నీదారిఁ జనన్
భారంబగు పనియుండిన పేర్కొని నరుఁగు మతఁడు విచరించును దాన్" ౬౩౮

కం॥ అని యీ ప్రకారముగ నా జనపతిసేవకునితోడ శరకారుఁడు నే
వినుచుండఁగ వాక్రుచ్చుటయును నాతనిరీతి కెంతయును నబ్బురగాన్ ౬౩౯

కం॥ "ఒకచిత్తముగలుగుటచేఁ బ్రకటితమయ్యెడిని నాకు బ్రహ్మజ్ఞానా
త్మికమైనయట్టియోగం బిఁకనేకవిధమున ఘటింప దిది యూహముగన్ ౬౪౦

కం॥ కావునఁ జిత్తనిరోధము గావించెద బ్రహ్మసిద్ధి గలుగుటకై" యం
చీవిధమున భావించి మనోవీథిం దాలిచితి ఘను జగదాప్తున్, ౬౪౧

సీ॥ పాకారిముఖదేవ పరిపాల్యమానమై తేజరిల్లెడి దశదిశలయందుఁ
గన నెంతసేపటికిని దర్శనంబీక తనరారు తద్దిగంతములయందు
నిరూపమయ్యును నీలవస్తుభ్రాంతి గలిగించు నంతరిక్షంబునందు
గిరిసరిత్పురసర స్సరిదధీశారణ్య పరివృతంబైన యీ ధరణియందు
నందు నిందన నేమిటి కఖిలమందు నాపరాత్పరుఁ డప్ప నన్యమును దేని
నేనుజూచుటలేదు, నా కింత తేజమేరుపడుటకు నయ్యదే కారణంబు, ౬౪౨

కం॥ ఈచాడ్పుననయ్యెను నా కాచార్యుఁడు కాండకారుఁ డస్మత్సుతదా
నేచందము గురువయ్యెనో వాచంయములార! వినుఁడు వక్కాణింతున్, ౬౪౩

తే॥ సర్వసంగపరిత్యాగపూర్వకముగ నెప్పు డిలువెడలితినో నే నప్పు డస్మ
దూధయును బసిబాలకు నొకరుని నెడబిడ్డనుం గొంచు నావెంటఁ బ్రీతి వెడలి

సీ॥ "స్వాధ్యాయపఠన భిక్షాచర్యముల నెప్డు శ్రమములొందెడు బ్రహ్మచారియేని
పుత్రకళత్రాది పోషణాతురతమై నస్వస్థుఁడైన గృహస్థుఁడేని
కందమూలఫలాశనం గ్రహించుచు సదా వనటఁగూరెడి వనవాసియేని
దిన మొక్కయూరికిం దిరిగి మాధుకరంబు యాచించుచుండు సన్న్యాసియేని
సంయతాత్ముఁడగుచు సరిగవర్తించుచో ముక్తినొందు నిక్కముగను గాన
కాదుమాటనిమము నాథ! యీగార్హస్థ్య ముద్ధరింపఁగలుగు నోజ నిన్ను, ౬౪౫

ఉ॥ కాదని నం దృజించి యెటో కాలము పుచ్చఁ దలంచెదేని నే
నేదోవిధిం దృజింతుఁ దను, నీ పసిబిడ్డఁడు బిడ్డగూడ నా
మాదిరి మేనువాయుదురు, మంచియొ చెడ్డో మదీరితంబు నీ
కాదరణీయ, మిందులకు నడ్డుపచింపకుమీ కృపామతిన్, ౬౪౬

తే॥ స్వయముగా గుర్తెఱింగియుఁ జనుటతగునె యన్యతీర్థంబునకు నాథ ! హాటకేశ్వ
రంబు తీర్థంబులం దుత్తమంబటంచు క్షితిసుర ల్తాపసులు చాలఁ జెప్పవిందు. ౬౪౭

శ్లో॥ " పునంతి సర్వతీర్థాని స్నానదానా దసంశయం
హాటకేశ్వరజం క్షేత్రం స్మరణాదపి పావయేత్ " ౬౪౮

ఆ॥ అని యథార్థవాదియైన విశ్వామిత్రు నాననంబునుండి యాలకించి
యేను దప్పకుండ నీశ్లోకమును సదా పఠనసేయుచుందు భక్తితోడ " ౬౪౯

కం॥ అనిచెప్ప సెట్టికేలకు " వనిత ! గృహస్థుఁడనుగానొ వానప్రస్థుం
డనుగానొ మనుదు " నని యాఘనమగు తీర్థంబుదరిని గాఁపురముంటిన్, ౬౫౦

కం॥ కరయుగళంబున గాజులు పారువగు చరణాబ్జయుగళి నందెలుకడియాల్
మెఱయఁగ నాడుచుఁ బాడుచుఁ దిరిగెడి నాముద్దుబిడ్డ దినదినమునకున్,

తే॥ కందమూలాశనంబునఁ గార్శ్యమొందఁగడఁగుటయు జాఱెగాజులు క్రమము గాను
నది కనుంగొనుకాలఁది నోయార్యులార ! కాఱె నాకును బాష్పము ల్కనులవెంట

కం॥ జాతియుజాతియు నవ్వి కుమారిక హస్తముల మూఁడుమాత్రమునిలువన్
సారెకుఁ దత్సంఘర్షణఁ జారుతరంబైన యొక్కశబ్దం బొదవెన్, ౬౫౩

ఆ॥ పెద్దకాలమునకుఁబిదప నందును రెండు గళితమగుచు సెట్టి ఘర్షణమును
లేక యొకటేమిగిలి నాకంటఁబడుడు నర్యాశ్రమంబుగూడ నవలఁద్రోసి ౬౫౪

ఆ॥ " పెక్కుమందికూడి యొక్కెడనున్నచోఁ గలహ మిరువురైన ఘర్షణంబు
నొక్కఁడైన సౌఖ్యమొనఁగూడు బాలికావలయమటుల నిద్ది, వాస్తవంబు" ౬౫౫

కం॥ అని మనమున నమకొని నేఁ దనయను దనుజాతు గృహిణిఁ ద్యజియించి వేసన్
జనితిఁ గడుదూర మెటుపోయినదియు నాయర్థదేహ యెఱుఁగకయుండన్, ౬౫౬

ఆ॥ ఎచటఁ బ్రొద్దుగ్రుంక నచటఁబరుండుచు నెదిలభింపవేళ కదిభుజించు
చిలఁజరించుచుంటి నిట్టుంగి సంసారబంధమెడలి ప్రజలె బంధువులుగ, ౬౫౭

కం॥ అంత మెలమెల్లగనునా కెంతయు జ్ఞానంబుగలిగె, నిప్పు డతీతా
గంతవ్యవర్తమానోదంతంబంతయు నెఱుంగ దక్షుఁడనై తిన్, ౬౫౮

ఉ॥ ఈవిధ మస్మదీయనుత కేను సుశిష్యుఁడనైనవాఁడ భూ
దేవతలార ! యుష్మదుపదేష్టలతీ రెదియన్నప్రశ్నకున్
వావిరి యుత్తరంబిది, యవాస్తవమానుడి యెంతమాత్రమున్
నేవచియింప మీయెదుట నిశ్చయమిద్దియటుం చెఱుంగుఁడీ, ౬౫౯

తే॥ ఇట్లు లోకోత్తరజ్ఞాన మేరుపడియె పట్టిరకారంబులుగ నగ్రజన్ములార !
దానినుడివిని విప్రయొడందలకు నమ్మకంబుగలుగఁగ నీక నేమిగలదు చెప్ప" ౬౬౦

వ॥ అనియిట్లువాఁడు వచ్చుటయు భూసురులందఱును ౬౬౧

కం॥ "వానప్రస్థాశ్రమమును సూనుని సుత సతిని విడిచి శుద్ధజ్ఞానం
బూని యెటకరిగితివి ? నీవో సమవిద ! యెంత కాలముంటివి యాచటన్ ?" ౬౬౨

వ॥ అనిప్రశ్నించుటయు నతిథియిట్లనియె. ౬౬౩

సీ॥ కనుఁగొంటి వెనువెంటఁ గదలిపోయి యశేషంబు దిరుతీరగు పుణ్యతీర్థములను
నైకొంటి వోయింటు ఘనదేవతాలయస్థలములఁ దీర్థప్రసాదములను
దపసుంటి ముక్కంటిదయగౌరి యాపగాపరిసరభూములం బరమనిష్ఠఁ
బన్నుంటి సేనొంటిఁ బర్వతగుహాలయం దాత్మస్వరూపంబు నరసికొనుచు
నట్టు లుండియుండి యజుఁడుదా జన్మంబుసలుపుచుంటు స్వయము తెలిసికొంటిఁ
దెలియఁబడుటఁ దద్దివ్యకృ వారాణసివద్దనుండి యిపుడు వచ్చుచుంటి" ౬౬౪

వ॥ అనియట్లు ప్రత్యుత్తరంబు చెప్పుచుండుటయు ౬౬౫

## — అతిథికడకు విష్ణ్వింద్రాది దేవతలు వచ్చుట —

సీ॥ అధ్వరక్రియ నంతయవకాశమొదవుడు నెలమిఁ బులస్త్యాదిఋత్విజులును
గార్హ్యజినయునం నై సేయఁబడి సోమయాజియై యందున్న యజ్ఞుఁడును
నాఖండలుం దను యగ్రిమం దిడుకొని గుమిగూడి తమి సర్వసుమనసులును
నలుగురితోపాటు నారాయణాయనునది సార్థకముగాఁగ హరిహరులును
నచటికరుగుదెంచి "యతిథి ! నీజ్ఞానంబునకుఁ బ్రిమోదమందివార మేము
అనుగువరము దుర్లభార్థంబె యూగుఁగాక యిదుదు" మనుడు నాతఁడిట్లులనియె,

శా॥ "సంతోషించితిరేని నాయెడల వాంఛాపూర్తి గావింతురేన్,
జింతింపం బనియేమి, యీ తనువునన్ దేవత్వముం బొంది మి
మ్మెంతో కూర్చుచు యజ్ఞభాగములఁగొంచే మీకుఁ బైస్థానమం
దంతశ్శుద్ధిగనుండ నిండు వర మోయజ్ఞాతృముఖ్యామరుల్ !" ౬౬౬

వ॥ అని యిట్లు కోరుకొనుటయు నిలింపులు ౬౬౭

ఆ॥ "నిశ్చయముగనీవు నిర్జరవరుఁడవై దేవలోకమందుఁ దేజరిల్లు
మంతెకాని యాధ్వరాంశంబు గోరకు మదియొసంగఁ గొంతయడ్డుగలదు, ౬౬౯

ఆ॥ నరున కధ్వరాంశ మరయక యిచ్చుచో నగును నప్రిమాణతాప్తి శ్రుతికిఁ,
గాన దాని నీయఁగాఁజాల మీవును నరుఁడవగుచు ధరణిఁ బరఁగుకతన," ౬౭౦

వ॥ అనవుడు నతిథి మఱియు నిట్లనియె, ౬౭౧

కం॥ "క్రతుభాగవివర్జితమగు క్రతుభుక్త్వముతోడ నాకుఁ గార్యము లే, ద
క్కృతమున మోక్షముఁగూరిచి యతించి సాధించువాఁడ నద్దాని వెసన్" ౬౭౨

వ॥ అనినవిని యంబుజాసనుం డఖిలాదిత్యుల కంజలిఘటించి ౬౭౩

మ॥ "వినుఁడీ నాదుహితోక్తి యెల్లసుర! లీవిప్రుండు నాయజ్ఞమున్
గన దూరంబుననుండివచ్చె మతియున్ జ్ఞానాఢ్యుఁడున్ నాగరుం
డును సత్పాత్ర మభీష్ట మిత్తుమనుచుం దోర్లోత్త నన్నార మం
దునఁ దద్వాంఛితపూర్తిసేఁత మనకుం దోడ్తోఁ బ్రశంస్యంబగున్" ౬౭౪

వ॥ నావుడు మహేశ్వరుం డిట్లనియె. ౬౭౫

—♦ అతిథిపూజా మహాత్త్వము ♦—

ఆ॥ "యజ్ఞభాగభోక్తయైనయప్పటికంటె నెక్కుడైనతృప్తి యితఁడువొంద
నొకటి చెప్పఁదలఁచియున్నాఁడ దేవతల్! వినుఁడు సావధానమనసులగుచు,

ఉ॥ ఈక్రియమాణయజ్ఞమున కీశుఁడు విష్ణువు, యజ్ఞపూరుష
ప్రాకటకీర్తి యాతనికిఁ బర్యటు కిద్దియె హేతు, వట్టిసు
శ్లోకునికన్న నియ్యతిథి శుద్ధమనస్కుఁడౌఁ గీర్తనీయుఁ డీ
లోకములోనఁ బైతృకము లోనగు కర్మములందు నుందిఁకన్, ౬౭౭

తే॥ తనదునామముకీర్తించు వెనుక యజ్ఞపురుషునామముకీర్తించి భూసురునకు
నన్న మొసఁగిన యజ్ఞాంశమబ్బునపుడుపడయుతమి కెక్కుడౌతమి పడయు నతిథి,

చ॥ అతిథికిఁబెట్టకుండఁ గృతమయ్యెడి శ్రాద్ధముఖాఖిలంబులున్
వితయయిపోవు భస్మమునవ్రేల్చు హవిస్సులవోలె భక్తిమై
నతనికి వైశ్వదేవవిధియౌటయు వెంటనె విష్ణునామసం
యుతముగఁ బూజసేసియిడు నొక్కకణంబును నక్షయంబగున్, ౬౭౯

వ॥ అనిన విని బ్రహ్మ విష్ణు పురస్సరులగు బర్హిర్ముఖు లందఱుం దథాస్తని, రది
మొదలుకొని యతిథిపూజ యేర్పడియెఁగాన యత్నపూర్వకంబుగా నతిథిపూజ యనవ
రతం బాచరించుచుండునది, యజ్ఞపురుషు గౌరవించి యతిథి నవలఁద్రోయు టనర్హం,
బతిథిపూజకన్న గృహస్థులకు వేఱొక ధర్మం బుండ, దెవనియింటనుండి యతిథి
భగ్నాశుఁడై మరలు వానికిఁ దన పాపమొసంగి పుణ్యంబు గొనిపోయెడి. ౬౮౦

సీ॥ అతికష్టములువచ్చి నప్పుడేని యబద్ధమాడకుండునుగాక యధికదీక్ష
నిష్ఠాకలితము నీర్వోపికదుగు సదాచారవంతుండె యగునుగాక
తలక్రిందుగాఁబడి తపమునేయునుగాక రొడలు శుష్కింపఁజేయుచుఁ గరంబు

• పఠియించుఁగాక దేవనిగఁ దాఁ గూర్చుండి యొగిని సాంగోపాంగముగను శ్రుతులు
విద్వద్వనీసురులఁ బిల్చి వేనవేలు బహుమతు లీయఁగాక యెప్పటికినపుడె
యొలిసత్కార్యము లీయుచుండుఁగాక యతిథిఁబూజింపకున్న నయ్యవి వృథాయె.

వ॥ దూరంబునుండివచ్చి యతిథు లెవ్వఁ డింటఁ సుఖింతురో వాఁడె గృహస్థుండు గాని యన్యులు గృహరక్షకుల, పూర్వజన్మంబునఁ బుణ్యముచేయని పురుషులకు శ్రాద్ధదాన ప్రియోక్తులు ఘటింపనేర, వతిథిని సంతోషపెట్టిన నఖిలామరులును సంతోషపడుదు, రతఁడు విముఖుఁడైన నందఱును విముఖులగుదురు కావునఁ బుణ్యసంవృద్ధిగోరు వాఁ డేబ్రాహ్మణప్రదానముచేసైనను నతిథి నానందపెట్టునది శ్రాద్ధీయుఁడు వైశ్వదేవీయుఁడు సూర్యోఢుఁడు నని యతిథి త్రివిధంబుల వర్తిల్లెడి. భోజనార్థాగతులగు తక్కటివా రందఱును సామాన్యులనంబడియెదరు. శ్రాద్ధసంకల్పానంతర మరుదెంచువాఁడు శ్రాద్ధీయుఁడు. దూరపథంబునుండి శ్రాంతుఁడై వైశ్వదేవాంతమున వచ్చినట్టిఁడు వైశ్వదేవీయుఁడు, తత్పూర్వమరుదెంచువాఁ డతిథియనంబడఁడు.

సీ॥ ఆపత్తులనువచ్చి యక్కఱదీర్చుమఁ జాలఁగూర్చెడి ప్రాణసఖుఁడుగాని
యింటిలోఁదిరుచు నయ్యింటివాసాలెక్క పెట్టంగఁజూచు నప్రియుఁడుగాని
పొట్టఁబొడ్చిన నొక్కపాడియక్షరముగూడ నుండని శుద్ధమూర్ఖుఁడుగాని
సభలలో మెప్పొంది సత్కృతుండగుచు నుద్దండుఁడైనను పండితుండుగాని
వైశ్వదేవవేళవచ్చినవాఁడెపో యతిథి స్వర్గమిచ్చు నతఁడె గృహికి
గోత్రనామ్రత మెఱుఁగఁగోరక జందెముం గనియె కుడువఁబెట్టఁజనును నతిథి, ౬౫౩

వ॥ శ్రాద్ధవైశ్వదేవములయం దతిథి యరుదేరకున్న నతనిపేర నగ్నియం దాజ్యాహుతి వ్రేల్చునది, యయ్యతిథి కన్నదానమాచరింప నశక్తుఁడగువాఁ డతఁడు తృప్తిపడునట్లల్పాహారమైన నర్పించి యనుపునది. భోజనానంతరమో రాత్రివేళనో వచ్చినయతిథి సూర్యోఢుండని చెప్పంబడు. నతనికి యథాశక్తి నన్నమో ధనమో ధాన్యమో యర్పించునది. ౬౫౪

సీ॥ చామలు నివరి దూసరి గంటె గునుగులు మొదలైన తృణధాన్యములకు నేని
ఛదసంచయముల నాచ్ఛాదింపఁబడి వినిర్మలత నొప్పారు భూస్థలులకేని
హ్రాదినీకమలాకరాంధువాపీముఖానీతంబులగు మంచినీళ్ళకేని
సత్యేతరంబులై స్వాంతంబురంజింపఁ గడుసమర్థములైన నుడులకేని
లోప మెవరియింటిలోపల నుండమి వానివానిచేత నేని యతిథి
నాదరించిపంపనగుఁజూడ గార్హస్థ్యమానియున్న సుజను లుర్వియందు, ౬౫౫

సీ॥ స్వాగతంబిచ్చిన సంప్రీతిపడుఁ గడుం జిత్రభానుఁడు తాను చిత్తమందు
నాసనంబొసఁగిన నానందముంబొందుఁ దచ్ఛతానందుండు తాఁగరంబు

పావనతమమైన పానీయములతోడ నర్ఘ్య మర్పించిన హాటుఁడు తనియ
భక్తిమైఁబూజించి పక్వాన్నములతోడ నన్నదానము సేయ హరియుమరియుఁ
బాద్యమీయంగఁబడ దివస్పతిమొదల ప్రక్రతుభుజు లీప్రీతులయ్యెద, రతిథి సర్వ
దేవతామయుఁ డటుగాన దినదినమును నర్చనీయుఁడతండుర్వి నధికభక్తి, ౬౫౬

ఆ॥ అర్చనీయుఁడైన యతిథి రాకున్నచో నతని పేరుచెప్పి యన్న మేని
మునుపఁబెట్టవలయు విడువక గృహమేధియైనయగ్రజన్ముఁ డర్హ్యభంగి" ౬౫౭

వ॥ అనియిట్లుచెప్పి సూతుండు వెండియునిట్లను. "విప్రోత్తములారా! యట్లు
మహేశ్వరాదులు పలుకుటయు నతిథి ౬౫౮

ఆ॥ "హాటకేశ్వరాఖ్యనలరు నీక్షేత్రమం దొకటఁ దపమునలిపియుంటిఁ బూర్వ,
మమరిపించియుంటి నటనొక్కతీర్థంబు స్నానదానములను సలుపుకొఱకు, ౬౫౯

కం॥ మంగళవారముతోడను సంగతమగు చవితినాఁడు సకలామరులున్
బొంగుచుఁ దత్తీర్థంపుఁ గురంగట వసియింపవలయు రాత్రిందివముల్, ౬౬౦

ఆ॥ ఆదినంబునందె యాతీర్థమందున స్నాతులైనయట్టి జనములకును
సర్వతీర్థఫలము సమకూరవలయును ద్వత్ప్రసాదమునను దక్షణమున" ౬౬౧

—• ప్రస్థాత విశ్వావసువును శపించుట •—

వ॥ అనిప్రార్థించుటయుఁ దత్సురోత్తములెల్లరుం దథాస్తని రంత నాలవదినం
బున ఋత్విజులు యజ్ఞకర్మ మారంభించి సోమపాన పశుహింసాదికంబు నిర్వర్తించు
టయుఁ బ్రస్థాత యేకాంతంబుగా సదోమధ్యంబునం బ్రవేశించి తత్పశుగుదమాంస
హోమకత్పరత్వంబున వ్యగ్రుండైయుండ మాంసభక్షణలాలసుండగు నొక్కయువకుండు
సనుదెంచి యద్దాని భక్షించె. భక్షమాణుండగు నతని విలోకించి ప్రస్థాత ౬౬౨

కం॥ "ఛీఛీ! హోమముసేయను నీచా! పశుగుదమునిచటఁ జేఁబెట్టుకొనన్
నీ చాపల్యముచూపుచు మాచూచితి దూష్యమయ్యెఁబోయది యింకన్, ౬౬౩

శా॥ స్వేచ్ఛంబై నపదార్థసంచయమెకా సప్తార్చి హోతవ్య, మీ
యుచ్ఛిష్టంబును బెట్టె యెట్టులిఁక నే హోమంబు గావింతురా?
తచ్ఛిష్టేతరులైన రాక్షసుల చేతద్దుష్క్రియ ల్గాన నో
తుచ్ఛా! నీవును రాక్షసుండవగుచున్ దుఃఖింపుమా యింతటన్" ౬౬౪

వ॥ అనిశపించుటయు ౬౬౫

సీ॥ ఈక్షణంబులురెండు నెఱ్ఱనై కనుపట్టె నౌత్తిపెంట్రుకలెల్ల నిట్టనిలిచెఁ
బాచిపట్టికరంబు పండ్లు నల్లగనయ్యెఁ గర్ణము లోమ్రదులకరణిఁదోఁచెఁ
గడు భీషణంపు టాకారంబువాటిల్లె దిగజాతెఁ గ్రిందికి మిగులఁ బెదవి
కోలమొగం బొడ్డకున్ భీతిపుట్టించె మాంసంబు మేదస్సు మంటఁగలసె

నరము లెముకలు చర్మముం గడకుమిగిలెఁ దలఁపునకుఁదెచ్చెఁ జాముండ దోష్ట్రజనుల
నిట్లు రాక్షసభావంబు నెనసెనతఁడు తక్షణంబునఁ దచ్ఛాపసత్త్రయోగము, ౧౯౬

సీ॥ అఖిలప్రపంచంబు నవలీలసృజియించి తనరారునటువంటి ధాతృపౌత్రు
సకలవాచంయమసంస్తూయమానుఁడౌ నల పులస్త్యమునీంద్రు ననుఁగుఁగొడుకు
వేదవేదాంగాది వివిధవిద్యలుగూడ శ్రద్ధమైఁజదివిన సన్మనీషి
క్షమను విశ్వావసుసమభిధానంబుచేఁ బిలువంగఁబడియెడి యలఘుచరితు
మంత్రపూతమైనమాంసంబుదినుటకై యేగుదెంచి భూసురేంద్రుచేత
శప్తుఁడైన యానిశాచరాకారుని జూచి యచటనున్న క్షోణిసురులు, ౧౯౭

సీ॥ కొందఱుచనిభీతి గోరాజవాహను కాళ్ళపైఁబడి రీశ! కావుమనుచుఁ
గొందఱుపోయి యాయిందీవరాక్షుని శరణుఁబొందిరి రక్ష హరి! యటంచుఁ
గొందఱేగి రయంబ బృందారకజ్యేష్ఠప్రాపుఁజొచ్చిరి దేవ! పాహియనుచుఁ
గొందఱు గాయత్రికూరుచుండిన యజ్ఞశాలడాఁగిరి యంబ! యేలుమనుచుఁ
గొందఱు జపించి రెంతయుఁ గుండెపగిలి శుద్ధమనమున రక్షోఘ్నసూక్తములను
నంద ఱన్నివిధంబులఁ దొందరపడి వందురి యతండు తనదైనచందమునకు, ౧౯౮

వ॥ కనులవెంట గిరగిర నీళ్ళుదిరుగ బ్రహ్మపాలికిం బరువెత్తి ౧౯౯

కం॥ "మనుమఁడ నీకుఁ బులస్త్యుని తనయుఁడఁ బ్రస్థాతృశాపదగ్ధుఁడనై యీ
దనుజాకారముదాలిచితిని జిహ్వాలౌల్యమునను దిని పలుగుదమున్, ౨౦౦

కం॥ ఎఱుఁగక హోమార్థముగం బరికల్పితమైనదాని భక్షించితి నో
పరమేష్ఠి! తిరిగి నరత న్దరుణించుచు రాక్షసత్వనాశకుఁడగుమా" ౨౦౧

వ॥ అనినవిని పితామహుండు ప్రస్థాతతో సామపూర్వకంబుగా నిట్లనియె. ౨౦౨

ఆ॥ బాలకుండు వాదుపౌత్రుండు వీఁడు గుణైబుఁగఁ దెదియుఁగాన నెంతయును స
హించి రాక్షసత్వ మెడలంగఁజేయుము మహీసురేంద్ర! నాదుమాటవినుము" ౨౦౩

వ॥ అనినవిని యమ్మౌని ౨౦౪

ఆ॥ "పలుగుదం బశుద్ధపఱిచి ప్రాయశ్చిత్తమునుజనింపఁజేసె ననఘ! యితఁడు
గాన యజ్ఞవిఘ్నకరుని శపించితి నెపుడు రాక్షసత్వ మపనయింప" ౨౦౫

వ॥ నావుడు బ్రహ్మదేవుండు ౨౦౬

క॥ ఏతత్క్రతుసిద్ధికిఁగా నాతతగోభూప్రదానవాకనము లెల్లన్
జేతును బ్రాయశ్చిత్తం బీతని దైతేయభావ మెడలింపు దయన్" ౨౦౭

వ॥ అనుటయు మరల నతండిట్లనియె. ౨౦౮

కం॥ అనలము శీతలమగునో వనజారికి వెచ్చఁదనము వచ్చెడినో నే
ననుమాట యన్యథాయా నననిమిన పరిభూజితామరాంఘ్రిసరోజా! ౨౦౯

— రాక్షసులు భుజించు శ్రాద్ధంబులు —

వ॥ అనియిట్లు ప్రస్తాత పలుకుటయు రాక్షసకుమారుండగు విశ్వావసుం గని బ్రహ్మ యిట్లనియె. ౨౦౦

క॥ "నీ వీరూపముతోడన గౌరవతా! నేను జెప్పునొప్పంగాపింపంగన్ బావనము చమత్కారపురి కరుణదిక్ క్షత్రి శ్రీ ప్రియపు నానతిన్. ౨౦౧

ఆ॥ లంకనుండివచ్చి లక్షోపలక్షల యసురు లచటఁ బెక్కు నాటికిం చు చున్నవారు కోరి యున్నతపద. నటు రాజనంబు నాగర ప్రియముగ. ౨౦౨

క॥ భూతప్రేతపిశాచము లాతత కూశ్మాండములును నతిదుర్జన్మో పేతులగు దనుజులును గల రేతత్క్షేత్రంబునందు నింకను దనయా! ౨౦౩

ఆ॥ అచటికరుగునట్టి యవనీప్రజల వారు నిగ్రహింతు రదియె నిమిషమునను నెదుట నాగరుఁడు సమీక్షింపఁబడినచో భయమునఁ జెంది వత్తు రాయుచుండ్రు.

తే॥ అట్లుగావున నచ్చటి యఖిలదానవులకు నేలికగను పొమ్ము పుత్ర! నీవు ఇపుడె రాక్షసరాజ్యంబు నేను నీకు నిచ్చినాఁడను క్షేమమై నేలుమనుచు" ౨౦౪

వ॥ అనియిట్లు చెప్పుటయు రాక్షసుండిట్లనియె. ౨౦౫

ఆ॥ "అసురవరులమీఁద నాధిపత్యంబును బొందు నాకు నేది భోజ్యమగుచుం? భృత్యతతికి నేమి పెట్టంగవలయును? కరుణయుంచి చెప్పఁగదె సురేశ! ౨౦౬

క॥ ఏరాజు భృత్యజనులను గూరిమిఁ బోషింపకుండు ఘోరతరంబౌ రౌరవనరకమునంబడు నారాజని విన్నవాఁడ నార్యులవలనన్" ౨౦౭

వ॥ అనియిట్లు వక్కాణించుటయుఁ జతురాననుండు ౨౦౮

క॥ "తిలదర్భహిరణ్యములం గలితముగానట్టి శ్రాద్ధకర్మము తీర్థం బులఁ బెట్టఁబడినదైనను బలిమిని నీకొసఁగినాఁడ బాలక! కొనుమా. ౨౦౯

సీ॥ కంపలవెంబడిగల యశుద్ధమునిని బలిసియుండిన యూరఁబందిగాని పశుచర్మకృతములౌ పాదరక్షలుదెచ్చి కాలుకు చిల్లులందూఱు కుక్కగాని బూడిదలంబడి పొరలుచుఁ గడుఁ గఠోరంబుగాఁ గూయు గార్దభముగాని ప్రవహార్తవార్ద్రవస్త్రచ్ఛన్న మృదుతనూవల్లియై యున్న పుష్పవతిగాని చూచుచుండంగఁ బెట్టెడి క్షోణిసురుల శ్రాద్ధములఁ బోయి నీవు సమృద్ధముగను గుడుచుచుండుమి యవ్వార లిడు పదార్థములను భృత్యయుతంబుగం బుత్ర! యెపుడు

తే॥ ద్వాదశాంగుళములుగూడ దాఁటిపోయి మూలరహితంబులై నట్టి మాఱువేసి దర్భలంజేర్చి విధిరహితముగ నెట్లొ పెట్టు శ్రాద్ధంబులన్నియు బిడ్డ! నీకు. ౨౧౦

ఆ॥ తిలలో యవలో కై లకలితంబులౌ నపూపములో లేక పెట్టఁబడెడి శ్రాద్ధములను బోయి నీవు లలి భుజియింపుమీ యిచ్చినాఁడ వానినెల్ల నీకు. ౨౧౧

యు ఛందోగుఁడగు దేవశర్మ సమభిధాను సంతానమును నగు నౌదుంబరియను కన్యక యరుదెంచి యుద్గాత నుద్దేశించి  ౨౩౧

— ఔదుంబర్యుద్గాతృసంవాదము. —

ఆ॥ "సామసూచ్యమాన శంస్ప్రవర్తన మెట్టులెట్టులగునో యట్టుపోయి
దక్షిణాగ్నిఁ ద్రేల్చు. దాన నీపాపంబు వాయు. లేకయున్న వ్యర్థమిద్ది"  ౨౩౨

వ॥ అని సాభిప్రాయంబుగా ననిన విని యా యుద్గాత తదుక్తార్థంబు నాలోచించి యాశ్చర్యపడుచు నక్కన్నియతో నిట్లనియె,  ౨౩౩

కం॥ "ఎవ్వోటినుండినీవిపు డివ్వోటికి వచ్చితమ్మ యిభయానరో! యే
సచ్చరితు వనుఁగుబిడ్డవు? పొచ్చెములేకుండఁజెప్పి పొగడఁగఁబడుమీ"  ౨౩౪

వ॥ అనియిట్లడుగుటయు నౌదుంబరి  ౨౩౫

తే॥ "ఒక్క గంధర్వు తనయనై యుండి నేను శాపవశమున నిట దేవశర్మయనెడి
ఋష్యసుదన సుద్భవించితి సంయమీంద్ర! విహిత పూర్వభవజ్ఞాన సహితనగుచు"

వ॥ అనవుడు నుద్గాత మఱియునిట్లనె.  ౨౩౭

కం॥ "ఏగంధర్వునికొమరిత? వేగుణవంతుఁడు శపించె నిటువంటి నినుఁ
బాగాయె. మానుషత్వత్యాగం బెపుడౌనునీకుఁ దనయా! చెప్తుమా"  ౨౩౮

వ॥ నావుడు మరల నౌదుంబరి  ౨౩౯.

కం॥ "నారదుఁడు పర్వతుండను పేరుల గంధర్వవరులు విదితులెకద! య
వ్వారలలోపలఁ బర్వతు గారాబపుబిడ్డ నేను గాశ్యప్యమరా!  ౨౪౦

ఉ॥ నారదుఁ డొక్కనాఁడు తన నాతెపువీణియ తానభంగమౌ
తీరున మీఁట వానివగు తీరు తెఱుంగనిదానవయ్యు నే
నూరక నవ్వడుం గనలునొంది యూరకుండు "మనువ్యధర్మముగ
నూరి హసించినందులకు నోలి! మనుష్యవుగమ్మ పొమ్మ"నెన్.  ౨౪౧

ఉ॥ మానుషభావమొందినను ఋష్యసురవంశమునన్ జనించి నా
స్థానమునందుఁ దత్తనువు త్యాగము సేయుటకు ల్వింధిం పొనర
చేసును నాదుతండ్రియును నెంతయు వేఁడఁగ నాదుమొఱ్ఱ విమూఁ
దాను క్షమించి యిట్లనియెఁ దన్ముని శాపవిమోచకంబుగన్.  ౨౪౨

తే॥ "శ్రీచమత్కారపురమున క్షితిసురేంద్రుఁడుం గులీనుఁడు వేదవేదాంగవిదుఁడు
నై చెలంగెడి దేవశర్మాఖ్యు గృహిణి సత్యభామాఖ్య కడుపున జననమంది

ఆ॥ ఎప్పుడు బ్రహ్మదేవుఁ డిచ్ఛతోడుత యజ్ఞమాచరించు నప్పుడుపోయి
యూరకుండ కచటియుద్గాత పల్కిన యర్థమును గాంచి తయమదక్కి

—॥ బ్రహ్మయజ్ఞంబునకు మాతృగణంబులువచ్చుట ॥—

సీ॥ గంధర్వులందఱుం గడుభక్తిమై వేని నర్చింపుచుండుదు రన్వహంబు
సిద్ధులు స్వాభీష్టసిద్ధిఁ గోరి సతంబు వేనిని బూజింత్రు వివిధగతుల
సాధ్యసమూహంబు శ్రద్ధ వేనిభజించి సాధింతు రాత్మీయసంపదలను
మరుదోఘములు వేని మతిరతిసేవించి మహనీయతములౌచు మనుదు రెపుడు
నట్టిమాతృగణము లౌదుంబరీస్థితి వెండికొండనుండి విన్నవగుచు
హాటకేశ్వరమున కరుదెంచి యాడుచుం బాడుచును హసింపఁబరఁగుటయును

వ॥ తత్కోలాహలంబువిని బ్రహ్మవిష్ణ్వింద్రాది సర్వగీర్వాణులును విహ్వలు పడి ‘యిదియేమి’ యని యజ్ఞమంటపమునుండి లేచిరి. పదపడి మాతృగణంబులన్నియుఁ బద్మజునకుఁ బ్రణమిల్లి ౨౨౧

తే॥ “వాయుదేవుండు మముఁబిల్వ వచ్చినార మనఘ! నీచేయుమఖమున. కధ్వరంబు
లను హవిర్భాగములులేవుకనుకమాకు రాకమసలితి మిన్నాళ్ళదాఁక నిటకు ౨౨౨

కం॥ ఔదుంబరీప్రభావం బీదినమునఁ జెవులఁబడుడు నేతెంచితి మి
ష్టాదేవ! యాహెఁగని యభివాదనపూర్వముగఁ గొలిచివచ్చితి మిటకున్. ౨౨౩

కం॥ పర్వతుఁడను పేరిటి గంధర్వుఁడు మహనీయుఁ డతని తనుభవయగు నీ
గీర్వాణసుప్రతిష్ఠిత సర్వాభీష్టంబు లొసఁగు సతులకు నింకన్. ౨౨౪

కం॥ స్థానంబుమాపు మాకు శతానంద! యటుల వసింతు మందఱమును మే
మానందమునను, నలువదిపై నెనిమిది మాగణములు. పరికింపు మొగిన్” ౨౨౫

వ॥ అనినవిని యంబుజాసనుండు యజ్ఞమంటపం బష్టషష్టిమాతృగణంబులచేతను త్రయస్త్రింశత్కోటిదేవతలచేతను సంకీర్ణమగుటయుఁ జింగి శ్రుతాధ్యయనసంపన్నుఁడును నపరబృహస్పతియు నాగరజాతుండును నగు మధ్యగుంబిలిచి హానంబుపీడి ౨౨౬

ఆ॥ “ఈవుపోయి యలువదెనిమిదిగోత్రాల నాగరులనుగూర్చి నయముతోడ
నీగణంబు లలువదెనిమిదింటికి నొక్కొక్కరు స్థానస్థలము నొసఁగుఁడనియు ౨౨౭
[illegible] నీమాతృగణముల కాస్మప్రీతి గాన నీసాయమును నాకుఁ గరుణయుంచి
[illegible] జెప్పుమయ్య మధ్యగా! వేగిరమ్మగ హామాటగాను” ౨౨౮

[illegible] నతం డతిత్వరితంబుగా నరిగి యా నాగరులందఱి [illegible] నేతెంచుగా నభివాదనమాచరించి యంతయు వక్కా [illegible] నాగరు లదివిని యగ్గలంబుగు హర్షంబున నొక్కొక్కగణమున [illegible] చొసంగిరి. పదపడి మాతృకలు పరమేష్ఠికిం బ్రణమిల్లి [illegible] ప్రాప్య ప్రాప్తమ్ము హర్మ్య ప్రదేశంబులం బ్రవేశించి తదాచరిత నానా [illegible] పాడుచు నవ్వుచు ౨౨౯

క॥ "చనము మతియొక్క స్థలమున. కనయంబు వసింతు మిందె. యన్యత్ర యటుల్
కననబడరు భక్తభూసురు. లెవగా దెద్దియును పాటు కేశ్వరమునకున్" ౨౬౦

——♦ సావిత్రి మాతృగణంబుల శపించుట. ♦

వ॥ అని పలుకుచుండు సమయంబునకు సావిత్రివచ్చి యజ్ఞశాలం బ్రవేశింపం బోవుటయు బ్రాహ్మణులు నమస్కరించి ౨౬౧

తే॥ "బ్రహ్మ గాయత్రియను పేరి పడతిమిన్నఁ బరిణయంబయి సవనంబు జరుపుచుండె. నట్లుగావున సావిత్రి! యరుగకమ్మ యా సదోమధ్యమున కీవు స్వస్థముగను" ౨౬౨

వ॥ అని నివారించుటయు నాయమ యత్యాశ్చర్యంబున దుఃఖసహితయు బాష్పవ్యాకులలోచనయు నై యేడుచుం బాడుచు మత్సాహముం బ్రకటించు మాతృకలం జూచి గద్గదస్వరంబున నిట్లనియె. ౨౬౩

చ॥ "సవతికి యుక్తగౌరవము సల్పి నమస్కృతిగూడఁజేయ కి
ట్లవమతి నాకుఁ జేసితిరి. యందున మీరిఁక నెన్ని నాళ్ళకే
నవలకు నేగ కింద మనుఁగడాలయు ముండెడు మీ కొకప్పుడున్.
బ్రవిమలభక్తి నాగరకబ్రాహ్మణపూజయు నుండ దెన్నఁడున్. ౨౬౪

క॥ చలి కాలంబునఁ జలిచే బలుగ్రీష్మమునందు రశ్మిపటలము చేతన్
జలదాగమమున జలముల వెలఁ గ్లేశమునొందుచుండుఁ డేఁలు మిగులన్" ౨౬౫

వ॥ అనియిట్లు శపించి నాగరస్త్రీరత్నంబులు తనచుట్టుం జుట్టుకొని రోదార్చ్చుచుండ నందరయుండుటయు సూర్యభగవానుఁ డస్తంగతుఁడయ్యె. యజ్ఞమంటపంబున యాజ్ఞికబ్రాహ్మణుల శాస్త్రార్థచర్చారూపంబగు మహాధ్వని బయలువెడలె. నంత శపింపఁబడిన మాతృక లందఱును ౨౬౬

క॥ "ఈవిడశాపము తప్పదు కావున నాదుంబరి సకాశంబునకున్
బోవుద మాతురు మధురిమముగ నీ వచ్చిన [illegible] రౌలమి పౌనర్భున్" ౨౬౭

వ॥ అని యాయమ యంతికంబున కరిగి ౨౬౮

క॥ "మేమందఱమును దేవిరో! యామతమున [illegible]
న్యామణివై పాలిచెడి నీ ప్రేమ నావిర్భాగముల లభించెద [illegible]. ౨౬౯

తే॥ నాగరస్త్రీజనంబుల నడుమఁజేరి పరమదౌర్భాగ్యయుతయుం [illegible]
యుండె సావిత్రియు నంచు నొక్కయింతయేనియును మాకుఁ [illegible]
ఆ॥ అధికలంబుగాదు [illegible] బాడుచు నున్నవారమేము [illegible]
గుడుము చేతికిడినఁ [illegible] యజ్ఞభాగమబ్బ వార్గ [illegible]

క॥ అందులకై, శపియించెను [illegible] గాంధర్వసత్తమా! యావె మమున్
మందరు లెవరుం జెందని [illegible] కొన కీ మింకన్. [illegible]

—• బ్రహ్మ, అవభృథస్నానమునకుఁ బోవుట •—

వ॥ అనివక్కాణించె. నిట్లు హాటకేశ్వరక్షేత్రంబున సర్వకామసమృద్ధిమంతమై
యాయజ్ఞంబు పంచరాత్రంబులు జరుగుటయుఁ దత్సమాప్తియందు ౨౦౫

సీ॥ విధిచోదితములైన విపులదక్షిణలచే ఋత్విక్కులైనట్టి ఋషివరులను
విద్వత్తకుం దగువిధమైన సత్కృతిం దక్కటి భూదేవతల్లజులను
నాచ్ఛాదనప్రదానాదికంబులచేత నంధపంగ్వాదులౌ నగతికులను
బప్పన్నమున దీనభావంబుపహరించి పేరాఁకటంగుందు భిక్షుకులను
జాలఁదనిపి యంతఁ జాతుశ్చరణసంపదన్వితులను మఱియు నాగమజ్ఞు
లై రహించు నాగరావనీసురుల రావించి దోసిలొగ్గి వినయమూనను ౨౦౬

కం॥ "కలికాలమువచ్చుటయును నిలఁగల తీర్థములు గుడులు నెంతయు మ్లేచ్ఛా
దులచేత స్పృశింపఁగఁబడి విలయంబునుబొందు. లేదు విచికిత్స యిటుల్. ౨౦౭

ఉ॥ కావున నేను భీతిపడి ఖస్థిత మామక పుష్కరంబు ముక్
దావకభూమిఁ జేరిచితి. దానికి హాటకరాణ్మహాత్తచేఁ
గావలులైన మ్లేచ్ఛు లధికంబుగ మఱి కలికాలమందు నే
నేవిధమైనహానియును నేర్పడకుండెడి నిశ్చయంబుగన్. ౨౦౮

తే॥ తత్కృతంబుగ సవమిటు సత్కృతంబు.కనుకఁ ద్వద్యాభిమినిష్క్రియంబునను మీరు
నేమివలయునొ వాక్రువ్వఁ డెచ్చిపోదు నధ్వరంబుఫలంబు నా కబ్బునటుల" ౨౦౯

వ॥ అనివక్కాణించుటయు నాగరబ్రాహ్మణులిట్లనిరి. ౨౧౦

తే॥ "యజ్ఞదక్షిణయిూయఁగ నభిమతించి యడుగుఁడనెదేని చెప్పెద మవధరింపు.
మానివాసంబునను సదా మనుచునీవు పరమపావనముం జేయవలసియుండు. ౨౧౧

కం॥ నీవిచ్చట స్థాపించినపావనపుష్కరమునత్త బాగుగఁ జెపు మో
దేవ! యుదగాహానాదిక యావత్క్రియ లేమొనర్తు మట శ్రద్ధ మెయిన్" ౨౧౨

వ॥ నావుడు బ్రహ్మదేవుండు ౨౧౩

కం॥ "పుష్కరమార్గగతై తత్పుష్కరతీర్థంబు నేను బూర్వమున మహా
దుష్కృతసందోహంబులు శుష్కింప సృజించియుంటి సుచరితులారా! ౨౧౪

తే॥ పుడమి నైమిశ మంబరంబునను బుష్కరము కురుక్షేత్ర మల జగత్రయాని విన్న
లగుచు నున్నవియని మీర లాలకింపరే పురాణంబులను సంయమీంద్రులార! ౨౧౫

తే॥ అట్లుగావున నామాట ననుసరించి కార్తికశుక్లపక్షగై కాదశీది
నమునఁ బుష్కర మవనికివ్వచ్చి యైదహంబులందున యామ్మృద్ధి తార్థమగను ౨౧౬

తే॥ అయిదువాళులలోపల నందువచ్చి స్నానమొనరించియో లేక శ్రాద్ధములను
బెట్టియో యత్నయంబైనయట్టిఫలముఁ బొందుదురు శ్రద్ధగల్గినభూమిసురులు. ౨౧౭

కం॥ నే సత్యలోకమందు నివాసము చాలించి యైదువాసరములు నీ
భానురతీర్థముదండను జేసెద సంశ్రయము. విమఁడు క్షితిసురవర్యుల్!" ౨౧౮

మరలును క్షత్రియుల్ విశులు శూద్రులు దీక్షితులతోడఁ గూడఁ దా
మరిగి ప్రయత్నపూర్వముగ నందవగాహన మాచరింపఁగా. ౨౩౧

ఆ॥ అట్లుగాన నాగరావనీదేవులతోడి భాషణంబు విడుమింక.
వారుగూడ లేచి వత్తురు నీతోడ నవభృథోత్సవమున నాడుఁ బొంటె" ౨౩౨

వ॥ అనినవిని వనజాసనుండు కృతకృత్యుండగుటకు సంతసిల్లి గాయత్రీసహితం బుగం బయనమై జ్యేష్ఠకుండతీరంబునకుఁ జనియె. సురలును భూసురులును బులస్త్యాం డునుం బొంగుచుఁ బుత్రదారసమన్వితంబుగం బోయి గిరముతిండిపోతుతండ్రి వెంటఁ బుణ్యజలావగాహనంబుపొంటెం బోయి. రట్లవభృథస్నానార్థ మరుదెంచి యంబరంబునవిహా స్తంబులెత్తెడి యఖిలజనులతోడం గూడి యా పుష్కరతటం బత్యంతసంబాధితం బయ్యె. బ్రహ్మగాని బ్రాహ్మణులోనరుచ్చ వారుణేష్టిగాని యొక్కింతయుం గనంబడక యుండఁ దత్కర్మసమాప్తియందుఁ జతురాననుండు సర్వజనహితముగోరి సన్నిధిని సమిధ యంబుగా నిలిచియున్న శతక్రతుం గనుఁగొని ౨౩౩

క॥ "ఏతత్సమ్మర్దమ్మున స్నాతులుగా వచ్చి దవ్వునన్ బ్రతిలు నీ
భూతలవాసులు దీక్షాన్వితులౌనగు నన్నెఱుంగ నేరరు గానన్ ౨౩౪

తే॥ వెల్లయేనుఁగుపై నెక్కి వెదురుగడయుం జివరఁ దగిలింపు మృదువైన జింకచర్మ
మవభృథస్నానవేళ నయ్యజినచర్మ మందకములలోనఁ బడ వేయు మానుకేళ! ౨౩౫

ఉ॥ స్నానము సేయు వేళ యని సర్వజనంబు నెఱింగి యయ్యెడన్
స్నానముఁ జేసి పొందుదురు శాస్త్రసమీరితమైన శ్రేయ మెం
తేనియు దూరసంస్థుఁడును వృద్ధుఁడు బాలుఁడు గాఁడ సర్వులున్
దానము చేసి ప్రీతి నెయిఁ దత్ఫలమొందుదు రన్నిశాంతరా!" ౨౩౬

వ॥ అని వాక్రుచ్చుటయు నతండు నట్లెయని వడివడిం [illegible] శేషాశైన వెదురుగడచివరఁ గృష్ణాజినంబు దగిలించి జలమధ్యగం [illegible] యందుఁ [illegible] స్నాతకాముండగు వాఁడ స్వయంబుగా [illegible] బడవైచె. నంతట [illegible] గ్రహభూజాలతోడం గృతస్నాతుండై [illegible] హితులై యందు స్నానవాచ్యు [illegible] యంబుగా నొప్పనిలుచున్న [illegible] మఱియునిట్లనిరి.

## బ్రహ్మ యింద్రాదులకు వరములిచ్చుట.

ఆ॥ "నీవు పూనకము గట్టి నిలుచుండి శ్రద్ధ నీక్రతువునందుఁ జాలఁ గష్టపడితి.
కన్నెమిన్నయైన గాయత్రిఁ దోడ్తెచ్చి నాకుఁ బెండ్లిచేసినావుగూడ. ౨౩౮
కం॥ కావున యమ్మదభీష్టంబావర మర్థింపు మిత్తు. నగు భద్రము నీ.
కవుఁగునది సుదుర్లభమై వర్తిలుఁగాక. తప్ప నాడినమాటల్" ౨౩౯
వ॥ అనియిట్లు పలుకుటయు నింద్రుండు ౨౪౦
ఉ॥ "పిప్రియుఁడవైతివేని కడు పెద్దవరంబు నొసంగ నెంచితే
నేతదహంబునందుఁ బ్రతియేటను నేనుఁగుమీఁద నెక్కి వి
ద్యోతితమస్కాగ్రమునఁ దోఁచు మృగాజిన మానుతీర్థమం
దాతతభక్తిఁ జిమ్మ నృపుఁ డయ్యెఁడుగాక గతాఘుఁ డబ్జజా! ౨౪౧
ఆ॥ సకలశత్రువుల కజయ్యుఁడై యారాజు వ్యసనములకు నెపుడు వశుఁడుగాక
యుండవలయు నెంతయును సుఖంబుగ దేవ! యిదియె మాకుకీన మీప్సితంబు
తే॥ అన్యు లెవరేని యాతీర్థమందు వచ్చి తన్మృగాజినయుతముగం దానమాడ
వర్షకృతమైనపాపంబు వారలకును లేకపోవుటగాక నిలింపవంద్య!" ౨౪౩
వ॥ అని ప్రార్థించుటయు బ్రహ్మదేవుండు వెండియు నిట్లనియె. ౨౪౪
ఆ॥ "ఈత్వదుక్తమెల్ల నీప్రకారంబుగా నగును. నేనునుం దథాస్తటంచుఁ
బలికినాఁడ. దీనఁబడకుము సందేహ మెంతమాత్ర మింద్ర! యీవు మతిని. ౨౪౫
శా॥ ఈయానర్తము నేలునట్టియొడయం డీనాడు కుండంబుదా
డాయన్ వచ్చి తటస్థుడైన వను వేడ్కం గొల్చి యేనుంగుపై
హాయిం జక్కఁగఁ గూరుచుండి జలమధ్యంబందునన్ జింకతోల్
వేయంగల్గ జయంబునొంది మిగులన్ విఖ్యాతుఁడౌ ధారుణిన్. ౨౪౬
కం॥ ఇక్కార్యంబున కారయ నక్కార్తిక బహుళపక్షమందలి ప్రతిప
త్తెక్కుడు ప్రశస్తం మందునుజక్కఁగఁ గుతపంబెచూచి చలుపఁగవలయున్. ౨౪౭
కం॥ ఆపుణ్యదినమున జనములు నేమంబునవచ్చి యిచట నీరాడినచో
నాపుణ్యముఁ బొని యొకసమఁ దా మొనరిచినట్టి కోలలఁ దలుమాదు రవలన్" ౨౪౮
వ॥ అని యిట్లు చెప్పుచుండుటయు ౨౪౯
సీ॥ దైవతంబులకును ధన్వంతరికిఁగూడ నచికిత్స్యమైయున్న యట్టిదియును
వల్లదా తీడిన్నవిథంబునం దోఁచు పుట్టంబు మెయినిండఁ గట్టినదియుఁ
ద్రోపినంతనపోయి తోంబడివోటులం బడునట్లు కృశియించి మిడుకునదియు
నవుతే కణఁగుచో వడఁగువెట్టుచు నొక్క దండంబు నూఁతగాఁ దాల్చినదియు
నైన యొహస్మశ్మశ్రుపీగ మం దరుగుదెంచి తుమ్ముచును శ్లేష్మము దనతోడనుంచి
యుమియుచు సమీపించి తనవు కంపియొంతయు నమస్కరించి తా నిట్లుపలికెను. ౨౫౦

కం॥ "నీవిటు యజ్ఞమొనర్చుట దేవా! దూరమున వారుఁ దెలియుంబడుదుఁ
వావిరి నిప్పటి కెటులో యేవచ్చినవాఁడ నిటుకు. నేఁడుంద నీకన్. ౨౫౧

ఉ॥ ఇందుఁడు దక్షపుత్రికల నిర్వదియేడ్గురఁ బెండ్లియాడి మ
న్నం దొకరోహిణీసతినె యక్కునఁజేర్చి రమింప నల్గి యా
చందురునిన్ గ్రసింపుమని చయ్యన నన్ను సృజించె దక్షుఁ, డీ
చందమతండు చెప్పుకొన శంకరుఁ డక్కటికంబుఁ జూపుచున్ ౨౫౨

తే॥ ఒక్కపక్షమె చంద్రమునొడలునీకుఁ గబళమయ్యెడుఁ బొమ్మనెఁ. గడమపక్ష
మునను దినుటకు నెదియును గనఁబడమిని బిట్టు కృశియించుచున్నాఁడ నిట్టు నేను.

కం॥ జన్నము ముగిసినపిదపఁ డిన్నగ బ్రాహ్మణుని దనిపి తృప్తోస్మియటం
చన్నుడి తన్ముఖంబున విన్నఁగదా యమ్మఖంబు విశేగాకుండున్. ౨౫౪

ఆ॥ ఏమఖంబుచివర నెంతేని తర్పితుండై ద్విజుండు తృప్తుఁడని యనండొ
యామఖంబు పుడమి వ్యర్థంబె యయ్యెడి నెన్నికోట్లధనము తీయఁబడిన. ౨౫౫

తే॥ అన్ని విధముల బాగుగా నైనయట్టి యామ్మదధ్వరమునను మృష్టాదనంబు
పెట్టి తృప్తోస్మియని యనిపింపుమయ్య యాగమోక్షంబు నెంతయు నాదరించి"
వ॥ అనియిట్లు దీనవదనంబున యాచించుటయు నంబుజాసనుండు ౨౫౬

చం॥ "ఇదిమొదలాహితాగ్నులగు నెల్లమహీసురులున్ ధరాస్థలిన్
ముదమున వైశ్వదేవవిధి మున్ బలులిచ్చి యను ర్త్యకోటికిన్
దదుపరి నీకు నిచ్చెదరు. దాన నగుం బరితృప్తి. గాన నా
సదయుల తక్కులోద్భవుల చక్కికి నేగకు మెంతమాత్రమున్" ౨౫౭

—• యక్ష్మతీర్థోత్పత్తి. •—

వ॥ అని వాక్రుచ్చుటయు మరల యక్ష్మయిట్లనియె. ౨౫౮

ఆ॥ "భారతీకళత్ర! భవదీయమైనట్టి తీర్థమందుఁ జేరి తిన్న నేను
దపముఁ జేసికొనుచుఁ దనుయాత్రగడపెద. నాజ్ఞయిమ్మ వేగ నందుకొఱకు"
వ॥ అనవుడు బ్రహ్మదేవుండు వెండియు

ఆ॥ అట్టులైన నొంతయాశ్రమం బన్యాత్ర యమరించుకొమ్ము యక్ష్మగదమ!
యడుగు మీద్విజాళి నభిమతస్థలమింత జన్నమునకు నేను మున్నె వారి ౨౫౯
వ॥ అనినవిని చమత్కారపురధరణీసురులం బ్రార్థించి వారిచేతఁ [illegible]
యార్జించి యం దాశ్రమంబు నేర్పఱచుకొనియె. నచట భావనాసత్త్వముయశ్ర [illegible]
సంబున స్నాతుండైన యక్ష్మసేవితుం డద్దానిచే విడువంబడియెడు. నిప్పటికిని [illegible]
కనుపట్టు. సకలాహితాగ్నులకును విశేషించి నాగరులకును దానియందల [illegible]
గలదు. కలికాలంబువచ్చినను వారికి నారియుండ్లనుండు చతుష్పాత్తులకును [illegible]

క॥ దీక్షారంభముదాఁకను వీక్షించి త్వదాగమంబు వినువెత్తుటచే
బ్రాహ్మణమ కన్యకాలకు బుభుక్షం బంపించె నాత్మభువు జనయిత్రీ! ౨౭౦

ఆ॥ అతఁడుపోయి యొక్క యాభీరకన్యక దివ్యరూప బలిమిఁ దోడితెచ్చి
గోముఖమునఁద్రోసి గుహ్యమార్గంబునఁ దీసె శుద్ధయగుచుఁ దేజరిల్ల. ౨౭౧

శా॥ దానిం బెండిలియాడుమంచు నెలమిన్ దైత్యారి వాక్రుచ్చె. నీ
శానుం డాపెరుఁ జేసిపెట్టె సరిపోల్చన్ నీకు గాయత్రియం.
చానైలింపగణంబు బ్రాహ్మణులు నయ్యాభీరవంశోద్భవ
స్త్రీనిన్ బ్రాహ్మణిగాను జేర్కొనిరి. యేస్మృత్యుక్తి యట్లుండెనో. ౨౭౨

శా॥ పత్నీధర్మముచేత నంత నతఁడాపద్యాత్మజీ యోజించె నీ
యత్నంబంతియు వ్యర్థమింక మఱియున్ యజ్ఞోపయోగంబుగన్
బత్నీశాలకుఁజేర్చి దర్భరశనాబద్ధంబుగంజేసె నా
నూత్నాభీరకుమారి మంజులకటిన్. నా శీల వాక్రుచ్చుటల్. ౨౭౩

ఉ॥ నిందితమైనయప్పనిని నేను గనుంగొనలేక మర్షమున్
జెందుచు వెళ్ళివచ్చితి నిసీయని యధ్వరశాలనుండి. యీ
చందముగు గ్రతింగి యొదికర్యమె యయ్యదిచేయు. మన్నాప
ద్యం దిగనాత్తు యజ్ఞభువి కమ్మరా! యేగదా యేగ కాఁగదో" ౨౭౪

వ॥ అనినవిని సావిత్రీదేవి ౨౭౫

సీ॥ మొదలంటఁదెగినట్టి వృక్షవల్లిచాడ్పున మంచునఁదడిసిన పద్మలతికభంగి
వల్లభచ్యుత చక్రవాకివిధంబున జలశర్ణితంబైన సరసిమాడ్కి
సంశయంబును జెందు చంద్రరేఖాకృతి మృగముచావిన మృగివడువున
హతభూమిపతియైన తతసేనమాదిరి [illegible] ర్త్రకయైన నేలఁదికరణి
పెండిపోయిన మల్లెపూదండపగిది దూత [illegible] యాఁబెయ్యకాడ మిగుల
వాడఁబాఱిన మొగముతో వైమనస్య మొనసి కదలక నిలుచుండె నేమిగలదు. ౨౭౬

వ॥ అట్టియాయమ నవలోకించి యమరాంగనలు నారదునితో నిట్లనిరి.

క॥ "ఛీఛీ! కలహప్రియ! నీవాచాలత రాగ [illegible] వైరాగ్యములన్
మాచావె. దీనఁ గలిగెడి నాచతురాస్యుననీ [illegible]" ౨౭౭

వ॥ అంత హైమవతి సావిత్రిదిక్కు మొగంబై ౨౭౮

చ॥ "ఇతఁడు కలిప్రియుండు జగదీశ్వరి! సత్యమసత్య [illegible]
బ్రతిదిన మీకుకర్ణమునఁ బ్రాణములన్ ధరియించుచున్న వాఁ
[illegible]! నీవు [illegible] నాత్మహితంబును గోరదేని సం
తతము [illegible] మంచు వచించె శూలి మున్.

ఆ॥ [illegible]
[illegible]

కం॥ స్వయముగ వచటికిఁ జని తద్క్రియమాణము గాంచి యర్థకృత్యంబున నా
రయవలయుఁ గాని కలహప్రియ నుడివిని యిటనెయుంట చేలతనంబా" ౨౭౬

—♦ సావిత్రి బ్రిహ్మసాలికిఁ బోయి దూషించుట. ♦—

వ॥ అనిన విని సావిత్రి. ౨౭౭

సీ॥ మాటిమాటికి గీయమానమౌ గానంబు కర్ణశూలంబౌచు గాసివెట్ట
మర్దలానకముఖ్యమధురగానములెల్ల బంధ్యవాద్యంబుల భాతిఁదోఁపఁ
దత్రత్య సకలసందర్శనం బాత్మకుఁ బ్రేతదర్శనమట్లు భీతిగొలుప
స్వాంగసంగతమైన శృంగారమంతయు నంగారసదృశమై యగుపడంగ
హర్షరహితయయ్యె నమనస్కతంగూరి ప్రతిపదమునఁ దొట్రుపడుచుఁ గరము
కమలనుండి నీళ్ళు కాల్వలై పాఱంగ నేడ్చుకొనుచుఁ బోయి యెట్లొ తుదకు

వ॥ కారాగారంబునంబోలెఁ గ్రతుమండపంబునం బ్రవేశించి దృగ్గోచరంబగు
తద్విధమంతయుం దిలకింపఁజాలక దీనవదనయై నిల్వఁబడుటయు నాయమంగాంచి.

సీ॥ వంచినతల యెత్త వలఁతిగా కతిలజ్జ విధి మొగంబును నేలవేసికొనిరె.
న ట్లధోవదనుఁడై యటునిటుం గదలక స్థాణుండు పేరు సార్థకముఁజేసె.
నేమియుం దెలియని ధీమంతుకైవడిఁ గిమ్మని యనఁడయ్యెఁ దమ్మికంటి.
బొటనవ్రేలునం బుడమి గుంటపడంగ రాయంగఁజొచ్చె స్వారాట్టు నిట్టు.
గోళ్ళు గిల్లుకొనుచుఁ గూర్చుండి రటఁగల తక్కునమరులెల్లఁ దద్భీతిఁ.
జదువుచున్న యట్టి సస్వరవేదంబు వాఁగినూఁగ మొద్దులైరి ద్విజులు. ౨౭౮

వ॥ అంత సావిత్రి సపత్నీసహితుఁడగు స్వపతింగని కనులెఱ్ఱఁజేసి ౨౭౯

తే॥ "మదకఁడా! నీవు మిక్కిలిముగ్ధయైన గొల్లదానివివాహంబు గూడునొక్కొ?
దాని యిరుపక్షముల స్త్రీల ధవుల గూడ మాఱుమనువులఁబడసినవారు చూడ.

తే॥ పసరములవోలె యక్కల్ప్రభవఫురుష లక్కచెల్లెండ్రఁ దల్లులం దక్కఁ దక్క
స్త్రీలనందఱ వేరంత్రీసీయకంగఁ దక్కలోద్భవఁ బెండ్లాడఁదగునె నీవు!

సీ॥ తృణమునే తినుచు నిరుద్రావెడిని తమ త్రుష్ణోపశాంత్యర్థ మం
గళయమే మూత్రపురీషముల్విడిచి సాసాథ్రష్టముంజేయు ను
ల్లూఖారోద్వహనంబొనర్చు శ్రమముం బాటింపకుండం బనుల్.
కణమాత్రంబును నుండియుండ దరయన్ జ్ఞానంబు తజ్జాతికిన్. ౨౮౦

ఉ॥ అట్టులె దీనిజాతియును నంబతిచల్లఁ బొట్టనింపులే
పుట్టుటకుంగలట్టి పృథుభోగముగా మదినెంచి మూత్రిమున్
విట్టు నెపెట్టొ భూమిపయి వీడెడుఁగాని యెఱుంగ దెద్దియున్.
గట్టిడివెట్టిగొల్లలకు జ్ఞాన మదెచ్చటినుండి వచ్చెడిన్. ౨౮౧

కం॥ కడజాతివాండ్రుసహితం బొడఁబడి యొనరింపలేని యొడుదుడుకుపనుల్
జడియక చేతువ గొల్లల బడుగా? యటుగాన నేమిపని సేసి తిసీ! ౨౮౨

తే॥ క్రొత్త పెండ్లముతోడనే కూరుచుండి జన్న మొనరింపవలెనన్న జగతి ఖ్యాత
యైన బ్రాహ్మణకన్యఁ బెండ్లాడరాదె మోసగాఁడవుపో వృథామూఢ! నీవు. ౨౮౩

చం॥ ననుఁబిలిపించియిచ్చుటకి బాసరివారగు వేల్పుటాండ్రయున్
ఘనులయినట్టి వేల్పులయు క్ష్మాసురవర్యులయున్ సమక్షమం
దునఁ గడు నాసగించితివి తుందుడుకొప్పఁగ. నట్లుగాన నే
జనుఁడును నీకుఁ బూజనము సల్పకయుండును గాక కీర్తన్ విధీ! ౯౦౬
ఆ॥ ఈయుదాంబునుండి యేబ్రాహ్మణక్షత్రవైశ్యశూద్రజనము వచ్చినీకు
మంత్రపూజ సేయ మహిని దారిద్ర్యసమన్వితంబగుం దదన్వయంబు. ౯౦౭
కం॥ ఈగొల్లపిల్ల చేయన నేఁగూర్చుండెడిస్థలమున నే కూర్చుంటన్
దాఁ గనుము సంతు. దివిజస్త్రీగణముంబోలె స్త్రీలు సేవింప రిలన్. ౯౦౮
సీ॥ అగ్గలంబగుదుఃఖ మందెడు నిద్దాని సేవించినటువంటి సింహమధ్య.
గొడ్డుదై యవమతింగుడిచెడు నిద్దానిఁబూజించినటువంటి పూవుఁబోఁడి.
మహితదౌర్భాగ్యయై మనియెడు నిద్దానినర్చించినటువంటి యంబుజాస్య.
యత్యంతపాపిష్ఠ యయ్యెడు నిద్దానిగౌరవించినయట్టి కలభయాన.
పంచభర్తృకయగు దీనిపగిది దీనిఁగొలుచు చెలి నష్టచరిత్రయై చెలువుదొలఁగి
కర మపఖ్యాతిగాంచెడు ధరణిలోన నాదుశాపంబుదగిలి యీనాఁటినుండి. ౯౦౯
సీ॥ సత్యశౌచములకుం జాలదూరంబుగా వర్తించు నిద్దానివంశమెల్ల.
శిష్టసాంగత్యంబు స్పష్టంబుగానుండ దవని పై నిద్దానియన్వయమున.
కిల్లువాకిలిలేక యెల్లకాలంబును వనములపను దీనివంగసంబు.
ఆవులఁదెగసమ్మి యాత్మలం బోషింతు రిద్దానిజను లెద్దుమొద్దులగుచుఁ.
[illegible]గుదు రీపంచభర్తృజాతిజనులందఱును. నట్టి నీతి సేవ
[illegible] యవ్వారెనికుఁ [illegible] నిశాచర! కట్టకడకు” ౯౧౦
[illegible] బ్రాహ్మణ [illegible] గాయత్రిని శపించి ౯౧౧

—• సావిత్రి ఇంద్రాదుల శపించుట. •—

[illegible]! పంచభర్త్రియగు నీయాపాధమం దార్చి బ
[illegible] విధికిన్. శక్ర త్వనం గెల్చి నీ
[illegible] సంకెలలచే బంధించి కొంపోయి ని
[illegible] కారాగారమం దుం[illegible] ౯౧౨
[illegible]! [illegible] పంచభర్త్రితోడఁ [illegible]
[illegible] భృత్యుఁడగుచుపోయి వెరల కింక. ౯౧౩
[illegible]! [illegible] జ
[illegible]! [illegible] యారకయుంటు. [illegible].

శ్రీవణ మొనర్పు నాదునుడి. నాకు వియోగము శీవమాసుఁడౌ
ధవునిదె కాని నీకు మృతదారవియోగము సంభవించెడిన్.　　౯౧౪

ఆ॥ ఏ మఖంబులోన నీ పంచభర్తృక సోమిదమ్మయగుచు నేమమూని
నా మఖము హవిస్సు నత్యంతచపలత నడి గ్రహించుచుంటి వహ్ని ! నీవు.　　౯౧౫

తే॥ కాన దుష్టసమాచార ! కమ్ము సర్వభక్షకుండవు. స్వధతోడ స్వాహతోడఁ
గూడి దుఃఖంబె సర్వదా కుడుకుగాని మనుపట్టుల సౌఖ్యంబు నెనయవింక.

శా॥ ఈ భూదేవులు పంచభర్తృకను దా మెంతే ఘనంజేసి దు
ర్లోభావిష్టత బ్రాహ్మణీసతిగఁ బేర్కొంచుం గడున్ బ్రేల్చినా.
రాభీరాదిజఘన్యజోపపతులన్ స్వాధ్యాయవిక్రీత ల
బ్ధాభావంబుగలారు నర్యోదరు వీ రాదోషభూయిష్ఠతన్.　　౯౧౬

కం॥ ఓహో విత్తపతీ! ధనసాహాయ్యము నేసితీవు సవవిప్లవమం-
దీ హేతువున నభోగ్యంబా హీనా ! పొమ్ము యామ్యదర్థము నీకున్.　　౯౧౭

మత్తకోకిల॥ ఆవిధంబునఁ బంచభర్తృక మైన యీ మఖమందు నే
దేవత ల్తగురీతిఁ దోడ్పడి తృప్తిచెందిరొ యట్టి దు
ర్భావు లింతటినుండి తా మనపత్యులై కృశియించుకొం
చేవడిన్ దనుజాళిచేత జయింపఁగాఁబడుచుం డ్రిలన్.　　౯౧౮

మ॥ మతి నాభీరి సపత్నియంచుఁ జెడుహేమంబు ల్తమిం దాల్చి యే
తెలివ ల్దిని కెలంకులందు శివదూతీపూర్వ లున్నారొ యా
పరమద్వేష్యలు వేలువేలఁ బరదృశ్యాకారంబునన్ లేక యే
వ్వరికిం బోవఁగరాని గట్లకడలన్ వర్తింత్రభోగంబుగన్.　　౯౨౦

—§ సావిత్రి యొంటికాలఁ గొండయెక్కుట. §—

వ॥ అని యింద్రాదులంగూర్చి పలికి కోపోపహతచేతస్కయగు సావిత్రి మారెల్
వరిల్లు నఖిలదేవపత్నుల విడనాడి లక్ష్మీప్రభృతులచే నివారింపఁబడుచున్నదియయ్యు నీ
కాముకు నామంబుగూడ వినంబడనియెడకుఁ బోయెదనని యుదఙ్ముఖంబుగం బయనం
బొడమశాలం తటంబునఁ బాపి కుడికాలఁ బర్వతం బధిరోహించె. నప్పటినుండి దద్వామ
పాదంబు పాపహరంబును బుణ్యప్రదంబును నగుచుఁ బర్వతరోధమ్మునం బరిదృశ్యమా
నము. పాపసమాచారుండయ్యు నెవఁ డద్దాని బూజించు వాడు పాలకమ్మున వెడలి
పరమపదంబుఁ బడయు. నవ్వెఁ డెయ్యది యర్థించి యయ్యది యర్పించు గుర్తక
మైనను వాఁ డవశ్య మద్దానిఁ గెందలగలఁడు దివ్యఫలంబునం బతిచేఁ బరాభూతయై సావిత్రి
దేవి పర్వతాశ్రయయయ్యె. సవఁడాయ్యను విషణ్ణమ్మన దినంబునఁగాని ఖచించి విష్ణు

మాన్యంగాని పూజించు వాఁడు మనోభీష్టంబుల నన్నింటిని బొందించు. భక్తిచేఁ దద
గ్రంబునం దేవెచే నాజ్యంబువోసి రక్తతంతుదీపంబు వెలిఁగింపఁబడు నెన్నితంతువు
లెన్ని ముహూర్తములు వెలుంగునో యన్ని జన్మసహస్రములు ౯౨౦
సీ॥ సౌభాగ్యసహితయై క్షమఁజెలంగుమగాని వికృతస్వరూపయై వెలయదావె.
పుత్రపౌత్రులతోడఁ బొలుపారెడుంగాని గొడ్డురాలై మదిం గుందదావె.
యర్థసమృద్ధితో నావహించెడుంగాని దారిద్ర్యమున విధిం దూఱదావె.
సచ్ఛీలయగుచుఁదా సంచరించునుగాని స్వైరిణియైమనం గోరదావె.
యింక విధవయయ్యు నేస్త్రీ తదగ్రమం దాటయాడు నాకె యపుడు తనదు
తనువుఁబోలె నద్యతనపురాకృతదుష్కృతములఁ గరము పీడితములఁజేయు. ౯౨౧
వ॥ పాటఁబాటినబోటి యాపాట యెన్ని జంతువులు విను నన్ని వేలయేండ్లు స్వ
ర్గసుఖం బనుభవించు. ఫలదానంబొనర్చినచెలువ ఫలసంఖ్యాప్రమాణంబులగు యుగం
బులు త్రిదివంబున వసించు. సావిత్రీదక్షిణపార్శ్వంబున బ్రాహ్మణులకును విశేషించి
ముత్తైదువులకును మృష్టాన్నంబు వెట్టిన సిక్థప్రమాణయుగంబులు త్రిదశాలయవాసంబు
చేకుఱెడి. నొక్కరసంబుతోడను నొక్కయన్నంబుతోడను శ్రద్ధాసమన్వితంబుగా
శ్రాద్ధంబు వెట్టిన గయాశ్రాద్ధఫలంబుగలుగు. నాదేవి కుడిప్రక్కఁ గూరుచుండి నిజ
భార్యానీతంబులగు నీరంబులచే సాయంసంధ్యవార్చిన బ్రాహ్మణుఁడు పండ్రెండు
వత్సరంబులు సంధ్యోపాసనచేసిన ఫలంబు వడయఁగలిగెడి. సావిత్రియెదుట నుపవి
ష్టుఁడై జపియించిన మూడువేలయుగంబులు నూటపదునొకొండు పుట్టువులం బొనర్చిన
పాతకంబు నశియించుఁ గావునఁ బ్రయత్నపూర్వకంబుగం జమత్కారపురమునకరిగి
యాదేవి నర్చించునది. విశేషించి నుతియించునది. యీసావిత్రీప్రాఖ్యానము చదివినను
వినినను సర్వాంహోనివారణంబును సుఖప్రాప్తియు నయ్యెడి. మీరడిగిన సావిత్రీ
మాహాత్మ్య మంతయుం జెప్పితి. నిఁక నేమినుడువుదు”నని యనుటయు ఋషులిట్లనిరి.
మ॥ “అటు సావిత్రి సకోపయై చనినపై నాధాత గాయత్రి త
క్కటి యాదిత్యులు నేమిచేసిరి ? యుపేక్షం బూనిరా ? లేక యా
ర్భటి నేమేని యొనర్చిరా ? మఱియు శాపగ్రస్తులౌ వేల్పు ల
చ్చట నెట్లుండిరివార ? యార్య ! కరుణన్ సర్వంబు వాక్రువ్వవే” ౯౨౪
వ॥ అనియడుగుటయు సూతుండు ౯౨౫

## —• గాయత్రి సావిత్రిశాపమును మరల్చుట. •—

క॥ “సావిత్రి యీవిధంబున దేవత లందఱిని బ్రహ్మాదిట్టిచనుటయున్
దేవనుతా గాయత్రీదేవి సదవిలేని యంత ధృతి నిట్లనియెన్. ౯౨౬

క౦॥ " సావిత్రియన్న మాటను నేవిధమునవారియొనర్ప నెవ్వరివశమా.
దేవాసురలోకములుగా. నావాక్యము కార్యకారి యయియే తీరున్. ౨౭

సీ॥ భూరిపాతిప్రత్యమునకంతటికిఁగూడ ననపాయకరమైన యాశ్రయంబు
గలశపాథోనిధికన్యక మొదలైన తద్దేవతాంగనాతతికిఁ బెద్ద
స్వారాట్పురోగమ సర్వగీర్వాణులకన్వహం బత్యంత మర్చనీయ
స్తవనీయతమములౌ సద్గుణంబులకెల్ల నబలాజనంబునం దగ్రగణ్య
యమ్మహాభాగ సావిత్రి. యాత్మధవుని దిట్టుచేలన నయ్యది స్త్రీస్వభావ
మలఘువజ్రప్రహారంబునై నఁగాని నైఁచు వాఁడుది. నైఁపదు సవతికథను. ౨౮

ఉ॥ వాకొనఁగ శపింపఁబడినారు సురల్ ద్విజవర్య. లట్టిను
శ్లోకుల ముప్పదిర్వకయు చూచియుఁజూడనియట్టులుంట యెం
తో కరిసంపుఁజేఁత యది. యోవిబుధాగ్రణులార! కావునన్
మీకిపుడేను శక్యమగు మేలొనరించెద సంతసింపుఁడీ. ౨౯

ఆ॥ వసుమతీసురాదిఁ వర్ణచతుష్టయ ప్రజ కపూజ్యుఁడనియె బ్రహ్మ నామె
ధర్మకర్మమెడియు ధరణి బ్రహ్మస్థానములను బ్రహ్మతేక కనదు సిద్ధి. ౩౦

తే॥ కృష్ణసర్పనమున నేసుకృతముగలుగు లింగపూజను పెద్దిపాసంగుఫలము
సార్వకాలికబ్రహ్మదర్శనమువలన వబ్బు దానికిఁగోటిరెట్లధిక ఫలము. ౩౧

తే॥ పర్వకాలంబులం [illegible] బ్రహ్మదర్శన మత్యంతఫలదమగును.
డెందమందున సందేహ [illegible] నఁబడ దేతదగ్రమంధు. ౩౨

క౦॥ నీవును విప్రవర్యా! [illegible] నరుఁడవైన నగుదుగా.
కావఁడిఁగూడఁ బరార్థమె [illegible] ఫలితముఁగాకే. ౩౩

ఆ॥ రెండురూపములుగ వేపత్తె [illegible] దచట.
నొకటి గృష్ణనామ మెంం దర్శ [illegible] ౩౪

తే॥ ఆ భవద్రూపమేదైన యర్జునకు [illegible]
పిలువఁబడియెడినీవిఁదఁ జేయగలిగి [illegible] ౩౫

శా॥ దానంజేసి సమ స్తలోకదివిమర్త్యం [illegible]
కానల్ మన్కిగ నందునాఁడును మదిం [illegible]
తేనిం [illegible] గలిగి పోయిన్ భూమి [illegible]
మ్యాన్నశీని [illegible]! [illegible] సరగంబునన్.



క౦॥ ఓహోవాశ్వ! [illegible] లాదటఁ దాతా
సీమాంబునఁ బ్రోనదని [illegible] సావిత్రి వెసన్.

ఆ॥ అపుడు బ్రహ్మ తానె యరుదెంచి వడినిన్ను బంధముక్తుఁజేయ భయముపడక,
మంతఁ బోరఁజొచ్చి యపజయంబునుబొంద, వింతసిశ్చయం బిఁకేమిభయము. ౯౩౮
కం॥ అన్నిఁటితిండి కాఁడుగ నిన్నును సావిత్రి గాలిసెచ్చెలి! తిట్టెన్.
నిన్ను స్పృశించినయంతన యన్నియుఁ బావనములగును నడలకుమింకన్. ౯౩౯
ఆ॥ స్వాహతోడనురల స్వధతోడఁబితరులం దనుపుచౌనుచునీవు ధాత్రిలోనఁ
బూజవడయఁగలవుపో హవ్యవాహన! మామకీనవాక్యమహిమవలన. ౯౪౦
ఈ॥ రుద్ర! ప్రియావియోగమున రూపఱెదంచు శపించెనామె ని.
న్నద్రికుమారి గౌరియనునాయమ వెన్కటిభార్య కక్కడా.
భద్రగుణాఢ్య యింకనొకపంకజలోచన భార్యయై భవ
చ్ఛిద్రము లెల్లఁబోవణఁచు. చింతిల కింతయు సంతసింపుమా" ౯౪౧
వ॥ అని శాపగ్రస్తుల కందఱికిని దన్నివృత్తిపూర్వకంబుగా వరంబులిచ్చి మరల
మౌనమవలంబించి కూర్చుండుటయు సర్వదేవర్షులును ౯౪౨

—• దేవతలు గాయత్రిని స్తుతించుట. •—

కం॥ ఏతద్దేవినిగొలుతురు భూతలమున మనుజులింకఁ. బూర్వము ధాతన్
శ్రీతంజేసి పిదప నీమాతం బూజింప మోక్షమార్గము దొరకున్. ౯౪౩
కం॥ ఏవనిత మగనిఁగలసినయావల గాయత్రి క్రాళ్ళ కభివందనమున్
గావించునో యావనితకుఁ గావలసినయంతసంతు గలుగును జగతిన్. ౯౪౪
తే॥ వంధ్య దుర్భగ యయ్యు సేవనరుణాక్షి శ్రద్ధ గాయత్రి సేవించు సర్వకామ
సౌఖ్యయుతయును ధనధాన్యసహితయు నయి ధరణిఁ జెలఁగెడినాయమ తప్పకుండ"
వ॥ అని ప్రశంసించి సనిమాతుండు వక్కాణించుటయు ౯౪౫
కం॥ గోదానాదికతోషిత భూదివిజజనసమూహ! పోషితదీనా
నాథాదికసందోహ! యాదవరగామనిర్మితాత్మనుగేహ! ౯౪౬
గద్య॥ ఇది శ్రీమజ్జగద్గురు గురుకరుణాకటాక్షసంప్రాప్తకవితాసాహిత్యనిధాన
హారితసగోత్రోద్భవ లక్ష్మీనారాయణ పేరమాంబికా గర్భశుక్తి
ముక్తాయమాన విద్వత్సభావిమర్శ్యాతానకథానవిధాన
జానపాటి పట్టాభిరామాభిధాన సుమాంధ్రీ
కృతంబగు శ్రీస్కాందమహాపురాణాంత
గత నాగరఖండంబునందు
సప్తమాశ్వాసము





# నాగరఖండము.

## అష్టమాశ్వాసము.

కం॥ శ్రీరామభీమహానమద్ధీరత్రయపిత్పపదీయ ! ధిక్కృతబలవ
ద్వైరిసముదాయ ! విద్యాప్రారంభసహాయ ! శ్రీ పరాంకుశరాయా ! ౧
కం॥ అవధారు. సూతుఁగనుగొని సవినయముగ శౌనకాదిసంయమివర్యుల్
నవనవముగ మది నుద్భవమవు సంశయ మెడల నిట్టులని రొక్కమొగిన్. ౨
కం॥ "పంచాస్యుండా క్షేత్రము నెంచి మహీదైవతముల కిచ్చిన వెనుకన్
బంచోత్తరశతసంఖ్యాపరిమితులు చని రిప్పటికి సరిగనని యనవే ! ౩
తే॥ అట్టు లా క్షేత్రమును నాగరావనీసురుల కొసంగిన దీశంకరుండొ లేక
యితరుడోయని సందేహ మేరుపడియె. దాని దీర్పంగదయ్య సూతా ! వినీత ! ౪
తే॥ అమ్మహేశ్వరు సాయుజ్య మద్ది యెంతొ యాచకింపంగ వేడుకయయ్యె మాకు.
నరనియాయువు హరియాయు వజునియాయువొజ వివరింపఁగదయ్య యాచితశయ్యా
వ॥ అనియిట్లు ప్రశ్నించుటయు సూతుండు ౬

## —• నిమేషాది కల్పాంతపర్యంత కాలప్రమాణము •—

తే॥ "ఏను మీకు వచింతు మునీంద్రులార ! యవహితులరయి యందఱు నాలకింపుఁ.
డజునియాయువు హరియాయు వవ్విధమున శివునియాయువు గీర్తనసేయువాఁడ. ౭
వ॥ నిమిషములోని నాలవభాగము త్రుటియనంబడు. రెండుత్రుటులు లవము
రెండులవములు కలయుఁ బదియేనుకలలు కాష్ఠయగు ముప్పది కాష్ఠలు కలయగు ముప్పది
కలలు క్షణమును బండ్రెండుక్షణములు ముహూర్తమును ముప్పదిముహూర్త
ములహోరాత్రమ్మును ముప్పదియహోరాత్రములు మాసమును రెండుమాసములు ఋతువును
మూఁడుఋతువు లయనమును రెండయనములు సంవత్సరమును మానవుల కయ్యెడు
సంవత్సరములోని యుత్తరాయణము పగలును దక్షిణాయనము రాత్రియు నై దేవతల
కొక్కయహోరాత్రమగుఁ. బదియేడులక్షల యిరువదియెనిమిదివేల మనుష్యవత్సరము
లొదవెడుగు కృతయుగంబును బండ్రెండులక్షల తొంబదియాఱువేల వత్సరంబులు రెండవది

యగు త్రేతాయుగంబున నెనిమిదిలక్షల యిరువదినాలుగు వేల వత్సరంబుల మూఁడవది యగు ద్వాపరయుగంబున నాలుగులక్షల ముప్పదిరెండు వేలవత్సరంబుల నాలవదియగు కలియుగంబున నిర్దిష్టంబు. ఈయుగచతుష్టయము వేయిమాఱులుతిరిగివచ్చిన బ్రహ్మ కొక్కదినంబగు. నట్టిదినంబుల ముప్పదింట నొకమాసంబును నట్టిమాసంబుల పంన్రెండింట నొకవత్సరంబును గా బ్రహ్మ యట్టిసంవత్సరములు నూఱగువఱకు జీవించు. బ్రహ్మసంవత్సరము విష్ణువున కొక్కదివసమయ్యెడి. నాయనయు నిజమానంబున నూఱేండ్లు జీవించు. విష్ణుసంవత్సరము శివున కొక్కదినంబగు. నాశివుండును బూర్వోక్తక్రమంబున వర్షశతంబుజీవించు. బ్రహ్మవిష్ణుమహేశ్వరులకును గంధర్వోరగ రక్షఃప్రముఖ సర్వదేవాలకును నొక్కొక్క యహోరాత్రమున కిరువదియొక్క వేయి యాఱునూఱుల యుచ్ఛ్వాసనిశ్వాసములు నడుచుచుండు. నా యుచ్ఛ్వాసనిశ్వాసము లొక్కపలమును నఱువదిపలము లొక్కనాడియు నఱువదినాడు లొక్కయహోరాత్రమును నయ్యెడి. సదాశివుని యుచ్ఛ్వాసనిశ్వాసములకు లెక్కలే. దందువలన నతం డక్షయుండనంబడియెడి. నెవరు బ్రహ్మజ్ఞాన సహితులై సదాశివుని బొందుదురో వారు నక్షయులయ్యెదరు. సత్యముచెప్పుచుంటి " నని సూతుండు శౌనకాదు లిట్లనిరి. ౮

క॥ " నూఱేండ్లునిండుటయు నజనారాయణఫాలలోచన ప్రముఖులకే
యారీతినాశమొదవిన నేరీతిని ముక్తిగలుగు నితరుల కింకన్? ౯
ఆ॥ అల్పజీవులైన నట్టి మనుష్యులే ముక్తులగుదురనుచు బుధులు సెప్ప
వారిమాటలెల్ల వమ్మయిపోవంగ నిట్లుచెప్పుచుంటి వేల యార్య ! " ౧౦
వ॥ అని యిట్లడుగుటయు నెండియుమాతుండు ౧౧
శ్లో॥ ఆద్యంతములేక సంఖ్యావిహీనమగుచునుండెడి కాలమం దజహరిశు
లాత్మశతవర్ష సంపూర్తియగుడు నాశమొందిరెందఱో యణువులచందమునను. ౧౨
వ॥ బ్రహ్మజ్ఞానంబుపడసిరేని దేవతలకే కాదు మనుష్యులకును ముక్తిగలుగుటకు సంశయములేదు. నల్లులు దోమలు మున్నగు పురుగులు మనుష్యులచేత గణింపఁబడక యెట్లు పుట్టి గిట్టుచుండునో యట్లు మనుష్యులును నింద్రాదిదేవతలచే గణింపఁబడక పురుగులవోలెఁ జూడఁబడుచుందురు. దేవతలకు మనుష్యు లెట్లు కీటస్థానమందుండిరో యత్యుత్కృష్టుండగు బ్రహ్మకు దేవతలు నట్లని యెఱుంగునది. బ్రహ్మయు విష్ణువున కట్లు కీటకసదృశుండెం. బ్రహ్మవిష్ణువుల కట్లు కీటసదృశులెవారు తల్లివిష్ణువును శివశక్తులచేఁ దలంపఁబడరు. నట్లు విష్ణువు శివశక్తులకుఁ గ్రిమితుల్యుఁడో సదాశివునకు వారును నట్లయ్యెదరు. యజ్ఞాది సత్కర్మానుష్ఠానంబునఁ బాపరహితులై బ్రహ్మజ్ఞానంబు గడించినఁ దత్వజ్ఞుడగు సదాశివుని జేరెదరు. సంపూర్ణదక్షిణలైనను గేవలాగ్నిష్టోమాది యజ్ఞంబుల వలన స్వర్గాది లోకంబులందుఁ బృథగ్విధంబగు భోగంబు లనుభవించి తత్ఫ

ణ్యాత్మయానంతరము తిరిగి మహీతలంబునకు వచ్చెదరు. బ్రహ్మజ్ఞానద్వారంబునఁ బరాత్పరుఁగలసిన వారికిఁ బునర్జన్మము సంభవింపదు కావునఁ బ్రయత్నపూర్వకంబుగా బ్రహ్మజ్ఞానము సంపాదించునది. యభ్యాసపరున కొకజన్మమందే జ్ఞానపరిపూర్తి కాక కొంతపడినను ద్వితీయజన్మంబున ద్విగుణమై తృతీయజన్మంబునఁ ద్రిగుణమై యట్లు ప్రతిజన్మంబున నేకోత్తరాభివృద్ధియగుటయు మెల్ల మెల్లన బహుజన్మంబులకేని బ్రహ్మంబునఁగలయు" నని వాక్రుచ్చుటయు మరల శౌనకాదు లిట్లనిరి. ౧౩

క౦॥ "నరులకు బ్రహ్మజ్ఞానము ధర నెవ్విధమునను గలుగుఁ ? దక్కంగతి నీ
వెఱుఁగుదువేని వచింపుము కరుణాదృక్కులను మమ్ముఁ గాంచి మహాత్మా!" ౧౪

వ॥ అనియిట్లు ప్రార్థించుటయు నక్కథకుండు ౧౫

క౦॥ మానవులకు వెస బ్రహ్మజ్ఞాన మిట్లుల్లగునను చుఁ జక్క వచింపం
గా నాకు శక్తియెక్కడి ? దేవెఱుఁగక మీకుదాని నెట్లువచింతుఁ ? ౧౬

వ॥ అయినను మత్ప్రత్యుపదిష్టంబగు బ్రహ్మజ్ఞానకారణంబు వచించెద వినుండు. హాటకేశ్వర క్షేత్రంబున బ్రాహ్మణక్షత్రియకన్యలచే నిర్మింపంబడి బ్రహ్మజ్ఞానప్రదంబులగు రెండుతీర్థంబులుగలవు. తత్తీర్థద్వయంబునం దష్టమీచతుర్దశీదినంబుల నొక్కరోడాది నీరమ్మాడి గర్తమధ్యంబున సంగుప్తంబులై కుమారిచేఁ బూజింపఁబడుచు సుప్రసిద్ధంబులైయున్న పాదుకలఁ బూజించువానికి వత్సరాంతంబున బ్రహ్మజ్ఞానంబుగలుగు. స్వదర్శనఫలంబుగలుగుటకై యాపాదుక లందు శక్తిచే నుంపఁబడియుండె. ముక్తికాములగు లోకుల కవి బ్రహ్మజ్ఞానసుఖావహంబులు శాతంద్రి యచటికేగి జ్ఞానవంతుఁడయ్యెఁ. దదాదేశంబున నే నచటికరిగి యొకసంవత్సరంబుండి పాదుకలు నర్చింప జ్ఞానంబుగలిగినది. తత్ప్రసాదంబున లోకులవలన నేనువినిన యత్కించిత్పురాణశ్రేష్ఠము నిలిచియున్నయది. భూతభవిష్యద్వర్తమానములఁ దెలిసికొనుచున్న వాఁడ. నాతత్త్వకారణంబున వేదపఠనంబొకటివిడిచి భర్త్రయజ్ఞమునిచాడ్పునఁ దదర్థమంతయుఁ దెలిసికొనుచుంటిఁ గావున ముక్తిగావలెనన్న నచటికరుగుఁడు. స్వర్గప్రదంబులైన యనునావృత్తికారణంబులగు నీసత్రంబులవలన నేమిగానున్నది ? సంవత్సరాంతంబున బ్రహ్మజ్ఞానంబుగలుగుఁ గాన నందుఁజని మనుష్యులకు సిద్ధిదంబులగు పాదుకలం గొల్వుఁడని యనుటయు మఱియు మహర్షులిట్లనిరి. ౧౭

ఉత్సాహము॥ బాగుబాగ హో మహాత్మ! ప్రాకటోపదేష్టవై
లాగితివి భవాబ్ధినుండి లలిని దరికి మమ్ములన్.
సాఁగుచున్న యట్టిదీర్ఘసత్రముల ముగించి వే
వేగ మేముగూడ నచటు వెళ్ళఁగలము ప్రీతిమై. ౧౮

## — • బ్రహ్మక్షత్రియకన్యల వృత్తాంతము. • —

ఆ॥ హాటకేశ్వరమున నవనీసురావనీనాథపుత్రికలు ఘనంబులైన
తీర్థములను రెండు దిట్టలై నిర్మించిరని వచించియుంటి వనఘ! నీవు. ౧౯

ఉ॥ కారణమేదొ పెద్దగను గానఁగరావలెఁగాదె కన్యలై
ధీరులకే యశక్యమగు తీర్థములన్ రచియింపఁ. గాన న
వ్వారికథన్ సమగ్రముగ వర్ణనఁజేసి తదీయపాదుకా
భూరిమహత్త్వమంతయు సుబోధము సేయుము రోమహర్షణీ!" ౨౦

వ॥ అనవుడు వెండియుసూతుండిట్లనియె. ౨౧

తే॥ "తొల్లి ఛాందోగ్యుఁడను పేర దొడ్డబ్రాహ్మణుండొకండుండె నాగరఖండమందుఁ.
దనదుగోత్రంబునంబుట్టు ధరణిదేవులెల్ల ఛాందోగ్యులను ఖ్యాతి నెనయుచుండ. ౨౨

వ॥ కృత్స్న సామవేదవిదుండై గృహస్థాశ్రమమందుండు నాథూసురున కపర
వయస్సున ౨౩

సీ॥ గుణములన్నింటికిం గుదురైనమణిపేటి యఖిలలక్షణముల కాలవాల
మరవిందసుందరాత్యంత విశాలాక్షి లలితనితంబాంతలంబకేశ
పార్వికశర్వరీట్ప్రతిమాన రుచిరాస్య యమృతనిష్యంది బింబాధరోష్ఠి
విశ్వంభరోపమ విపులకటీభాగ యఖిలాంగసంగత హ్రీస్వలోమ
పంచమాత్మస్త్రిగంభీర బహుళశోభ సప్తరక్తయు నగు కన్య జననమంది
శుక్లపక్షీయ శశిరేఖచొప్పునను జనులకు సానందకరయౌచు లలిఁ జెలంగె. ౨౪

వ॥ అపరవయస్సువచ్చెనని యనపత్యతం గుందుచు మండపాంతంబున బ్రాహ్మ
ణులఁ బూజింప వారు ప్రసాదించినది కావున ఛాందోగ్యుఁ డాబిడ్డకు బ్రాహ్మణి
యను నామకరణంబు గావించె. నాశిశువుదయించిన దినంబుననే యానర్తదేశాధినాథు
నకును నట్టిదే యొకబిడ్డపుట్టె స్వీయ కాయప్రభాపటలంబుచే నాతికాగృహంబునంతయు
రత్నమయంబునంబోలె సుప్రభంబొనర్చుటయు జనకుఁ డాయమను రత్నవతియని పిలు
చుచుండెను. నంత నయ్యిరువురు కన్నియలు నగ్గలంబగు స్నేహంబుఁజేసి యొకకంచ
మున భుజించి యొకపక్కఁ బరుండుచు నొకరిఁజూడకున్న నొకరు బ్రదుకలేనంతటి
ప్రేమ నుండిరి. వారప్డెనిమిదవయేట వివాహంబు సేయుటకుఁ దండ్రి వరాన్వేష
ణంబున యత్నించుచుండ బ్రాహ్మణి తన్మెత్తంచెలిం గని సఖితోడి వియోగం
బునకు భీతిల్లి కన్నీరు గార్చుచుఁ గడుదీనంబైన గద్గదస్వరంబుతో రత్నవతిం
జూచి యిట్లనియె. ౨౫

కం॥ చెలియా! వివాహముకైనఁగి దెలిపెట్టినవాడఁ నాచుతండ్రి యొప్పఁడె. నీ
వన్నను నీకనావనుఁ జొల్లనీయమి నీవియు మెలఁకియుకినే వర్తింప దెలకు" ౨౬

త్వాదికమైన మీకరుణ దద్దయు నాపయి నుండెనేని యు
ర్వీదివిజాళిఁ గూడుకొని వేగమ చెప్పుఁడు తగ్గనిష్కృతిన్" ౫౯

వ॥ అనియిట్లువక్కాణించుటయుఁ దామును జింతించుచుఁ దత్సవయస్కులు విశ్వావసువు పాలి కరిగి యాసమాచారంబు వాక్రుచ్చి. రతండును గర్ణకఠోరంబగు నవ్వార్త విని దుఃఖించి భార్యకుఁజెప్పి తత్సహితంబుగం జిత్తనమువలనఁ బ్రతిపదంబునం బడఁబోవుచుఁ గొడుకకడ కరిగి బాష్పగద్గదవాక్యంబుల హాపుత్రా! యేమిపనిచేసితి విరాయని పెద్దపెట్టుంగున నార్చుటయు నతం డఖిలంబును నివేదించి యాత్మపరిశుద్ధికై ప్రాయశ్చిత్తము చేసికొందుననియె. నంత విశ్వావసువు వేదవిదులగు విప్రులం దదర్థమై రావించె. బదంపడి పరావసు వాబ్రాహ్మణుల యెదుట నిల్వఁబడి దోసిలొగ్గి

తే॥ వర్కమండలమును భ్రాంతి మద్యరసము ధనసతీభాండమందుండఁ ద్రావినాఁడ.
తెలియక కరాత్రిసలిపిన కలుషమిద్ది. తగినవిష్కృతి సెపుఁడు శుద్ధత ఘటింప" ౬౦

వ॥ అని వచించుటయు వారు ధర్మశాస్త్రములఁ దిలకించి ౬౧

సీ॥ ఎవరు నా కనగారు భువిలోనవని మదిం బర్వుచుండిన మహాగర్వమునను
నెదోషిసక్తిని మదయించి క్రమంబుగాఁ గొండంతయైయుండు క్రోధమునను
దోషితోఁ దవకుఁ బ్రాదుర్భూతమైయున్న చిరకాలికంపు సుస్నేహమునను
ఖండితంబుగఁజెప్పఁగా నడ్డగలిగించు ప్రథమసిద్ధ భయస్వభావమునను
హెచ్చుతగ్గుచేసి యెట్లో ప్రాయశ్చిత్తమును వచించువానినెనయఁగలమ.
మట్లుగానఁ దగినయది చెప్పనుము మేము. చేతనైనఁ బోయి చేసికొనుము" ౬౨

వ॥ అనిమఱువ్రేలయుఁ బరావసు విట్లనియె. ౬౩

మ॥ ధువుతుక్తంబు నొనర్చుతండైన మిముం బ్రశ్నింపఁగా నేటికి?
క్షయిక్షించిరి మద్యపాయినగు న ? ట్లూరాటఁ బ్రాణాంతకం
బవుఁగాకయ్యది. మీరు యుక్తమగు ప్రాయశ్చిత్తమే చెప్పుఁడీ
యభూదేవులు! లేకయున్న యెడ మీ కత్యంతపాపంబగున్" ౬౪

వ॥ అనవుడు బ్రాహ్మణులు ౬౫

క॥ [illegible] తప్త్రావ నంతటి సలసలగ్రాగెడి పయిండి స్వాద్యము మఱియున్
దెలియక గ్రాగినఁ దప్త్యాలనాభాచ్యంబు ద్రావఁజను నంతయు తాన్. ౬౬

క॥ [illegible] గజన్మ మాచేఁ బ్రాయశ్చిత్తంబు వినఁబడికీర్తి. మీ
[illegible] సేసం చేసి [illegible] పొందెదు శుద్ధిన్" ౬౭

వ॥ అనవుడు పరలా [illegible] బరావసువిట్లనియె. ౬౮

[illegible] ద్విజులార! [illegible]
[illegible] శరీరసంశుద్ధిఁగోరి యిపుడు" ౬౯

—* పరావసువు ప్రాయశ్చిత్తమునకుఁ దలిదండ్రు లాక్రోశించుట *—

వ॥ అనియిట్లుపలుకుటయు వజ్రపాతోపమంగు ఘోరంబులయుఁ బుత్రునియు
వాక్యంబువిని విశ్వావసువు కన్నీళ్లువిడుచుచు గద్గదస్వరంబున ౭౦

కం॥ ఉన్న ధనమెల్లనిమ్మనియన్నం దనయుండు శుద్ధుఁడగుటకు నిత్తుఁగా.
మన్నింప కిదియె పాచిత మన్నను మీ కొక్కగర్వమైనను నీయఁగా. ౭౧

తే॥ శ్రాద్ధములఁ బిల్వకున్నను సరియె, పంక్తిదూరుఁజేసిన మాబాగె. యూరువిడిచి
పొమ్మనంబోయెదను సహపుత్రకముగఁ, గొడుక! యి కార్యమును మానుకొమ్మటన్న"

వ॥ అని ప్రాయశ్చిత్తమునకు విఘ్నకరంబుగాఁబల్కు జనకువాక్యంబువిని తనయుఁ డిట్లనియె. ౭౩

కం॥ "విడువిడు తండ్రీ! యిఁక నాయెడలంగల స్నేహబంధ. మేఁజేయుపనిన్
బడఁగొట్టకు. పాచిత మియ్యెడఁ గావించుకొన నిశ్చయించినవాఁడన్" ౭౪

వ॥ అనియిట్లువచించుటయుఁ దన్మాత ౭౫

మ॥ "అనఁగుంబుత్ర! పవిత్రతాప్తికయి ప్రాయశ్చిత్తముం జేసెదే
జని నీతండ్రియు నేను దూఁకెదము తజ్జాజ్వల్యమానాగ్నిలోఁ.
గనుగోఁజాలము క్రాఁగుచున్న ఘృతముం గంఠస్థముంజేసి చెం
టను ప్రాణంబులువాయ విన్నఁగొడుకా! నాతోడునా చెప్పితిన్" ౭౬

వ॥ అనినుడువుటయుఁ దండ్రి కొడుకు నుద్దేశించి మఱియు నిట్లనియె. ౭౭

కం॥ "కొడుకా! నీయూహ యీనడి కడుబాగుగనున్న దెన్నఁ గరముహితంబౌ.
దడయక నేనును దీనికి నొడఁబడియున్నాఁడ. వేమియున్నది యింకన్." ౭౮

వ॥ అని యీప్రకారంబునఁ దన్మాతాపితరు లాక్రోశించుచుండుటయుఁ దద్వృత్తాంతంబువిని బ్రాహ్మణులందఱుం జనుదెంచి పుత్రశోకసంతప్తుఁడై పత్నీసహితంబుగా మరణంబునకుఁ గృతనిశ్చయుఁడైయున్న విశ్వావసువును నానావిధవాక్యంబుల నోదార్చి పుత్రునకును బోధించిరి కాని ప్రాయశ్చిత్తమును నివారించుటకు శక్తులు కారైరి. తండ్రి కొడుకు లిరువురును ప్రాణత్యాగమునకు వెనుదీయమిని సర్వజ్ఞుండును సర్వసంహారకుండును నగు భర్తృయజ్ఞుఁ డుండు వాస్తుపదంబున కరిగి పరావసువు సురాపానంబు చేసి ప్రాయశ్చిత్తమును చేయుటయుఁ బరిహాసమునకుఁ దన్మిత్రు లెద్దియో చెప్పుటయును ధర్మశాస్త్రంబులుచూచి బ్రాహ్మణులు తప్తఘృతప్రాశనవిధించుటయు విశ్వావసువు సపత్నీకంబుగా నగ్నిం బ్రవేశింపనుండుటయుఁ దన్మిత్రులు దుఃఖించుచుండుటయు మున్నగు సకలసమాచారంబును నివేదించి వినయవినమితోత్తమాంగుఁడై మఱియు నిట్లనియె.

కం॥ "భూతభవిష్యత్ప్రకృతము శ్రీతాపసవర! యొకింతయును నీమదికిన్
జ్ఞాతములుకాని వుండవు. ఖ్యాతంబిది! మాకుఁదెలియ నంతయు సరిగన్." ౮౦

తే॥ ఈనగరమంతయును నేఁడు మానిచంద్ర! వినుము విశ్వావసుద్వారమునను సంశ
యంబునం బడియున్నది. యందుకొఱకె వచ్చినారము మేము నీవద్ద కిపుడు. ౨౧

క॥ మతియొకప్రాయశ్చిత్తము సుర ద్రావిన యిమ్మహీసురుని శుద్ధికినై
కరుణను వాక్రువ్వవె. యీవెలుఁగని దించుకయునుంచే దెన్నఁగ శ్రుతులన్" ౨౨

—* రత్నవతి స్తనంబులనుండి పాలుగాఱుట *—

అని యిట్లువక్కాణించుచుండఁ భర్తృయజ్ఞుండు పక్కనవ్వి ౨౩

తే॥ "ఈద్విజన్ముఁడు సంశుద్ధినైనయుపాంతె నున్న దొక్కసుఖోపాయ మన్నలార!
యున్నదయ్యును లేనిదే యెన్న నద్ది. యివ్విధంబునఁదోఁచె నాహృదయమునకు" ౨౪

వ॥ అనిపలుకుచుండఁ బ్రాహ్మణు లిట్లనిరి. ౨౫

క॥ "పూర్వాపరవైరుధ్యముపర్వి కనంబడెడిఁ జూడ భవదుక్తమునన్.
సర్వజ్ఞ! యుండె నెటులది? మార్వలుకకమున్నె యెటుల మతి లేకుండెన్" ౨౬

వ॥ అనియిట్లువచించుచుండఁ మరల భర్తృయజ్ఞుండు ౨౭

క॥ "సచ్ఛిద్రంబగుజపమును సచ్ఛిద్రంబగుతపంబు సచ్ఛిద్రమఖం
బచ్ఛిద్రంబగు బ్రాహ్మణు నిచ్ఛామాత్రంబుచేత, నేమందునికన్. ౨౮

శా॥ అచ్ఛిద్రంబని బ్రాహ్మణాస్యమున వందా నాగరాస్యంబునన్
స్వచ్ఛంబౌనుడి నిర్గమింప నది యట్లోఁగాని కాదన్యథా.
సచ్ఛీలంబగుబ్రహ్మశాల మమచున్ తన్మాదేవతావంశజుం
డిచ్ఛన్ ధర్మనిబంధ మారయక యుక్ స్వోలోక్తియుక్ సత్యమా. ౨౯

వృత్తకోకిల॥ ఈపరాశమువుక్ గుణించి తద్వ్వమిత్రులుం బ్రాయపున్
[illegible] లెంతయు నవ్వులాడుకుఁ బట్టిరత్నవతీకుచం
[illegible] శుద్ధుఁడవౌదువంచని. రిద్దియే
[illegible] పరాశరసన్మతం. బదె యోను విప్రునకి శుద్ధికిన్" ౩౦

వ॥ అనివాకుచ్చుచుండఁ బ్రాహ్మణులిట్లనిరి. ౩౧

[illegible] నీక్షయిమెయి రమ్మని పట్టి వధించుమమ్మ. నీ
[illegible] చూపిన [illegible] మయుక్తము. గావఁ [illegible]
[illegible] పాలుమలక్ [illegible]
[illegible] ౩౨

[illegible] భర్తృయజ్ఞుండు ౩౩

[illegible] ధన్యుఁడైయున్న వాఁడు
[illegible] గోరుచుండె నతింగొన్న వాఁడు

వ॥ అనినవిని హారిభద్రుండు సత్వరంబుగాలేచి యాదియం దాద్యులను బదపడి బహ్వృచులను ననంతర మధ్వర్యులను సక్రమంబుగా ఛాందోగ్యులను దత్తదర్థంబు బ్రశ్నించి తదనుజ్ఞవడసి ౧౦౧

ఆ॥ ప్రాణరుద్రములను బఠియింపుఁడాద్యులు! జీవసూక్తములను జెప్పుఁడు బహ్వృ
చులును! దొల్లిమీరు లలిఁ బృథివ్యాదిసవనము చేసియుంటవలన నిపుడు. ౧౦౨

తే॥ "చదువుఁడధ్వర్యులార ! మీ రదియెటింగి వేఱువేఱుగ ఛాందోగ్యులార ! మీరు
చదువుఁడీ తేనెలోలుకంగ సామములను సిద్ధికోఱకయి యందఱుం జేయుడిటుల. "

వ॥ భర్తృయజ్ఞమతానుసారంబుగా నిట్లాద్విజోత్తములకుఁ జెప్పుటయు నవియన్నియు వారు పఠించిరి. తత్పాఠావసానంబున మధ్యగుండు ౧౦౪

సీ॥ ఎటు పరాశరుచే నెఱుఁగక మద్యంబు పానంబు సేయఁగాఁ బడినయదియొ
యేమని యవ్వాని హితసమూహముచేతఁ బ్రథమంబు వాక్రువ్వఁబడినయదియొ
యెటు స్మృతివిదులచే నట ఘృతపానంబు ప్రాచితంబుగఁ జెప్పఁబడినయదియొ
యెటు భర్తృయజ్ఞుచే నెల్లమహీసురు ల్పదపడి తోడితేఁబడినవారొ
యంతయును భూమిపాలున కపుడుఁజెప్ప నద్దివిని యాతఁడత్యంతహర్షమునను
నంజలిఘటించి మెయివంచి యాదరమున నెంతయు నయంబుదోఁపఁ దానిట్టులనియె.

ఉ॥ "ధన్యుఁడనైతి. నాగరులు తన్మహిదేవుల మువ్వురక్ జగ
న్మాన్యుల రక్షసేయ రహి నాకుఁ బ్రసాదముసేసినారు. నా
కన్యయు ధన్యయౌను మృతిగైకొననుండిన బ్రాహ్మణత్రయిక్
హైన్యముసాక తా మనిచి. యంతకుమిక్కిలి యేమికావలెక్." ౧౦౫

వ॥ అనియిట్లుపలికి యతండు తత్క్షణంబ యాకన్యను రావించి బ్రాహ్మణులకు సమర్పించి ౧౦౭

క॥ "మీమాటవలన నిపటికి నాముద్దులబిడ్డఁ బిలిచినాఁడను గనుఁడో
త్తమ్మమరులు ! భర్తృయజ్ఞుం డేమనె నదిచేయుఁగాక యీవిప్రుడికక్ " ౧౦౮

వ॥ అనిచెప్పుటయు భర్తృయజ్ఞుఁ డప్పరాశరువు చేయిపట్టుకొని రత్నవతివిన నిట్లనియె. ౧౦౯

చం॥ " అధరమ్ముగ్రోలువేళ భవదంబఁగఁ జూచెదవేని యీయమక్
మధురమలైనక్షీరములు మాటికి నందుస్రవించు. నీకునె
వ్విధమగుహానిలేక యగు వెంటనె సిద్ధి. విశారమొందెదేల
యధిరము నోటినిండఁబడి రాఁ జెడిదీవు పరాశరుఁ ! వెసక్. ౧౧౦

కం॥ చనుమొనలపైని నీకరమును వైచినతోన క్షీరములు గారెడినో
మనమున శుద్ధినిబొందితినని యనుకొని సంతసింపుమయ్య ద్విజన్మా! ” ౧౧౧

వ॥ అని యిట్లాతనిం గూర్చి పలికి కన్యకం జూచి ౧౧౨

చం॥ ఇతని సుతుఁగఁ జూడవలె నీవు కుమారి! త్వదోష్ఠపానమీ
క్షితిసురు శుద్ధుఁజేయుఁ. బరికింపు. కుచగ్రహణంబుచేఁత పా
చితమగునంచుఁ దత్సఖులు చెప్పిరి నవ్వుల. కట్లుగాన స
మ్మతిపడనౌను దీని. కవమానమువొందినఁ బాయుఁ డీగ్రెడిన్. ” ౧౧౩

వ॥ అని నొడువుటయు నాపె తల్లియని సద్వివేకంబుగం బరావసువుతో నిట్లనియె

ఆ॥ “ రమ్ము వత్స! వచ్చి రయమ ప్రాయశ్చిత్త మాచరించుకొనుమ యాత్మశుద్ధి.
కమ్మగందలంపు మనుమానపడకన. న్నీవు కొడుకవైతి వింక నాకు. ” ౧౧౫

వ॥ అనియిట్లునుడువుటయు నతండును దల్లిగందలంచి తత్సన్నిధిం జేరి యఖిలజను లిస్తు నవలోకింప నాపె పయోధరంబులు పట్టుకొనియెఁ-బట్టుకొనుటయే తడవుగాఁ బాలిండ్లనుండి కుందేందుహిమసన్నిభంబులగు క్షీరధారలు వెలువడియె. నంత నధరాస్వాద నమాచరించుటయు నదేవిధంబుగా నాయమ యాననంబునుండి పయస్సు బయలు వెడలెఁ. బదపడి పార్థివుండును బ్రాహ్మణులును బరావసువు పరిశుద్ధుఁడయ్యెనని పలుమాఱులు కరతాళంబులు వాయించి.రతండును ననేకపర్యాయము లక్కన్యకుఁ బ్రదక్షిణనమస్కారంబులు సేసి “ మాతా ! నీవు పుత్రవత్సలవు. నన్ను క్షమింపు ” మని ప్రార్థించె. నది యవలోకించి యానతుఁ డాశ్చర్యపడుచుఁ, బ్రాయశ్చిత్తప్రియుఁడగు ధర్మయజ్ఞుఁ బ్రశంసించి ౧౧౬

కం॥ “ ఇట్టిచమత్కారపురిం బుట్టిన బ్రాహ్మణులు గేహమున్న కరుదేరన్.
బిట్టు భజింపం గలిగినయట్టిడ నాభాగ్యమెంత దరరేయరయన్. ౧౧౭

కం॥ ధన్యయగుగాని యీమత్కన్యయు సామాన్యురాలుగాదు తలంపన్.
మున్యధివాధులవలెఁ గడుమాన్య. మహాభాగ. నిరుపమాన సతులలో. ౧౧౮

ఆ॥ ఈపరావసువును నెన్న నసామాన్యుఁడట్లగాకయున్న నలవియగునె
యిట్టియువతియొద్ద కేగి వికారమం బొరయకుండుటకును నరులకైన. ” ౧౧౯

వ॥ అని పార్థివోత్తముం డావిప్రుల సాఁగనంపి కన్నియం దోడ్కొని యంతఃపురంబునకుఁ జనియె. నంత నాగరులందఱును ౧౨౦

చం॥ “ సురయును మాంసమున్ మెసవి చొక్కుచు సోలుచు వేశ్యలిప్పుడున్
నిరతము నాగరాత్మజుల నిందితులం బొనరించు టెంతయున్
దురితము గాన నేఁటినుండి దూష్యములౌనవి యెంచఁగూడ దీ
తరుణులు మందిరంబులను దప్పిన శిక్ష విధింపఁగాఁబడున్. ౧౨౧

కం॥ ఏపడపుఁజెలియ యీపురిఁ గాఁపురముం జేయఁజూచుఁ గాదనకదితా
నీపగిది నుండవలయును లేపఁగఁబడుఁ బురమునుండి లేకుండినచో ॥ ౧౨౨

వ॥ అని వ్యవస్థచేయుటయు నౌదుంబరియు మధ్యగుండును ద్రివారంబులు కరతాళంబులు వైచిరి. యీసందర్భమున రత్నవతిం బెండ్లియాడ నటకు వచ్చియున్న దశార్ణదేశాధిపతి పూర్వోక్తవృత్తాంతంబువిని విరక్తుఁడై స్వపురంబునకుఁ బయనమయ్యె. నతఁడు వెడలిపోవుటవిని యానర్తుఁ డతని వెంటఁబడి ౧౨౩

## —* రత్నవతి వివాహమును మానుకొనుట *—

ఆ॥ "నాదుముద్దుబిడ్డ నర్మిలిఁబెండ్లాడఁ బిలువఁబడితివిటకుఁ బృథివిపాల!
వచ్చియున్నకార్య మిచ్చ నొనర్పకే యేలయేగెదయ్య యివ్విధమున!" ౧౨౪

వ॥ అనివాక్రుచ్చుటయు దశార్ణుం డిట్లనియె ౧౨౫

ఉ॥ "నిందితురాలు నీదుసుత. నిక్కము. కన్నెతికంబు గోలుపో
యెం. దనవాతెఱంగఱచి యేఁడో పయోధరమర్దనంబుసే
యం దగునంచు నిష్టపడువాపె కెటుండును గన్యకాత్వ. మిం
కందురుపో పునర్భవని యందఱు నీదుతనూజ భూపతీ! ౧౨౬

కం॥ ఎవఁడు పునర్భువుకడుపున భవమొందునొ వాని తొంటిపదికరములవా
రవతలిపదికరములవా రవిచారితముగను బడుదు రతిదుర్గతులన్. ౧౨౭

కం॥ ఇరువదియొకటువపురుషుని వఱకు నధఃపాతముందు. వాఁ డాకల్పం
బురునరక మొందుఁ. గావున వరియింప భవత్తనూజ వసుధాధీశా!" ౧౨౮

వ॥ అనియిట్లు నిర్దాక్షిణ్యంబుగా వాక్రుచ్చి హస్త్యశ్వరథపూర్వకబహూపాయనదానంబున హృదయ మాకర్షించుచున్నను నానర్తు నవమానించి యాత్మీయనగరంబునకు వెడలిపోయె. నంత నానర్తుఁ డింటికేగి వ్యాకులపడుచు బృహద్బలుఁడన్నమాట లర్ధాంగికి నమాత్యులకును వినుచేటయు వారలు ౧౨౯

సీ॥ "చక్కనిరాకుమారకులు స్యందనఘోటకహస్తియుక్తులై
లెక్కకు మించియుండిరిల. లేవడి యేమియులేదు. వారిలో
నొక్కనిఁ బిల్వఁబంచి భవదుత్తమకన్యనొసంగు. మీతఁడే
దిక్కటె లోకమంతటికి? తీఱనిదుఃఖముగూర్చె దేలయో" ౧౩౦

వ॥ అనినవిని యతండు కన్నియదిక్కు మొగంబై ౧౩౧

తే॥ "పుత్రి! చిత్తరువులలోని భూమిపతుల నెల్లరం జూచియుంటివి యీవుమున్న.
వారిలోపలఁ ద్వన్మనస్సారసమును వికసితముఁజేయు మఱియొక్క విభువరింపు"

వ॥ అనవుడు రత్నవతి యిట్లనియె. ౧౩౩

కం॥ "వరియింప దశార్ణాధీశ్వరువిడిచి మఱొక్కభూమివరు నెన్నటికిన్.
ధరణీశ! యేలయనుచో నెఱిఁగించెదవినుము దానిహేతువు నీకున్. ౧౩౪

కం॥ ఒకపరికాసింతురునృపు. లొకపరివచియింతు రెదిరియొ యార్యేసురు. ల
ట్లొకపరియీఁబడుఁగన్యక. యొకపరియేయగుచునుండు నొగి నీమాఁడున్. ౧౩౫

ఆ॥ ఇదియొతెంగినన్ను నింకనొకన్యమన్నిని కీడుకుండవలయు నీపుతండ్రి !
యీవొసర్చెదేని యిది యే తిరంబగుఁ, గాదుధర్మమిద్ది కనుమెడంద" ౧౩౬
వ॥ అనియిట్లువక్కాణించుటయు నాసత్తుండు ౧౩౭

శా॥ "నాచేనీవు దశార్ణభూమిపతికి న్దత్తాకలపుందొందరన్
వాచాదత్తవయైతి కాని శుచివిప్రప్రాజ్ఞమధ్యంబునన్
నీచైయాతఁడు తాఁగ్రహింపఁ, డెటులన్ నీనాథుఁ డాతండిఁకా
నో చెప్పంగదవమ్మ ధర్మమును బిట్టూహించి డెందంబునన్" ౧౩౮
వ॥ నావుడు వెండియు రత్నవతి ౧౩౯

చం॥ "మనమునఁ జింతసేయఁబడు మంచిగఁ గార్యము లాదిలోన, న
ల్లన నవి వాక్కుచేత నవలన్ బహిరుక్తములౌచునుండు, వా
నినె తరువాతఁ జేయుదురు. నేను మదాత్మను మున్నె యన్నరేం
ద్రునకు మనస్సుచేనిడితిఁ, దోడనె వాక్కున నిచ్చితీవునన్. ౧౪౦

ఉ॥ కావున నెట్లునాకుఁ బతిగాఁడొ యతం డిఁకఁ జెప్పుమీవ, యా
భూవిభుఁదప్ప నింకనొకపూరుషు మానసమందు నేనియున్
నావిభుఁగాఁదలంప, నిది నాదగునిశ్చయ, మవ్విభుండు నన్
దావరియింపకున్నఁ జని తాపసినయ్యెద నేను నిమ్మహిన్" ౧౪౧
వ॥ అనినవిని తన్మాతయగు మృగావతి కనులనిండ నీళ్ళుదెచ్చుకొని ౧౪౨

చం॥ "తనయ! తపంబు సేతుని తద్దయు సాహసమాచరింప. కీ
వనయము సౌఖ్యమొందు మృదులాంగముగల్గినయట్టిబాల వే
యనువునఁ గందమూలఫలహారమొనర్చుచు నారచీరలన్
దనువునఁదాల్చి ఘోరమగు తత్తపముంబొనరింతు కానలన్. ౧౪౩

ఉ॥ కావున ముఖ్యుఁడైన యొకత్మాపతికిచ్చెద నిన్. కుమారికా
భావమునాశ్రయించి యల బ్రాహ్మణి నీపరమాప్తురాలు నీ
వేవిభుఁ బెండ్లిచేసికొని యేగెదొ వాని పురోహితాత్మజున్
దా వరియింపనున్నయది తప్పక రత్నవతీ ! సుఖంపడన్ " ౧౪౪
వ॥ అని వాక్రుచ్చుటయు మఱియు రత్నవతియిట్లనియె. ౧౪౫

ఉ॥ "కూఁతురిమీఁద నీకుఁ గడుఁ గూరిమియుండిన నిట్టిమాటలన్
మాతరొ ! చెప్ప కెప్పటికి. మత్తపముం జెడఁగొట్టెదేని త
ర్వాత విషాన్నమూఁదినియొ వహ్నినిఁజొచ్చియొ జిహ్వఁ జీల్చియో
యీతనువుం ద్యజించెదను. నేల బలాత్కృతినేనె దివ్విధిన్ " ౧౪౬
వ॥ అనియిట్లు దృఢంబుగాఁబలికి పరమాప్తురాలగు బ్రాహ్మణిం గౌఁగలించు
కొని యంజలిఁబట్టి ౧౪౭

కం॥ "చనుమీ జనకునియింటికిఁ బనుపుచునున్నాను నేను బ్రాణసఖీ! తా
ఘనుఁడైన నాగరున కిచ్చునని నన్ను. వివాహమాడి సుఖపడు మింకన్. ౧౪౯

తే॥ ఎన్నఁడైనను నీతోడ నేను బరుసమాడియుండిన క్షమియింపుమమ్మ దాని.
నీవునుడివినపరుసం బెదేని యున్న నేను క్షమియించుచున్నాను నిశ్చయముగ"

వ॥ అనవుడు బ్రాహ్మణియిట్లనియె. ౧౫౦

తే॥ "ఎనిమిదేండ్లది గౌరినా నెన్నఁబడెడి. నగును రోహిణి తొమ్మిదియబ్దములది.
దశశరత్ప్రాప్తియ కన్య. యంతకునుమించినది రజస్వలఁ యిటు లార్యు లాడుచుందురు.

మ॥ కామార్యంబుగతించె నీదు చిరసాంగత్యంబున న్నాకు. స
ద్బ్రహ్మాధర్మయుతంబు షోడశశరత్ప్రాప్తియంబు వచ్చెన్. స్మృతి
ప్రామాణ్యంబు నెఱింగియున్నయెడ మత్పాణిగ్రహం బుర్వి నే
ధీమంతుండును జేయనొల్లఁడటుపై దిక్కేమి రత్నావతీ! ౧౫౨

వృత్త॥ రజస్వలవివాహమై రమణ దానిగర్భంబునన్
బ్రజంగన స్వపూర్వులౌ పదుగు రొందుదు ర్దుర్గతిన్.
రజస్వలకుఁ బెండిలిన్ రహినొనర్చు నాతండ్రియున్
నిజాన్వయజవింశతిన్ నిరయమందునం ద్రోసెడిన్. ౧౫౩

కం॥ కావున నేనును నీతోఁ గావించెద నుగ్రతపముఁ గల్యాణిరో! యిం
కేవిధమగుపనియును లే దావృద్ధులతోడ నమ్మయయ్యలతోడన్" ౧౫౪

వ॥ అని నిశ్చయించి యాకన్యలిరువురును ౧౫౫

సీ॥ ముంగిస ల్పాములు మోము మోమునఁజేర్చి ముద్దాడు నెద్దానిముంగిళులను
పిల్లులుకలు పిల్లలుం జెలిమిమై నెచ్చోట నాటలాడుచునుండు నవ్వాహంబుఁ
బులులును జింకలుం బూర్వవైరమువీడి క్రీడించు నెచ్చటం గూడిమిగులఁ
గాకము ల్ఘూకము ల్గలసి యన్యోన్యంబు విహరించు నెచ్చోటి వృక్షవాటి
భర్తృయజ్ఞు తపఃప్రభావమున నిట్లు సత్వములకుఁ బరస్పరస్పర్ధ లేని
యట్టి వాస్తుపదంబున కఖిలతీర్థసహితమున కేగి యట సుఖాసనముపైని. ౧౫౬

వ॥ కూరుచుండియున్న భర్తృయజ్ఞు సమీపించి కృతాంజలిపుటులై యందు
బ్రాహ్మణి సవినయంబుగా నిట్లనియె. ౧౫౭

ఆ॥ "ఏను సఖియరైన యీరాజకన్యతోఁ దపముఁ జేయఁబూనెదఁ ద్వత్పదబ్జ
సవిధమునకు భక్తిఁ జనుదెంచియుంటిమి. తద్విధిన్ వచింపు తాపసేంద్ర!" ౧౫౮

వ॥ అని యిట్లడుగుటయు భర్తృయజ్ఞుండు. ౧౫౯

కం॥ చాన! తపశ్చర్యావిధి నేను వచించెదను వినుము. నిశ్శ్రేయస మ
బ్జాక్షి నొసఁగూడు. స్వర్గమయ్యెనం జెప్పనదియేమి. హస్తగతంబే. ౧౬౦

## బ్రాహ్మణీరత్నవతులు తపస్సు చేయుట.

సీ॥ చాంద్రాయణంబులు చరియించుటయుఁ దప్తకృచ్ఛ్రంబులొనరించి కృశులగుటయుఁ
సాంతపనంబులు సరిగ సల్పుటయును వర్షకాలంబున సాపడుటయు
నొకపూఁట నే తిని యూరకుండుటయును రెన్నాళ్లకొక్కసారి తినుచుటయు
మూన్నాళ్లకొకమాఱు భుజియించుటయు నయాచితమైనదాని బోచేయుటయును
దపమునకు ద్వారములుగాఁగ ధాతచేతఁ జేయఁబడినవి-వీనిలోఁ జేతమైన
వాని రాగంబు ద్వేషంబు వదలిచలుపఁ గాంక్షితంబులు సిద్ధింపఁగలవు బిడ్డ! ౧౬౧

తే॥ శత్రులందును నత్యంతమిత్రులందు రాలయందును రతనపుకెంజాలమందు
నెపుడు సమమైనభావన యేరుపడునో యపుడ యయ్యెడు మోక్షంబు హస్తగతము

తే॥ ఎవఁడు లింగంబు గ్రహియించి యవల మరలఁ బాపరతుఁడగు వాని సర్వంబు భస్మ
మందు హుతమగునదివోలె వ్యర్థమగును-దపమువిధ మేమిచెప్పుదుఁ దనయ! వీతి"

వ॥ అనవుడు బ్రాహ్మణి వల్లెయని రత్నవతీసహితంబుగా స్వచ్ఛోదకపూరితం
బును బద్మినీషండమండితంబును నగు నొక్క జలాశయంబు సమీపించి ౧౬౪

సీ॥ చాంద్రాయణంబును జరియించె మునుమున్ను-తరువాతఁ గృచ్ఛ్రసాంతపనములును
దదుపరి వత్సరత్రయము బద్ధశ్రద్ధ నాఱవకాలమం దారగించె-
మూఁడేండ్లు పదఁపడి మూన్నాళ్ళకొకపరి యుపవాసముల నెంతయును గృశించె-
నొకనాఁడుగాక యింకొకనాఁడు పిమ్మట నొగిని నిరాహారయగుచునుండెఁ
గడఁగి హేమంతమున వారినడుమనిలిచె-నుండెఁ బంచాగ్నిమధ్యమం దెండవేళ-
బట్టబయలున వసియించె వర్షములను బ్రాహ్మణి తపంబుఁ జేసెడిపట్లు నిట్లు, ౧౬౫

వ॥ దేవదేవుఁడగు చంద్రశేఖరు ధ్యానించుచు రేయుంబవళ్ళు నాపె యట్లుంట
తిలకించి రాజకుమారి పరమసంతోషంబున ౧౬౬

సీ॥ నూటయేఁబదియేండ్లు సూటిగాఁ దపముండె ఫలభక్షణంబును సలుపుకొనుచుఁ-
బండుటాకులఁదించుఁ బదఁపడి యన్నియేం డ్లాత్మలో ధ్యానించె నంధకారి-
నటుతరువాతఁ దా నాఱునూఱులయేడు లుదకపానముతోడ నుండె నిష్ఠ-
నావల వెయియేడు లత్యంతనియతిమైఁ బవమానభక్షణ పరతమనియె.
నెట్టులెట్టులఁ దపముండె నట్టులట్టు లాపెకుం దేజ మభివృద్ధియగుడు నప్రుడు
చంద్రశేఖరుఁ డంబికాసహితుఁడగుచు దరిసెనంబిచ్చి బ్రాహ్మణిఁ గుఱిచి ప్రేమ

క॥ "తనయా! యస్మద్వాక్యము విని చాలింపు మికఁ దపము- వేగ వభీష్టం
బును వచియింపు మొసంగెద- ననుమానమువలదు జేతదర్థ మెపందక" ౧౬౭

వ॥ అని ప్రసాదించుటయు బ్రాహ్మణి యిట్లనియె. ౧౬౯

తే॥ "ఏమి కావలెనింకను నీశ! నాకు- దర్శనంబునొసంగితి దయనువచ్చి-
స్వప్నమునఁగూడఁ దావకదర్శనంబు దొరకు టెంతయు దుర్లభ మరయ ధరణి"

వ॥ అని యిట్లు పలుకుటయు మరల భగవానుండు ౧౭౧

కం॥ "కాదస్మదీయదర్శన మేతినము వృథాగఁ దాపసీ! కావున నీ
వేదేని వరముగోరుము- కాదనకది యిచ్చిపోవఁగాఁగలవాఁడన్" ౧౭౨

వ॥ అని వక్కాణించుటయు బ్రాహ్మణి మఱియు నిట్లనియె- ౧౭౩

శా॥ "రత్నవతీసమాఖ్యఁ గను రాణవహించిన యీనృపాత్మజా
రత్నము నాకుఁ బ్రాణసఖి- రాజశిరస్క! చతుర్థయయ్యెఁదాఁ
బ్రత్నముగం బొనర్చెడిఁ దపంబును నేనుబొనర్చినట్టు- లీ
యత్నము పూర్వ మచ్చటనె యాచరితవ్యము నీకుఁ బూర్తిగన్- ౧౭౪

శా॥ చాలింపం దప మీవె తత్క్షణమ నేఁ జాలించెదన్- సంశయం
బేలే విందుల- కీశచెల్మి విడలే కేఁ బెండ్లియున్ మాని యీ
లీలన్ మేలితపంబు సేయుటకు శూలీ! పూనుకొన్నాను- నా
పాలన్ నీవు కృపాళువైన నిదు మీ పద్మాక్షి యిష్టార్థముల్" ౧౭౫

వ॥ అనినవిని భగవంతుఁడగు శశిశేఖరుండు రాజపుత్రినుద్దేశించి మేఘగంభీర భాషణంబుల నిట్లనియె. ౧౭౬

తే॥ పుత్రి! నామాటవిని తపంబును ద్యజించి చిత్తముననుండుకోరిక చెప్పుకొనుమ-
యీయరానట్టిదైనను నిపుడు దాని నీయనున్నాఁడ నీకు నేఁ దోయజాక్షి! ౧౭౭

వ॥ అనియిట్లనుడువుటయు రత్నవతి ౧౭౮

ఉ॥ "తామరతీవెమొత్తములఁ దద్దయు రాజిలు నేది యద్ది శ్రీ
రామహితంబు బిట్టు తపముండెను బ్రాహ్మణి యత్తటంబునం
దామహనీయమైన హ్రాద మాయమ పేరటఁ దీర్థరాజమై
యీమహి ఖ్యాతిఁ జెందవలె నెంతయు హైమవతీమనోధవా! ౧౭౯

కం॥ ఎవఁ డీతీర్థంబునఁదా నవగాహనమాచరించు నవ్వాఁడు సదా
దివమున వసింపవలయును భవదీయంబగు వరప్రభావమువలనన్- ౧౮౦

కం॥ నేనుదపమున్న యది శూద్రానామముతోడఁగూడి తత్సమమహిమన్
దానొకతీర్థోత్తమమై యేనస్సు హరింపవలయు నీశ్వర! సరవిన్- ౧౮౧

కం॥ ఈమహితతీర్థములకడఁ గౌమార్యంబునఁ దపంబు గావింపవలెన్-
స్వామీ! యిట నారాధ్యుడవై మనవలె నీవ తపములందఁటిచేతన్" ౧౮౨

వ॥ అని కోరుసమయమ్మునకుఁ బుడమిం బగుల్చుకొని సూర్యసన్నిభంబగు శివలింగంబు బయలువెడలె-నంత భక్తవత్సలుండగు మహేశ్వరుండు తత్కన్యకల తపంబునకు మెచ్చి ౧౮౩

ఆ॥ "శూద్రియనఁగనీది సుందరీ! బ్రాహ్మణియనఁగ నీదు చెలిది యనఘయయిన
తీర్థయుగళ మగుచుఁ ద్రిజగంబులందును బేరుగాంచఁగలవు-పెక్కులేల- ౧౮౪

తే॥ చైత్రశుక్లచతుర్దశీచంద్రవాసరమున నిటనాడి నాదులింగమున కధిక
భక్తి నభిషేక మొనరించి పంకజముల నర్చనముసేయ దీర్ఘాయువగు నరుండు" ౧౮౫

వ॥ అనిపలికి యంతర్ధానంబుఁజెందుటయు బ్రాహ్మణిరత్నవతు లిరువురును దత్తీర్థసవిధంబునఁ దపస్సుఁజేయుచు జరామరణవర్జితలై కల్పశతంబుండి యిప్పటికిని నక్షత్రరూపలై తారాపథంబునఁ గనఁబడుచున్న వారదిమొదలుకొని యాతీర్థములు రెండును బ్రసిద్ధికివచ్చె-దవ్వుదవ్వులనుండి ప్రజలువచ్చి వానిలో స్నానమొనర్చి యాలింగంబును బూజించి పంచమహాపాతకములుచేసినవారైనను దీర్థప్రభావంబున స్వర్గంబున కరుగఁ జొచ్చి-రిరితలోపల భూలోకంబున యజ్ఞదానదేవతాపూజనాదిరూపమైన ధర్మకర్మంబులు నష్టంబులయ్యెఁ-ద్రిదివమంతయు విమానస్థులును నప్సరోగణసేవితులును నగు దేవతలతో స్వర్గఁజేసెడి మానవులచే వ్యాప్తమయ్యె-నట్టితఱిం బరేతరాట్టు బ్రహ్మలోకంబునకుఁబోయి రెండుపత్రంబులు బ్రహ్మముందఱం బెట్టిచింతను వెలిపుచ్చుచు ౧౮౬

ఆ॥ "ఒకటుఁ బాపములు మఱొక్కటుఁ బుణ్యము లలవు వీనిలోనఁ గమలజన్మ!
యొకటి చిత్రుచే మఱొకటి విచిత్రుచే వ్రాయఁబడినవివి మదీయసభను- ౧౮౭

తే॥ శూద్రి బ్రాహ్మణి యనుపేళ్ళ శుద్ధతీర్థములు గలవు హాటకేశ్వరమునను రెండు-
పుణ్యతమమైన శివలిగంమును జెలంగు నమ్మహాక్షేత్రమధ్యమం దవ్విధమున- ౧౮౮

కం॥ ఆమూఁడింటిమహాత్మను హేమ స్తేయాది దారుణానోరతులున్
వైమానికులుంబలె స్వర్గాములుగాఁజొచ్చి-రేటిధర్మము లింకన్- ౧౮౯

తే॥ రౌరవముదొట్టి యత్యంతరౌద్రములగు నారకములెల్ల నుండెడివారులేక
పాడువడియున్నయవి ప్రజాపతి! యింకేమిచెప్పుకొందును నీతోడ సిగ్గువిడిచి-

సీ॥ ఆత్మలోపల నేని యధ్వరంబులమాట తలపెట్టఁ డొకఁడు- నీ విలయమేమొ-
పిడికెడుగింజలేక బీదసాదలకుఁదాఁ బెట్టఁ డొక్కఁడు- నేమిపట్టుదలయొ-
దంభంబునకు నేని దైవతంబులఁగూర్చి నతిసేయఁ డొక్కండు నాస్తికతను-
శ్రాద్ధంబు నాఁడేని స్వపితృతర్పణమును విడువఁ డొకండు దుందుడుకుమిగులఁ-
గాన వదలుకొంటి నే నీదునుద్యోగ- మిమ్మ కర్తుఁడైన యింకనొకని-
కేమిటికిలిఖించు టీకమ్మలని దింక జమ్మకిందివాఁడిఁతచాయఁ దోఁప- ౧౯౦

వ॥ అనినవిని పంకజాసనుండు పాకశాసనుంబిలిచి ౧౯౩

తే॥ "శక్ర! నామాటవినినీవు తత్స్థలమునకేగి యిప్పుడ శ్రీహాటకేశ్వరమున
కూదిరి బ్రాహ్మణి యనుపేళ్ళ శుద్ధతీర్థములను శివలింగమును పాంసువులను నింపు"

వ॥ అనినవిని శక్రుండు సత్వరంబుగా తత్స్థలంబునకుఁజని యా తీర్థములను దల్లింగమును బరాగములచేఁ గప్పివైచె- నీకలికాలంబునసహితము సకలపాతకనివృత్తికై యాతీర్థంబులలోని మృత్తికతీసి నీరమాడి తిలకంబు ధరించునది- చతుర్దశీ సోమవాసరంబునఁ తత్తీర్థద్వయసవిధంబున శ్రద్ధాయుతంబుగా శ్రాద్ధంబు పెట్టినవానికి గయాశ్రాద్ధంబుతోఁ బనిలేదని స్వాయంభువమనువు వక్కాణించె- మీరలడిగిన బ్రాహ్మణీశూద్రీతీర్థవృత్తాంతముం జెప్పినవాఁడ- నియ్యది చదివినను విన్నను నిస్సంశయంబుగా నానాఁటి పాతకంబు నశియించు- నిట్లు తల్లింగపూజనంబున సిద్ధుండును జిరాయువును గావి నరుఁ డీలోకంబునఁ గానంబడఁ"డని వచించుటయు ఋషులిట్లనిరి. ౧౯౪

## —* నాగరాష్టకుల శ్రైష్ఠ్యవర్ణనము. *—

తే॥ "మూఁడునరకోట్లతీర్థము లున్నను సకృత్స్నమునను శ్రవణించియుంటిమి మునులవలన
నఖిలతీర్థంబులందాడ నబ్బుఫల మెటుల లభించును నల్పాయువులకుఁ గలిని" ౧౯౫

వ॥ అనియిట్లుప్రశ్నించుటయు సూతుండిట్లనియె- ౧౯౬

సీ॥ "ముఖ్యంబు లందుశో మూఁడు తీర్థంబులు- రాణనొప్పును మూఁ డరణ్యములును-
ముక్తిప్రదాయకమ్ములు మూఁడు క్షేత్రముల్ -మనుమున్న వాచ్యము లూ్మఁడుపురులు-
మూర్ధంబులనఁబడు మూఁడుపర్వతములు-కడుశస్తములు మూఁడుగ్రామములును-
మురిపెంబునొందఁగూర్చు మూఁడుతరంగిణుల్ - మునివాసయోగ్యము లూ్మఁడువనము-
లఖిలపాపహరమ్మై మర్త్యలోకమందున్నయట్టి వానియన్నిటను నె
కండు స్నాతుఁడగునొ వాఁడు తా సర్వతీర్థావగాహఫలము నందఁగలఁడు- ౧౯౭

వ॥ ఈయిరువదినాలుగింటను నొక్కొక్కమూఁడింట నీరమాడిన సర్వతీర్థస్నానఫలంబు గలుగు"నని యిట్లువక్కాణించుటయు శౌనకాదులు ౧౯౮

సీ॥ "ముఖ్యంబులైన యామూఁడుతీర్థములెవ్వి? రాణనొప్పెడి మూఁడరణ్యములెవి?
ముక్తిదాయకములౌ మూఁడు క్షేత్రములెవ్వి? పూర్వవాచ్యములైన పురములెవ్వి?
మూర్ధంబులనఁబడు మూడుశైలములెవ్వి? కడు శస్తమౌ మూడుగ్రామములెవి?
మురిపెంబునొందఁగూర్చు మూఁడుప్రోదిను లెవ్వి? మునివాసయోగ్యమౌ వనము లెవ్వి?
యఖిలపాపహరమ్మై మర్త్యలోకమం దున్నయట్టి వాని నొక్కటొక్కటి
యానతీయ"మనుడు నారోమహర్షణి యెలమిమీఱ వారి కిట్టులనియె. ౧౯౯

వ॥ కురుక్షేత్రంబును హాటకేశ్వరంబును బ్రాభాసికంబును బుణ్యక్షేత్రంబులు సర్వపాతకనాశకంబులు. నీక్షేత్రత్రయంబున స్నానమొనరింప నభీష్టసిద్ధియగుటయ కాక చతుర్వింశతిస్నానఫలంబు ప్రాప్తించెడిఁ. బుష్కరంబును నైమిశంబును ధర్మారణ్యంబును నరణ్యంబు. లీ మూఁడింటను స్నాతుఁడగువాఁడు చతుర్వింశతిస్నానఫలభాక్కయ్యెడు. వారాణసియు ద్వారకయు నవంతియుఁ బురంబు. లీమూఁడింటనాడు వాఁడును జతుర్వింశతిస్నానఫలభాక్క. బృందయు ఖాండవంబును ద్వైతంబును వనంబు. లీమూఁడింటఁ గ్రుంకువాఁడును జతుర్వింశతిస్నాతయ. కల్పగ్రామంబును శాలిగ్రామంబును నందిగ్రామంబును గ్రామంబులు. వీనిమూఁడింట స్నానమొనర్చినఁ జతుర్వింశతిస్నానఫలంబుగలుగు. నగ్నితీర్థంబును శుక్లతీర్థంబును పితృతీర్థంబును దీర్థంబులు. వీనిమూఁడింటఁ దీర్థమాడఁ జతుర్వింశతిస్నానుండగు. శ్రీశైలంబును నర్బుదంబును రైవతంబును బర్వతంబులు. వీనిమూఁడింట నీరమాడినఁ జతుర్వింశతిస్నానఫలంబు చేకురెడిని. గంగయు నర్మదయు సరస్వతియు నదులు. వీనిమూఁడింటనాడు వాఁడును జతుర్వింశతిస్నానఫలభాక్కయ్యెడు. నీయిరువదినాలిగింట స్నానమొనర్చిన సార్ధకోటితీర్థస్నానఫలంబు సమకూరు. నొకదాన మునుంగ మూఁడింటమునింగినంత యగు. మీచే నడుగఁబడిన దంతయు వ్రాక్కుచ్చితి. మఱియు నేమివినవలతురనుటయు శౌనకాదులిట్లనిరి. ౨౦౦

తే॥ "హాటకేశ్వరమున నసంఖ్యాకములయి యలరుతీర్థంబు లాఢ్యదేవాలయములు
వినిచినాఁడవు నీవు సవిస్తరముగ మాకు సూతాత్మజా! మంచిమాట కాని ౨౦౧

తే॥ వర్షశతమునకేని విధివంతముగను వానియన్నింట మునుఁగ వశముగాదు.
అవ్విధంబున దేవతాయతనములను నరుల కవలోకనము సేయఁ దరముకాదు. ౨౦౨

తే॥ అల్పమాయువు కృతయుగమందుఁగూడ మనుజులకుఁ ద్రేత ద్వాపరముననటులె.
కలియుగంబునఁ జెప్పంగవలసిలేదు వారియాయువ్యమాంగూర్చి వసుధలోన. ౨౦౩

తే॥ ఇట్టు లల్పాయువులుగాఁగ నెఱిఁగి నరుల నధములకుఁగూడ సర్వతీర్థావగాహ
బహుళదైవతదర్శనఫలముగలుగ నొకయుపాయంబువచియింపు ముత్తమంబు" ౨౦౪

వ॥ అనవుడు సూతుండు ౨౦౫

కం॥ "ఈవిషయంబును బూర్వంబు విశ్వామిత్రుమాని యాశ్రమమునకుఁ
దావచ్చి యడిగె నానర్తావన్యధినాథుఁ డిటుల నార్యులు! వినుఁడీ. ౨౦౬

ఆ॥ "అనఘ! లెక్కలేని ఘనతీర్థములు వాన సలుపఁదగినయట్టి స్నానవిధులు
నేదినమున మఱియు నేవారమున నెట నాడవలసినదియు నదియుఁగాక ౨౦౭

ఆ॥ సర్వతీర్థఫలము సమకూరు- శక్రతీర్థాభిధానమునను ఖ్యాతమగుచు
బాలమండనంబు పరఁగుఁ జతుర్థమై హాటకేశ్వరమున నవనినాథ! ౨౨౩
ఆ॥ దాన నాశ్వయుజములోని పితాష్టమీదినము మొదలు పంచదివసములను
స్నానమాచరించి శక్రేశ్వరుంగొల్వ సర్వతీర్థఫలము సంభవించు" ౨౨౪
వ॥ అనినుడువుటయు మఱియు రాజిట్లనియె- ౨౨౫
కం॥ నాపయి నత్యంతము శ్రద్ధోపేతుఁడ వైతివేని యుర్వీశ! గయా
కూపస్నానవిధానం బోపికతోఁ జెప్పుమయ్య యుండినరీతిన్" ౨౨౬
వ॥ అనియె ట్లడుగుటయు వెండియు విశ్వామిత్రుండు ౨౨౭
కం॥ "రవి కన్యారాశిగతుం డవునెడ నమవసను భర్తృయజ్ఞోక్తవిధిన్
నవిలియాట హాటకేశ్వరభవులుం బరిశుద్ధులు నగు పాపలతోడన్ ౨౨౮
కం॥ శ్రద్ధాపూతమనస్కత శ్రాద్ధంబుం బెట్టునతఁడు స్వపితరులను సం
శుద్ధులఁ జేయం గలుగును బుద్ధిమదగ్రేసరా! విభూ! నిక్కముగన్- ౨౨౯
ఆ॥ భర్తృయజ్ఞవిధిని పాటింపకుండఁ దత్స్థానజాతులైన ధరణిసురుల
వదలి పెట్టికాని వారిలోనైనను ఖలులఁగాని శ్రాద్ధకర్మమునను. ౨౩౦
ఆ॥ పిలువఁగూడ- దట్లుపిలిచి పెట్టంబడు శ్రాద్ధ మన్నిటను సమృద్ధమయ్యుఁ
జవిటినేలవిత్తు సస్యంబునుంబోలె వ్యర్థమగును భూప! వాస్తవముగ- ౨౩౧
ఆ॥ అంధునెదుటుజరుపు నభినయంబులువోలె బధిరునెదుటఁ జేయఁబడిన గాన
రవముభంగి స్థానభవులైన విప్రుల వదలి చేయుపనులు వ్యర్థమధిప! ౨౭౨
తే॥ అజ్ఞులైనను స్థానికు లర్హులగుదు- రాగమజ్ఞులు నేనియుఁ ద్యాజ్యులన్య-
లవనినాయక! పితృదేవతార్చనములఁ దమి విశేషించి సోమపానమున- వింటె-
కం॥ స్థానికుఁడుదొరకకుండినచో ననలమొ దర్భలో త్రిశుద్ధిగ నొక న
స్థానమునఁజేర్చి శ్రద్ధను వాని పురస్థ్సలమునందు వసియించి యొగిన్ ౨౩౪
ఆ॥ శ్రాద్ధమాచరించి చాలకాలమునకేని స్థానికుఁడు లభింప వానిఁ బిలిచి
తగ భుజింపఁజేసి దక్షిణయీయనా- స్థానికేతరునకుఁ దగదుతగదు- ౨౩౫
తే॥ స్థానికులు పెక్కురున్న నుజాలు నొక్కబాహ్యుఁ డలశ్రాద్ధమును దోషభాక్కుఁ జేయు
పంచగవ్యంబుచే నింపఁబడినపాత్రి నొక్క కలుబొట్టుపడి కాదె యొగిని జెఱుచు-
సీ॥ ఓ కన్నివంకరలున్నవో యెఱుఁగని యత్యంతమూర్ఖుండె యగునుగాక
ముకుచెవులొక్కదలైన ముఖ్యావయవముల హైన్యంబుగలయట్టిఁ డగునుగాక
కాళ్లో వ్రేళ్లో యధికంబయియుండుచు నతివికారశరీరుఁ డగునుగాక-
వేదభాగములలోన విద్వద్ద్విజంబుచే ననయంబు దూషితుం డగునుగాక-

స్థానికుసై పిల్వనగుఁజుమీ శ్రాద్ధకృతిని నుత్తముండు లభింపకయున్నయపుడు-
కన్యకాదానమున శ్రాద్ధకర్మమునఁ గులీను నార్జింపవలెఁ గోరెనేని శుభము-
సీ॥ ప్రాఁకులలో రావిమాడ్కి నాయుధముల వజ్రమ ట్లేళ్ళ దేవనదివోలె
మరలలో హరివలె సరసుల శరధిలా గడవిజంతువుల సింహంబుపోల్కి
గ్రహముల నాదిత్యవహిఁ జుక్కలం జంద్రులలి నద్రులను సురాలయముభాతి
వాజుల నుచ్చైశ్శ్రవంబువిధంబున ద్విపదంబులందున ద్విజునికరణిఁ
గరుల నైరావతముమాద్రిఁ గామినీజనంబులోన నరుంధతిభంగిఁ బక్షి
సంఘమునఁ దార్క్ష్యుచాడ్పున స్థానజాతవిప్రులం దష్టకులజుండు పెద్దయగును-
కం॥ ఈవిధమెఱింగి శ్రాద్ధముగావించెడిసమయమునను గన్యకనొసఁగక
బోవుపడి నధ్వరమునను గావలెనని యష్టకులజు గడియింపవలెన్- ౨౩౯
ఆ॥ అష్టకులుఁదువచ్చి యరుగుపైనెక్కుచోఁ బ్రీతి నాడఁదొడఁగుఁ బితృగణంబు-
గర్జనంబొనర్చుఁ గడుఁ బ్రీతిమైఁ బితామహగణంబు-వింటె మనుజనాథ : ౨౪౦
తే॥ జందె మపసవ్యముగదొడ్డి సరిగమాకు లలిని దిలదర్భసహితమౌ సలిలములను
విడుచు దౌహిత్రుఁడని కడువేడ్క తోడఁ జెప్పుకొందురు పితరు లోక్షితిప! మఱియు॥
వ॥ అనివక్కాణించుటయు రాజిట్లనియె- ౨౪౨
తే॥ "అష్టకులజులు తన్నాగరాళియందు శ్రేష్ఠులని స్పష్టముగనీవు చెప్పినాడ-
వల్పమైయుండ దిట హేతు వరసిచూడ-వినుచు మయ్యది నాకు సవిస్తరముగ"
వ॥ అనియిట్లుప్రశ్నించుటయు విశ్వామిత్రుండు, ౨౪౪
ఉ॥ "సత్యము నీవుపల్కినది క్ష్మాతలనాయక! సాంగవేదముల్
నిత్యము వల్లెవేయఁగల నేర్పరు లింకను మున్నవారు సం
స్తుత్యులె నాగరుల్-సవనధూర్వహణంబునయందు శ్రాద్ధపుం
గృత్యమునందుఁ గన్యకలనిచ్చెడిపట్లను వారు యోగ్యులే- ౨౪౫
ఆ॥ ఇంక నేమియనిన నింద్రుండు వారియం దష్టకులులఁజేసె నగ్రణులుగ-
నన్యనాగరులును ననుమతించిరిదాని-కష్టకులులు. శ్రేష్ఠులైరి యిట్లు- ౨౪౬
తే॥ అట్లుగావున శ్రాద్ధమం దష్టకులులు భోజ్యులవ్వారు దొరకకపోయినప్పు
డన్యనాగరులను బిల్చునది-మఱొక్క స్థానమునఁబుట్టినట్టిరు తగరు దాన- ౨౪౭
కం॥ శ్రుతులనునాల్గిటిఁజదివిన మతిమద్వరులైనఁగాని మాన్యులుగారిం
దితరద్విజు-లీనియమము కృతమయ్యెను భర్తృయజ్ఞకృతిచేతను మున్- ౨౪౮
తే॥ నాగరద్విజుఁబిల్వ కన్యద్విజున్మఁ బిలిచి శ్రాద్ధంబొ యజ్ఞంబొ సలుపునెడల
వ్యర్థమగుఁగాని యయ్యది సార్థకంబుగాదు భూపాల! యిఁక నేమికలదు చెప్ప-

## —• నాగరబ్రాహ్మణులు పతితులైనవిధము •—

వ॥ అని విశ్వామిత్రుండు వాక్రుచ్చుటయు సానర్తమహీవల్లభుం డిట్లనియె.

ఆ॥ "ధర్త్రయజ్ఞుచేతఁ బలుమంది బ్రాహ్మణుల్ శాస్త్రయజ్ఞముల నిషిద్ధులైరి-
విబుధవరులు వేదవేదాంగపారగుల్ తీర్థజులును నన్యదేశజులును- ౨౫౧

సీ॥ ముకుచెవులొకదలైన ముఖ్యావయవముల హైన్యంబుగలిగిన యట్టివారుఁ
గాళ్ళొ వేళ్ళొ యధికంబయియుంటచే నతివికారశరీరులైనవారు
వర్ణాశ్రమాచారవర్తన ల్విడనాడి శాస్త్రపద్ధతిదొక్కఁ గోరువారు
నో కన్ను వంకర యున్నవో యెఱుఁగక యగ్గలంబును మూర్ఖులైనవారుఁ
గునఖులైనవారుఁ గుష్ఠామయమువారు శాస్త్రయోగ్యులనుచుఁ జాఁటిచెప్పి
మంచిమంచివారి మర్యాదపోవ ననర్హులనఁగ నేటిన్యాయమయ్య ?" ౨౫౨

వ॥ అని యిట్లడుగుటయు విశ్వామిత్రమహర్షి ౨౫౩

ఆ॥ "కలవు కారణములు కావలసినయన్ని- వినుము చెప్పెదను సవిస్తరముగ-
మహిసురాంగనలు చమత్కారభూనాథుపడఁతి దానములను బతితలైరి- ౨౫౪

చం॥ మగలు ప్రవాసమేగుతఱి మంచిగవచ్చి మహీశుభార్య మేల్
నగల నొసంగఁ దీసికొనినారు తదంగన- లాకతంబునన్
మిగులఁ బృథక్త్వమేర్పడిరి మీఁదను లోపలఁగూడవారి- క
ట్లాగిని దదన్వయస్థుల కయోగ్యతయేర్పడె శాస్త్రపుంగ్రియన్- ౨౫౫

కం॥ పదపడి విద్యాధనముల మదయుతులై తన్నుఁ జూచి మాటాడమి ని
ట్టదయుండై దుర్వాసుఁడు మదమేద శపించి పతితముఖ్యులఁ జేసెన్- ౨౫౬

తే॥ కుశుఁడు రాజ్యంబు సేయుచోఁ గూళలైన రక్కసులువచ్చి భయపెట్ట నొక్కమొగిని
బ్రిజలు భీతిని మన్నిని పాలికరిగి చెప్పకొనిరి మహీశ ! తచ్చేష్టితంబు- ౨౫౭

చం॥ అతఁడు విభీషణున్ గుఱిచి యంపెను లంకకు వార్తయంత- నా
దితిసుతుఁ డయ్యెదంతమును దెచ్చినదూతకు జోతపెట్టి త
త్ప్రియగు జానకీపతి పవిత్రచరిత్ర స్మరించుకొంచు నో
ధిత తదనిష్టకారుఁడయి దిక్కులఁ బాఱఁగఁదోలె వారలన్- ౨౫౮

ఆ॥ శరముభీతిఁ జెంది గంధర్వలోకంబుఁ జేరి రసుర లంతఁ- జేరికూడ
రావణానుజన్ము రాపిడిపడలేక మనుజలోకమునకుఁ జనిరి పిదప- ౨౫౯

చం॥ కుశధరణీశుదాడి నటఁగూడ వసింపఁగలేక యెంతయున్
గృశులయి బ్రాహ్మణాకృతులఁ బృథ్విఁ జరించిరి- విప్రసత్తచే
కళపడదయ్యె నందుటకు వారలలోన- ననంతరంబు వా

రతనవిహీనులౌచు భ్రష్ట మయ్యయిచోటుల కేగి యేగియున్ ౨౬౦

క॥ పతితులకున్ సంస్థానము తతము చమత్కారపురము దర్శించి యటన్
కృతవసతులైరి రక్షస్సతి తతిత్యులనడుమ ధాత్రీరమణా! ౨౬౧

క॥ మాయావిశారదులయిన యాయసురులు విద్యచేత నర్థముచేతన్
బోయి సగ మాక్రమించిరి రాయూర్వీపాల! యాపురోత్తమ మోజన్- ౨౬౨

శా॥ నాటంగోలెను నాగరద్విజులు భూనాథా! నిలింపాహితే
ట్కోటిన్ దాఁటిరి మాటిమాటికి నెవో క్రూరక్రియల్సేయుచు- చె
ప్పాటన్ వారిఁక నర్హులౌదు రవనీబర్హిర్ముఖుల్పెట్టు స
చ్ఛాటీదానముఖప్రశంసితములౌ శ్రాద్ధంబులం గొల్వఁగన్- ౨౬౩

ఆ॥ అట్లుగాన నరకమందునఁ బడఁద్రోయు వీరి శ్రాద్ధకృతుల విడువవలయు-
యత్నపూర్వకముగ నధ్వరంబులఁగూడఁ దగదు వీరిఁబిలిచి యొగిని గొలువ- ౨౬౪

చం॥ మఱియొకదోషముం గలదు మానవనాయక! విన్ము- క్రూరపా
ద్గరత మడంచుహేతువున స్థాపితులైరి త్రిజాతు లప్పురీ
వరమున- నాఁటఁగోలెనది వాడఁబడె న్నగరాఖ్య- నెల్లనా
గరులుఁ ద్విజాతులైరి- యటుగావున వారలు భర్తృయజ్ఞుచే ౨౬౫

ఉ॥ వర్జితులైరి శ్రాద్ధమున- వారి స్పృశించినవారె శుద్ధికిన్
మార్జనఁజేసికోవలయు- మూలనిమూలమునం బొసంగ నీ
దుర్జనశాపసక్తి సవధూర్వహులైనను నాగరాళి- కో
యార్జితభూరివైభవ! సమర్హులెటయ్యెద రట్టివారికన్? " ౨౬౬

వ॥ అని వక్కాణించుటయు నానర్తమహీవల్లభుండు వెండియునిట్లనియె-

క॥ "ఈకారణమును దయతో వాకొనవలయును మునీంద్ర! వరగుణసాంద్రా!
నీకుఁ జరాచరరూపక లోకజ్ఞానంబులోన లోపములేమిన్" ౨౬౭

వ॥ అనియిట్లు పృచ్ఛఁజేయుటయు మఱియు నగ్గాధినూనుండు ౨౬౮

క॥ "ఇక్కడవాక్రుచ్చెద నీ కొక్కపురావృత్తమును నృపోత్తమ! వినుమా-
మిక్కిలిగ భర్తృయజ్ఞవ్యక్కృతులౌ విప్రులెవరొ యదియు వచింతున్- ౨౭౦

—* { విప్రవేషముతో నొక చండాలుఁడు చమత్కార
పురిఁ బ్రవేశించుట. } *—

తే॥ వర్ధమానపురంబున వఱలె నొకయంత్యజాఁడు మను కుంభకుఁడనెడి పేరఁ
గలవచిత్తుండు నత్యంత కలుషకృత్తుఁ ఛిల్లికనుఁగలాఁడును నల్లమొద్దు- ౨౭౧

తే॥ కొంత కాలమునకు వాఁడు కొడుకుఁగనుడు వాఁడుమాత్రము కడురూపవంతుఁడయ్యె
నఖిలలక్షణలక్షితుం డఖిలకార్యదక్షుఁడుం గూడ నై శుక్లపక్షచంద్రు ౨౭౩

తే॥ అనుకరించుచుఁ బెంపొందు నతని చక్కఁదనము నగ్గింపఁజొచ్చె భూజనము కరమ-
బుద్ధిఁదెలిసి కుటుంబంపు శుద్ధిఁగనుడు నాత్మను విరక్తిరయుదయించె నతని కకట!

తే॥ అంతఁ జింతావృతస్వాంతుఁడగుచునతఁడు దేశదేశంబులకుఁబోయి తిరిగితిరిగి
ఘస్మసురాకృతితోఁ జమత్కారపురముఁ జేరి ముఖ్ప్రాతు స్నానము శ్రేసికొనుచు

సీ॥ ఛాందోగ్యుఁడను పేరి సన్మానిగోత్రమం దత్యంత మగు ఖ్యాతినందినట్టి
దేపొద్దుఁజూచిన వేదియొావ్రితమును బొనరించుచుండెడి పూతచరితుఁ
డఖిలవేదములుఁ దదంగంబులును బేర్మిఁ గొనవెళ్ళఁజదివిన కోవిదుండు
ప్రతివర్షమునను వైభవసమేతంబుగా యాగంబుఁ జేసెడి రాగరహితుఁ
డగు సుభద్రాఖ్యుఁ డవ్వీటు నలరుచుండ మాధుకరవృత్తికొనుచుఁ దన్మందిరంబు
“భవతి భిక్షాం దదా” తని సవినయముగఁ జని ప్రవేశించె- నింక సేమనవచింతు-

తే॥ తత్సుభద్రాఖ్య నాగరధారుణీసురునకు నొకకూఁతు- రది మూఁడుచనుఁలుగలది-
పంటిపైఁ బల్లు మఱి పృష్ఠభాగమందు సుడియొకందును నుండెఁ దత్పూతకు కుతిప!

ఉ॥ పుట్టుదరిద్రుఁడుం గులముపోయినవాఁడు విపత్తులోన ను
న్నట్టిఁడుగూడఁ జచ్చెదనటన్న భయంబునఁ దండ్రివచ్చి “యీ
పట్టిని నీకొసంగెదను, బాణిగ్రహింపు” మటంచు దండముల్
పెట్టి కరంబు వేడినను బెండిలి సేసికొనం డికేమనన్- ౨౭౪

కం॥ దేనిపలువరుస యిమ్మడిగానుండునొ యాఱునెలలు గడియకమును పే
దానిపతి ధృతశరీరుండౌనని సాముద్రికవిదులందురు ధరణిన్- ౨౭౫

తే॥ మూఁడుపాలిండ్లుగలిగిన యాడుపడుచు మామవంగసమంతయు మాయఁజేయు-
లేదు సందేహ మిద్దాన లేశమేని- గాన దూరంబునను వీడనొను దాని- ౨౭౬

తే॥ పృష్ఠమందున సుడిగలపిల్ల రయము కులటయై పాపముం బాలఁ గూడఁబెట్టు-
నట్లుగావున భూపాల! యట్టికన్యఁ బరిహరింపఁగవలయు సత్పురుషులెప్డు-

కం॥ అంతనది దినదినంబున కింతింత పెరుంగుటయును నీక్షించి కడున్
జింతించి యాసుభద్రుఁడు శాంతిం గనలేకపోయె! స్వాంతములోనన్- ౨౮౧

తే॥ “ఏమిసేయుదు- నేనింక నెటకుఁజనుదు- నెట్లు దీనికి మగఁడింక నేలుపడును-
మాటిమాటికి సంప్రార్థ్యమానులయ్యు దీనబధిరాంధపంగులున్ దీనిఁగొనరు- ౨౮౨

తే॥ ఎనిమిదేండ్లది గౌరిశా నెన్నఁబడెడి- నగును రోహిణి తొమ్మిదియబ్దములది-
దశశరత్ప్రియ కన్య- యంతకునుమించినది రజస్వల- స్మృతికారు లందురిట్లు-

శ్లో॥ “మాతాచైవ పితాచైవ జ్యేష్ఠభ్రాతా తథైవచ
త్రియ స్తే నరకం యాంతి దృష్ట్వా కన్యాం రజస్వలాం. ౨౮౩

చం॥ అనియిటు ధర్మశాస్త్రముల నార్యులువ్రాసి" రటంచు నెంతయున్
మనమునఁ జింతసేయునెడ మాధుకరార్థము తన్నిపాదుఁ డా
తనియిలు సేరవచ్చుటయుఁ దద్రమణీయతఁగాంచి బ్రాహ్మణుం
డని మది నిశ్చయించుకొని యబ్బురమంది సుభద్రుఁ డిట్లనున్- ౨౮౫

ఉ॥ "ఎచ్చటినుండివచ్చితివి ? యెచ్చటికేగుచునుంటి వియ్యెడన్ ?
మచ్చటయయ్యె నిన్నుఁగన ముద్దులుగారెడి మోమువాఁడవై
బిచ్చము పెట్టుమంచు నిజువేదవిధంబున నడ్గెదేల ? నీ
యచ్చపుగోత్రమేది ? చెపుమయ్య భవత్ప్రవరాభిధానమున్" ౨౮౬

చం॥ అనవుడు వాఁడు "గౌడవిషయంబున భోజకటాభిధానమై
తనరెడి మామకీనమగు స్థాన- మటం బలుమంది బ్రాహ్మణుల్
మనుదురు- వారిలోపలను మాధవనామక వేదపారగుం
డనఘుఁడు నాదుతండ్రి- యతఁ డార్య ! వసిష్ఠసగోత్రుఁడయ్యెడిన్- ౨౮౭

ఆ॥ ఎంతయునసుమండు- నేకప్రవరనూచితుఁడు- మదీయనామ మడిగెదేని
శర్మనురాగ్రగణ్య ! చంద్రప్రభుండందు- రష్టమాబ్దమునన యయ్యె వడుగు-
కం॥ వడివడి వడుగుంబొనరిచి మడిసెను నాజనకుఁ- డంత మాయమ్మయుఁదాఁ
బడియెం దచ్చితిపైన న్నడవులపాల్సేసి- యేమియడిగెద వింకన్- ౨౮౮

ఉ॥ అంత విరక్తిగల్గుటయు నయ్యయితీర్థములందుఁ గ్రుంకుచు
న్త్యంతము సంచరించి యిటు నాగతుఁడైతిఁ- బ్రభాసతీర్థ మీ
ప్రాంతమునం జెలంగునఁట- యచ్చటికేగద నేఁడో రేపొ- నా
కింతకుమించుకర్జ మిఁక నెయ్యది గానఁగరాదు చూచినన్- ౨౯౦

చం॥ చదువఁగలేదు వేదములు- శాస్త్రము లంతకుమున్నె సున్న- య
య్యదియకతంబుగా నిటుల యాత్రలుసేయుచు భిక్షుకుండనై
బ్రదుకుచునున్నవాఁడ- నెదో పద్ధతిదొక్కక కూరుచుండినన్
జదువును సంధ్య లేని పశుసన్నిభు నెవ్వఁడు గౌరవించెడిన్ ?" ౨౯౧

—♦ సుభద్రుఁడను బ్రాహ్మణుఁడు చండాలునకుఁ దనబిడ్డనిచ్చుట ♦—

చం॥ అనవిని యాసుభద్రుఁడు ప్రహర్ష ముఁజెంది "సుదేశసంభవుం-
డనుపమసుందరాకృతియు- నందును బ్రాహ్మణుఁ- డట్లుగాన నీ
తనికి మదీయకన్యకను దప్పకయిత్తుఁ బ్రతిగ్రహించుచో-
ననఘఫలంబు తీవ్రవతియై యది దూష్యమునేయులోపలన్" ౨౯౨

కు॥ అనిచింతించి ద్వితీయకుం దెలిపి యాయంతోద్భవుంగూర్చి "నా
తనయన్ నీవు గ్రహించుచో నొసఁగ సిద్ధంబున్నవాఁడన్ ద్విజా !

నిను నీపెండ్లము నింటనుంచుకొనుచున్ నిత్యంబుఁ బోషింతు నే"
నని వాక్రుచ్చి యతండు సంతసిలి బిట్టుద్దాని కిష్టంపడన్ ౨౯౩

సీ॥ వేయినూటపదాఱు వివిధమౌ నాణెముల్ కనకంపుఁదళియలోఁ గాన్కవెట్టి
వ్రీహిగోధుమముఖ్య విశ్రుతధాన్యముల్ కొలిపించి లలిని గాదెలకు నింపి
యత్యున్నతంబైన హర్మ్యంబునొకదానిఁ గాఁపురంబుంటకుఁగాను జూపి
యేఁటేఁటనుం దప్ప కేటిసీటు ఫలించు పల్లంపుభూమి నర్పణముచేసి
మంచియావులమందఁ దోలించి యింటి కపుడు గృహోక్త విధమున నాత్మజాత
నంత్యజునకిచ్చి యుద్వాహమాచరించి తనఁ గృతార్థునిగా నెంచుకొనియె ద్విజుఁడు-

సీ॥ తీరుతీరగుపండ్లు తెప్పించుకొనితించు బలుపిండివంటలు సలుపుకొనుచు
ఫలరసంబులు నప్పుపట్టిన తేనియల్ గోక్షీరములు దధి గ్రోలుకొనుచు
సాల్గోళ్ళగప్పుచు సకిఁగూడియొప్పుచు గడెకొక్కతీర్పట్టు గట్టుకొనుచు
సిగఁ బూలుచుట్టుచు శ్రీగంధమలఁదుచు మెయినిండఁ గొన్నిగ ల్కట్టుకొనుచుఁ
దత్సుభద్రాఖ్యనాగరధరణిసురుని పట్టిఁ బెండ్లాడుపిదప నాపంచముండు
కడువిలాసంబుగా నుండఁగడఁ గేఁగాని యొకవిశేషంబు వానిని బ్రికటపఱచె-

కం॥ అతఁడేగుదారివెంబడి జతజతలై కుక్క లఱవసాగను- మఱియున్
క్రితిపారముసలి పెడిబో నతులితముగఁ బడియె రక్త మాస్యము వెంటన్- ౨౯౬

చం॥ అదిగనిసంశయించి ప్రజ "యంత్యజుఁడీతఁ" డటంచుఁ జెప్పుకో
మొదలిడఁ దత్సుభద్రుచెవి ముల్కులవోలెఁ బడెం దదుక్తు- ల
య్యదనునఁ బెద్దపెద్ద లకటా! యని యయ్యపవాదపోకకై
యెదొయొక నిష్కృతింజలుప నెంతయు యోజనచేసి యంతటన్ ౨౯౭

కం॥ చని బ్రహ్మస్థానమునకు జనునొక్కనిఁబంపి యల్ల చండాలుని జ
య్యనఁ బిలిపించుడు వానికి ఘనభయమున మొగమునందుఁ గళ లోపించెన్- ౨౯౮

తే॥ మధ్యగునిద్వారమున నంత మహినుపర్వు లతని కులమును స్థలమును నడుగుటయును
గడగడవడంకి గద్గదకంఠుఁడగుచుఁ బట్టిదోసిలి మెలమెల్ల నిట్టులనియె- ౨౯౯

చం॥ "ఎనిమిదియేండ్లవాఁడనయి యే మన నా తలిదండ్రు లిద్దరున్
దనువును బాసిపోయిరి. పదంపడి తద్వ్యథతోడ లేచి స
న్మనితతివెంటఁ దీర్థముల మున్నుచుఁ గ్రుమ్మరుచుండ మాపురం
బునను సుభద్రుఁడన్ ద్విజుఁడు పుత్రికనిచ్చి సమాదరించె నన్- ౩౦౦

కం॥ ఏకప్రవరుఁడ. భువనప్రాకటవాసిష్ఠగోత్రభవుఁడ. వినుఁడు సు
శ్లోకులు! గౌడాభిధవర్ శ్రీకరదేశమున మధుపురిన్ మనువాఁడన్" ౩౦౧

క॥ అని యిటువక్కాణించుడు విని "నీదుకోలంబు మాకు విచికిత్స్యంబై
కనుపట్టెఁగాన ఘటశోధనముం గావించి తెలుపఁదగు నద్దానిన్- ౩౦౩

తే॥ అట్లుగావున ఘటమెక్క మద్దుచెప్ప. కివ్విధంబున సంశుద్ధిసెనసి యవల
నఖిలభోగంబు లిచటన యనుభవింపు"మని ద్విజాతులు పలుకుడు నతఁడు మఱియు

తే॥ "మూసలోఁ గ్రాఁగు బంగారమును గ్రసింతు. దూఁకుదును మండునిప్పులందొట్రుపడక
విసము నేనియు భక్షింతు విప్రులార! యింక ఘటశోధనము సేయ నేమిలెక్క- ౩౦౪

క॥ ఉండిన నా బ్రాహ్మణ్యము పండితసభ నిలుపుకొనఁగ భయమేమి? ద్విజుల్!
రండు ఘటశోధనము మీదండన సుఖముగ నొనర్తు. దయఁగన కొడలిన్-" ౩౦౫

క॥ అని సాహసమొనరించుడుఁ గని రవివాసరమునందు ఘటశోధనమున్
బని నిర్దేశించి వెసం జని రిండ్లకు భూమిసురులు. చనె మాదిగయున్- ౩౦౬

మ॥ చనివాఁడంతట భార్యతోడను రహస్యస్థానముంజేరి "యో
వనబోఁడీ! నను మాలఁడంచుఁ గనుగొన్నా రీపురిబ్రాహ్మణుల్
మననీరింకిట. నట్లుగాన నిపుడే మాయూరికిం బోద. మీ
వనుమానింపక లెమ్ము" నాఁగ విని యాయబ్జాక్షి కోపంబునన్- ౩౦౭

క॥ "నరకాగ్నిఁ గూలుకంటెను దురితాత్మా! యగ్నిలోన దూఁకుట మేలౌ.
నెఱిఁగియు మాలనివెంబడి యరుదెంతునె యింకఁగూడ నడుగులనొత్తన్- ౩౦౮

శా॥ ఏకత్ స్థానమునంతయుం జెఱిచితీ. వింకన్ శిరద్వ్యాజియై
ఖ్యాతింగాంచిన తాతపాదునిలు దూష్యంబొనటుల్సేసి. తీ
హేతుద్వంద్వము చేత నెవ్వఁడును దా నీక్షింపకుండంగ నే
పో. తర్వాత విపక్షముద్రమున నిన్ ముంపంగలా రందఱున్- ౩౦౯

— చండాలస్పృష్టాములకుఁ బ్రాయశ్చిత్తము. —

చం॥ అనియిటు లుచ్చరించుటయు నప్పురవాసులు గాఢనిద్రలో
మనుపెడ గోచిపెట్టుకొని మాలఁడు వచ్చితిరాయటంచు భీ
తిని జనె నిష్ఠవాళదకుఁ. దీక్ష్ణకరుం డుదయాద్రినెక్కఁచోఁ
గనుగొని దీక్షితాత్మభవ కన్నుల నశ్రుకణంబు లుర్లఁగన్- ౩౧౦

ఉ॥ ఏడుచుకొంచుఁ దండ్రికడకేగి "పితా! యిదియేమిపాప? మె
వ్వాఁడో మహీసురుండనని వచ్చినయంతన నన్నొసంగి, త
వ్వాఁడిపు "డంత్యజుండ" నని వాకొని నా కటూ పోయెఁ. గాన నీ
నాఁడె ప్రదీప్తపావకమునంబడి వీడెద నేను బ్రాణముల్" ౩౧౧

చం॥ అనవిని దీక్షితుండయిన యల్ల సుభద్రుఁడు వాతధూతమా
ఘనతరువట్లు చేష్టలుడుగన్ మహిపైఁబడి శీతవారిచే
చనముసఁ గొంతసేపటికి సంజ్ఞనుబొంది సబాంధవంబుగ
వెల్వనరుచుచున్ విలాపములు మూర్ధము మోఁదుకొనెన్ మహీపతీ! ౩౧౨

తే॥ అంత సంపర్కదూషితులైనయట్టి యిల్లపాలును సచ్చోటి కేగుదెంచి
యాసుభద్రుని నాతని యాత్మజాతఁగొంచుఁ దద్భర్తృయజ్ఞుని పంచకరిగి- ౩౧౩

పృథ్వి॥ "సుభద్రుఁ డవిచారతన్ సుతనొసంగి చంద్రప్రభున్
సభార్యకముగా రహిన్ స్వగృహమందుఁ బోషించినాఁ-
డభాజనుఁడు సంత్యజుం డనుచు వాఁ డెఱుంగంబడెన్
విభావరినిలేచితా వెడలిపోయె నెచ్చోటికో. ౩౧౪

తే॥ సార్ధసంవత్సరంబు సత్యంత్యజుండు దైవపిత్రుకార్యములలోనఁ దర్పితుఁడు.
తెలిసికొనఁడయ్యె నెవఁడు నీకలువమతిని. బ్రకటమయ్యెను నేఁటికిఁబంచముఁడుగ-

తే॥ ఆగమయ్యెను. నీస్థాన మంతయును సుభద్రుసంబంధమునఁజేసి భర్తృయజ్ఞ!
నీవె దక్షుఁడ విద్దాని నిగ్రహింప. నేమిచేసెదవో చేయు. మేల తడవు? ౩౧౬

కం॥ కొందఱు భుజియించిరి తన్మందిరమున. నింకఁగొంతమందియు నుదకం
బుం ద్రావిరి. మఱికొందఱు విందొనరిచి రతనిఁబిలిచి వేశ్మంబులలోన్- ౩౧౭

కం॥ తత్పాపసంభవంబగు సత్పాతమువాఁతఁబడకయుండిననాఁ డే
తత్పురమునఁ గనఁబడఁ. డో సత్పురుషా! యేల పెక్కుసంభావణముల్- ౩౧౮

కం॥ నీవే పుణ్యస్థానముఁగావించితి మున్ను దీనిఁ గరుణాలయా! మా
కీ వందఱకును గురుఁడవు. కావున శుద్ధులనొనర్చి కావఁగవలయున్" ౩౧౯

కం॥ అని మొఱపెట్టుటయును దద్ఘనుఁడు శ్రుతిశాస్త్రములును గలయవెదకి వా
కొనియెం బ్రాయశ్చిత్తము జననాథా! బ్రాహ్మణులకు సముచితభంగిన్- ౩౨౦

సీ॥ చాంద్రాయణంబును శతముపర్యాయము ల్వాతమతిం దాఁ జరియించుటొకటి
తనయింటిలోపలఁ దనరారునటువంటి యఖిలభాండంబుల త్యాగమొకటి
అదిఁ దాఁజేసిన యాధానమును వెండి విధ్యుక్తముగను గావించుటొకటి
లక్షహోమవిధానదీక్షావిచక్షణుండయి నూత్నదీప్తితో నలరుటొకటి
భర్తృయజ్ఞుఁ దర్హభంగిఁ బ్రాయశ్చిత్త మాసుభద్రకునకు నానతిచ్చి
యతనియాత్మజాత కగ్నిప్రవేశంబు తప్పదనుచుఁ జాఁటి చెప్పెనకట! ౩౨౧

ఆ॥ ఎవ్వరెన్నిసారు లేగి సుభద్రునియింటఁగుడిచి తృప్తిసెనవినారొ
యన్నికృచ్ఛములను నాచరించుకొనం డటంచుఁ జెప్పె వారి కందఱికిని- ౩౨౨

ఆ॥ అట్టులెన్నిమాఱు లాతనిలోగిఁట సలిలపానమెవరు సలిపియుండి.
రన్నిపరులు వారి సరిగి ప్రాజాపత్యమును బొనర్చుకొనఁగ మొదలయిడియె- ౩౨౩

సీ॥ తత్స్థానగతులకుం దత్స్పృష్టులకును నొక్కొక్క ప్రాజాపత్యమొగి విధించి
చెప్పి తదర్ధంబు స్త్రీశూద్రులకుఁ దదర్ధము బాలవృద్ధుల కమరఁ జెప్పి
మొగిని బ్రహ్మస్థానమునఁ గోటిహోమంబు స్థానసంశుద్ధికై సలుపఁబనిచి
రసజాతియంతయు వెస వీడనియమించి పాఱవేయించి మృత్పాత్రములను
హస్తమెత్తిమీఁది కఖిలనాగరులను బేరెలుంగు తోడఁ బిలిచిపిలిచి
భర్తృయజ్ఞుఁడప్పుడు "బ్రాహ్మణులార! వినుఁ" డంచు నింక నొక్కమాట యిట్టులనియె
సీ॥ తనయింటఁ గల యెల్లధనసంచయంబును లక్షగాయత్రియు దీక్షితుఁడును
నర్ధ చతుర్థాంశ మంత గాయత్రియు నతనియింట భుజించినట్టివారు
అష్టభాగధనంబు నంత తన్మంత్రముం దద్గృహంబున నీరుద్రావినట్టి
రాత్మశక్తి కొలంది నయ్యాభయంబును దుశ్శ్వపచస్పర్శదూషితులును
తన్మనుజుల కొసంగి జపియించుచో శుద్ధియగును. వినుఁడు మఱియు నందఱకును
దప్పకుండ గోప్రదానంబు కార్యంబు స్పర్శదోషమెల్ల సమసిపోవ- ౩౨౫
క॥ నేనును బ్రాణాయామము లూని శతత్రయము నిత్య మొనరుచుకొనుచున్
మానెద దివాశనం బిట్టులైనన్ శుద్ధుండనగుదు నబ్దంబునకున్" ౩౨౬
ఆ॥ అని యిటు ల్వచించి యాభర్తృయజ్ఞుండు మధ్యగాస్యమునను మరలఁ బిలిచి
యాద్యులైనయట్టి యల్ల బ్రహ్మస్థాన మెనసియుండు ద్విజుల కిట్టులనియె- ౩౨౭
క॥ "ఏతద్దివసంబాదిగ ఖ్యాతుండగు నాగరునకు కన్నియనిడనా.
నీతి రెఱుఁగక యిచ్చినయాతనిఁ బతితునిగ నెన్నవగు ద్విజులారా! ౩౨౮
ఉ॥ ఎవ్వఁడు నాగరేతరుని నింటికిఁ దోడ్కొనిపోయి శ్రాద్ధమం
దవ్యసుధామరోత్తమునై యర్చితుఁజేయునో తత్పితృవ్రజం
బవ్వడి దేవయుక్తముగ నావలకుం జను. నాగరున్ విశా
రెవ్విధిఁ జేయఁగాబడియు నీపయి శ్రాద్ధము వ్యర్థమయ్యెడిన్- ౩౨౯
క॥ యాగముల సోమపానము బాగుగ వే యాచరింపఁబడుఁగాక మహిన్
నాగరుఁడులేనిచోనది వేగ సురాపానమగును వినుఁడు ద్విజాతుల్! ౩౩౦
తే॥ శుద్ధిలేనట్టినాగరు శ్రాద్ధమందుఁ గుడువఁబెట్టినచో నదిగూడ వ్యర్థ
మెల్ల నాగరజనులకు నెడఁదనరని యేరుపఱచితి మర్యాద యిట్టు నేను- ౩౩౧
క॥ కాన నిజస్థానంబును బూని విశుద్ధంబు సేయుఁడాంటె ద్విజన్మల్
మానక శుద్ధిం బొనరుచుకొనా నేఁటేఁటు" నమచుఁ గ్రొత్తగ నిటులన్- ౩౩౨
తే॥ భర్తృయజ్ఞుండు నాగరబ్రాహ్మణాళి కొక్క మర్యాదగావించె నోయిలేశ!
తావకంబైన ప్రశ్నకుఁ దగినయుత్తరంబువచ్చెను. దదనంతరంబ మఱియు- ౩౩౩

## —• నాగర ప్రశ్న నిర్ణయము •—

తే॥ పుడమివేలుపు లెల్లరు బుద్ధిశాలియై రహించెడి యుల భర్తృయజ్ఞుఁ గూర్చి
దోయిలిఘటించి కరము సంస్తుతులొనర్చి బిట్టువినయంబుదోఁపఁ నా మిట్టులనియె.

ఉ॥ "శోధితుఁడైన నాగరుఁడె సోమము ద్రావఁగఁ గన్యనీయ శ్రా
ద్ధాధికృతుం బొనర్పను సమర్హులటంటివి. కులంబు గోత్రముల్
బోధయొనర్పఁజాలని ప్రబుద్ధులు మున్నగువారిపట్లు నా
శోధన మేవిధింబొసఁగుఁ జూచి వచింపఁగదే మహామతీ!" ౩౩౫

చం॥ అనియిటు ప్రశ్న సేయుటయు నా ద్విజులఁ గని భర్తృయజ్ఞుఁ డి
ట్లనియెను. "బ్రశ్న మూపవు మహాధర మీరలు నాదుశీర్షమం
దునిచితి. కాను గాక. నళినోద్భవుఁ గూరిచి కేలుమోడ్చి మీ
మనసులఁ బట్టునట్టులు సమస్తము చెప్పెద నాలకింపుఁడీ. ౩౩౬

మాలిని॥ "అవిదితపితృవంశుం డన్యదేశాగతుండై
సవినయముగ మీతో నాగరుం డేనటన్నన్
దవుగతిఁ బరిశుద్ధిన్ సల్పి పంపుండు గర్తా
భవసహితులరై యో బ్రాహ్మణశ్రేష్ఠులారా! ౩౩౭

సీ॥ అధికమౌదక్షిణ యార్జించుటకుఁగాను బిఱుసువాయని కోర్కెపేర్మిఁగాని
యపకృష్టుమీఁదికిం గృపణతం బరువెత్తు వ్యర్థమౌ లోపంబువలనఁగాని
యెదొయొక్క యత్యల్పహేతువుం జేసి యుదితమౌ ద్వేషంబునుండి కాని
శుద్ధియిచ్చినపైని చ్యుతిగల్గునని మదిం బీటవెట్టినయట్టి భీతిఁగాని
పాచితంబును యాచించు పతితజనుని శుద్ధుఁజేయుని నాగరశోణినురుల
బ్రహ్మహత్యోద్భవంబగు పాపమెనయుఁ. గాన నెటువంటివారికిం గార్య మద్ది.

ఆ॥ అస్మదుక్తమైనయట్టి ముత్తెఱఁగులశుద్ధి వడయునెవఁడు శ్రద్ధతోడ
వాఁడు దూరదేశవాసియే యగుఁగాక నాగరునిగ నెఱుఁగనొఁగులము. ౩౩౯

కం॥ మును జనయితృవంశంబును జనయిత్రివంశ మవల సంశోధితముల్
బొనరిచి శీలంబును నటువెనుకను శోధింపదగు వివేకముతోడన్. ౩౪౦

కం॥ ఈ మూఁడింటను శుద్ధుఁడు సామాన్యపదార్హుఁడగును. సకలద్విజులున్
నేమమున నేటికొకపరి తామును శుద్ధులగుటొప్ప స్నానం బటు గాన్. ౩౪౧

ఆ॥ ఆలయమొ ఆశ్రమపూర్వ మద్ధ్యాంతమున శుభంబుతోవుపదునను జితేంద్రియులయి
శాంతి దాంతి గలిగి చాతుశ్చరణసంతతస్నాతులయి యుండన్ యవనిసురులు ౩౪౨

ఆ॥ వారిమధ్యమందు వాసి గర్తాతీర్థ వాసి భూసురుని షష్ఠి క్రిఁ గూరు
చుండఁబెట్టి నాలు గుత్తమపీఠికల్ వారియెదుట జేయవలయు సరిగ. ౩౪౩

సీ॥ ప్రథమపీఠం బందు బహ్వృచుకొంటకును. నన్యమౌపీఠంబు యాజుషునకు.
మఱి తృతీయంబు సామగునిమిత్తము తరువాతి దాద్యుండు తావసింప
వేఱొక్క పీఠంబు వేయనొ నచ్చోట ముద్రి కార్థము విప్రముఖ్యులార !
శ్రీసూక్త శాఖన శ్రీవిష్ణుదైవత పాశావతంబులు పావమాన
జీవసూక్తములును జెప్పనొ బహ్వృచుఁ డపుడు శాంతికముగ. నటు చతుఃప్ర
కారమైన ఋషులకల్పంబు మండలబ్రాహ్మణంబును మధుబ్రాహ్మణంబు ౩౪౪

కం॥ గాయత్రీబ్రాహ్మణమును శ్రేయస్కర పురుషసూక్త శివసంకల్పా
లా యంగపంచకంబును బాయని రుద్రములు నిష్ఠఁ బఠియించి వెస౯ ౩౪౫

సీ॥ అధ్వర్యుఁ డొనరించునది శాంతికంబును. ఛందోగుఁడును జేర్మి సౌత్రవతంబు
దేవవ్రతంబును దినమణి చంద్రమోవ్రతములు విష్ణుసంహితయు జ్యేష్ఠ
సామము నేకవింశతిదాఁకనొ రథంతరమును గాయత్రి మఱియువినుఁడు
శారుండసామసంపన్నంబులొ సామరుద్రము ల్చదువనొ రూథముగను.
స్కందనసూక్తమును బ్రశస్త గర్భోపనిషత్తు నీలరుద్రసహిత ప్రాణ
రుద్రములు మఱి నవరుద్రముల్ క్షురిక నాద్యుఁడు పఠింపవలయు యుక్తఫణితి.

తే॥ అంతఁ బుణ్యాహఘోష గీతాదికములు సెలఁగ శ్వేతాంబరంబులు లలి ధరించి
శ్వేతగంధము మెయిఁబూసి శ్వేతపుష్పమాల మెడవైచి యాధరామరులకడకు

మ॥ చని కేల్మోడిచి శుద్ధి కామజనుఁ "డీమ్మో దేవులార నీవు ప్రా
ర్థనముంజేయుము నానిమిత్తము మహాత్మా ! శుద్ధిగావింత్రువా "
రని యమ్మధ్యగుఁగూర్చి పల్కునగు.న ప్డాతండు గోచర్మముక్
దినశాయంబునఁ దాల్చి యుచ్చితమునం దా వేడనొ వారల౯. ౩౪౬

కం॥ "ఏతన్నాగరభూసురుఁ డేతెంచినవాఁడు శుద్ధినీక్షింంచి. భవ
చ్చేతమునను రుచియించినఁ బ్రీతి నొసంగుండు శుద్ధి పృథివీదేవుల్ !" ౩౪౭

చం॥ అనియిటు ప్రార్థ్యమానులయి యమ్మహిదేవులు వేదసూక్తవా
చనమున శుద్ధుసల్పుటయొ సల్పకయుంటయొ చెప్పనొను. వా
క్కున నది శుద్ధికామజనుఁగూర్చి వచింపఁగరా. దదఃప్రకా
రనియతి నేనచేసితిని బ్రాహ్మణు ! లింకను నాలకింపుఁడీ. ౩౫౦

ఆ॥ అంత శుద్ధి కాముఁ డధ్వర్యు ఛాందోగ్యు నాద్యు నన్యుఁ జూచునది క్రమముగ.
వారు మదిని దృష్టివనిచో మాసక్తముల్ సౌమ్యములును భద్రసంయుతములు ౩౫౧

సీ॥ మాంగల్యజనకముల్ మంత్రలింగములును వృద్ధికుష్టిదములు శ్రేష్ఠములును
ఐంద్రవారుణములు నై విరాజిల్లెడి వాక్యము ల్పఠియింపవలయు నెలమి.
మనమున సంతృప్తి యొనరకయున్న చో నైఋత్యములును వినాశకరము
లాగ్నేయములు మఱి యామ్యము ల్గడు రౌద్రములును నవిష్టము ల్పలుకవలయు-
నదిని సంతృప్తిపడిన యమ్మహీసురవ్యులచట ద్రితిపాత్రతిలో యజ్ఞకతికిఁ
బుష్పదానంబు సేయనౌ భూమిదేవవర్యులార! జగద్ధితచర్యులార! ౩౪౨
ఆ॥ కుష్టిపదక ములు తోడ వర్తించెసివా రిసీయుటుంచు వదలవలయు,
నెల్లకృత్యములను నీప్రకారంబునఁ జనదు నిర్ణయింపఁ, గనుఁడు ద్విజులు! ౩౪౩
తే॥ ప్రాకృతోక్తులచేతనే ప్రజలుచేయుమాడ్కి నిర్ణయమైనపై మధ్యగుండు
చక్కఁ దాశత్రియంబు నొసంగవలయు నందఱకిఁగూడ నిర్ణయము గుట దెలియు"

— • భర్తృయజ్ఞవాక్యనిర్ణయము • —

కం॥ అనవిని బ్రాహ్మణులందఱు మునివరుఁడగు భర్తృయజ్ఞమునిఁదఱ వినయా
వనతులయి నిల్వఁబడి యిట్లని రదివిను చెప్పవాఁడ నవనీనాథా! ౩౪౪
తే॥ "మనుజభాషనుగాక యామ్నాయభాష భూసురేంద్రులు మధ్యముం బొందియున్న
యొవనికిం దాము నిర్ణయమీయవలయు? నెటు త్రితాళాలమధ్యగుం డేయవలయు? "
ఆ॥ అనుడు భర్తృయజ్ఞుఁ డనియె "బ్రాహ్మణ్యస్థానమునను గూరుచుండి ఘనులు నాగ
రులు వచించువాక్యములు దబ్బఱలుగావు శుభముగాని లే కశుభముగాని ౩౪౭
తే॥ అట్లుగావున వేదవాక్యములచేతఁ జూపుచుందురు శుభమో యశుభమొ వార.
లర్థియై వచ్చి ప్రశ్నించునట్టి వాని కోమహీసురులార! యింకేమిగలదు. ౩౪౮
తే॥ కాన మాటికిమాటికిఁ గార్యనిర్ణయంబు గావించువఱకును నడుగవలయు
శుద్ధికామునిమిత్తమై క్షోణిదేవులార! మధ్యస్థుఁ డవహితుండగుచు మిగుల- ౩౪౯
తే॥ బ్రాహ్మణాలాపవిపష్టుల భాషితంబు స్పష్టమైన నశించు మహాత్త్వమెల్ల.
దానఁ గోత్రధంబుగలుగు. నద్దాన ద్రోహ. మంతఁ గలువమ్మి. గాన నిట్లనుగఁబడెదు
తే॥ అందఱుం గుమిగూడ మధ్యగుఁడు లేచి యిచ్చుఁ దాళత్రయంబు శుద్ధిచ్ఛువునకుఁ
గామమునకరించు మొదటిది కడకు ద్రోహముఁ గోత్రధమును రెండవది. లోభగుణమునెల్ల
ఆ॥ పాయఁజేయు మూడవది గాన ముమ్మాఱు తాళములను నీయఁదగు" నటంచు
భర్తృయజ్ఞుచేతఁ బలుకంగఁబడుటయు నెలమి ద్విజులు మఱియు నిట్టులనిరి. ౩౫౨
తే॥ "ఋషమను నాథర్వణ బ్రాహ్మణము చతుర్థముగను గీర్తింపఁబడియెడిఁబూర్వమందు
నాగరబ్రాహ్మణుల కది యేగతిం బ్రథమపుఁబ్రశ్నంబు దానయ్యె యుధిష్ఠిరేంద్ర!

కం॥ అనియిటు ప్రశ్నించుటయును విని యమ్ముని "యిచట నీర్ష్యవిడువుం డేత
ద్వినిమయము వేనచేసితిఁ గని స్వస్థానము విశుద్ధిగలిగి రహింపుఁడీ. ౩౧౬
తే॥ ఋగ్యజుస్సామ సంజ్ఞల నెసఁగునట్టి క్రతువులెల్లను బాదత్రికములు గాని
లైహికములయి వెలసెడి యాభిచారికములుగావు వినుండు నాగరులు! మీరు
తే॥ సర్వలోకహితార్థమై సృష్టచేత నాభిచారికమంతయు నార్యులార!
యొగి నథర్వణవేదమం దుక్తమయ్యెఁ. గార్యసిద్ధికి నది యగుం గారణంబు. ౩౧౭
కం॥ ఏతద్ధేతువుచేతను భూతలమున నది చతుర్థముగనున్నను నా
చేతం బ్రథమంబుదిగా నీతఱిఁ గావింపఁబడె మహీసురులారా!" ౩౧౮
వ॥ అనివార్ధముచ్చెనని విశ్వామిత్రమహర్షి వక్కాణించుటయు నానర్తమహీ
రమణుండు ౩౧౯
తే॥ "ఈవిధంబున శుద్ధ్యర్థమేగుదెంచి నాగరులమోలనుండిన నాగరుండు
తానెటు ల్బుద్ధిగాంచునో తత్ప్రకార మానతీయుము వాచంయమాగ్రగణ్య!"
వ॥ అనిప్రశ్నించుటయు నమ్మహాముని యిట్లనియె. 320
తే॥ "ఈవిధంబున సమువాయ మేసపడుడు 'నీదుగోత్రం బెదా? యేది నీదుప్రవర?
శాయనమరయొవ? రాయమ శాయనయొవ?' రమచుఁ దచ్ఛుద్ధికాముని నడుగవలయుఁ
తే॥ అటు సగోత్రప్రవరముగు నతనియన్వయము నెఱింగి యనంతర మతనితల్లి
నాపెతల్లిని మఱియును నాపెతల్లి శుద్ధికృతియుం దెలుంగనా క్షోణిపురులు! 32౧
సీ॥ పితను పితామహుఁ బితృపితామహుఁగూడ నెవరంచుఁ బ్రశ్నించి యెఱుఁగవలయు
మాతఁ బితామహి మఱిఁ బ్రపితామహిం గ్రమముగాఁ దెలిసికోఁ గడఁగవలయు.
మాతామహుని వెండి మాతృపితామహుం దత్ప్రపితామహుం దలచవలయు.
మాతామహియు నోజ మాతృపితామహి ప్రపితామహి యెఱుంగఁబడఁగవలయు.
నిటు మహావిటపింబోలి యొదుఁగుచున్న యాఘు తద్వంశవృక్షముం దెలిసికొనుచుఁ
బ్రీతి సిందూరతిలకముం బెట్టినొసట శుద్ధినీయంగవలెఁజుమీ క్షోణినాథ! 323
కం॥ చాతుశ్చరణాను మంత్రవ్రాతంబున దీవనములు వరుసగ నిడి సం
ప్రీతిమెయి నంత మధ్యగుచేతఁ ద్రితాళముల నీయఁజేయఁగవలయుఁ. 324
కం॥ పదపడి తద్ద్వారమునన సదయత "నీనాగరుండు సామాన్యపదా
స్పదుఁడయ్యె శుద్ధిఁగని" యని పదుగురునిఁ జెప్పవలయు బాగుగ భూపా! 325
తే॥ అవల నగ్నిగృహంబున కరిగి సరవిఁ దృప్తినొందించి మిగుల నాదేవు భక్తిఁ
"బంచవక్త్రేణ" యనుమంత్రపఠనమునననిచ్చి పూర్ణాహుతిని భూసురేంద్రులకును
తే॥ అన్నదానంబు గావించి యంత శక్తికొలఁది దక్షిణ యీయంగవలయు రాజ!
ద్విజులు తమప్రోల సిందూరతిలకకలితు నలిపి పరిశుద్ధుఁ డితఁడంచుఁబలుకుటయును

కం॥ "మావంశము నిల్పంబడె నీవడి" యని తత్పితరులు సంతసము వార్కక్
భావించి తృప్తిపడుదురు భూవల్లభ! యప్పుడె శుద్ధి పూర్తియగుంగా. ౩౨౮

ఉ॥ ఎవ్వఁడు వంశభూమిరుహ మెంతయు శోధితముం బొనర్చి తా
నివ్విధి శుద్ధిఁజేసికొన నెంచఁడొ వానికిఁ దక్కరీతిగన్
నెవ్వగఁ గూర్పఁగావలయు నేర్పరులౌచు మహీసురాళి యిం
కెవ్వఁడునుం బ్రమత్తుఁడయి యీవిధ ముండకయుండఁ బార్థివా! ౩౨౯

కం॥ అష్టకులోద్భవుఁడైనను స్పష్టంబుగ నిర్విధముగ సంశోధితుఁడే
యష్టవ్యుఁడు శ్రాద్ధమున. నశిష్టునియెడ నింక నేమి చెప్పఁగవలయున్. ౩౩౦

కం॥ శుద్ధుండు కానిద్విజుఁ డే శ్రాద్ధమునం దధికృతుఁడుగ నల్పంబడుఁ ద
చ్ఛ్రాద్ధంబు బూదినిడిన సమృద్ధ గవీఘృతమువోలె వృధయగు నధిపా! ౩౩౧

తే॥ అట్లు గావున విశ్వప్రయత్నముగను శోధనీయులు నాగరక్షోణిసురులు
ఆత్మకులమెల్లఁ బరిశుద్ధమగుటపొంటె నటులె స్వస్థానమును శుద్ధమగుటకొఱకు"

## —• ప్రేతశ్రాద్ధము •—

వ॥ అనియిట్లు వక్కాణించుటయు వెండియు నాభూవల్లభుండు. ౩౩౩

ఉ॥ "నాగరవంశశుద్ధివిధి నాకు వచించితి విస్తరించి తా
నీ గ్రహచారమూలమున నెంతయు నష్టనిజాన్వవాయుఁడై
బాగుగఁ దల్లిదండ్రులనె బ్రాహ్మణసన్నిధిఁ జెప్పలేని యా
నాగరుఁ డెట్లుశుద్ధుఁడగు? న్యాయవిదగ్రణి! యానతీయుమా" ౩౩౪

వ॥ అని యడుగుటయు మతియు నమ్మౌని యిట్లనియె ౩౩౫

తే॥ "నన్ను నీవడిగినమాడ్కి నాగరులును భర్తృయజ్ఞుని నడిగి రీప్రశ్న మున్ను.
నష్టవంశునిమిత్తమై న్యాయమార్గ మెవఁడ యోజించి యతఁడవ్వ డిట్లులనియె ౩౩౬

తే॥ నష్టవంశుండువచ్చి నే నాగరుండననుచు సభలోనఁ జెప్పుచో నతని శీల
మును బరీక్షించి ప్రథమంబు వెనుక శుద్ధినీయవలెఁ గాని యవలకుం ద్రోయఁజనదు.

కం॥ నాగరధర్మములుం గడుబాగగు వ్యవహారములును బరికించి యతన్
దాఁగూడఁ బ్రవర్తించెడి నాగరు మన్నింపవలయు నయమార్గమునన్. ౩౩౮

తే॥ అతనిశుద్ధినిమిత్త మీయంగవలయు ఘటము. నది శుద్ధమైనచోఁ గర మతండు
శుద్ధుఁడును శ్రాద్ధయోగ్యుండు సోమపానయోగ్యుఁడుం గన్యకాయోగ్యుఁడుర్వియందు

తే॥ అఖిలవాస్థానకర్మమందతఁడు మతియునగుసామాన్యపదయోగ్యుఁడనుచునిట్లు
భర్తృయజ్ఞుండు నాగరబ్రాహ్మణులకుఁ జెప్పె. నది యేను నీకును జెప్పినాఁడ.

ఆ॥ నష్టవంశుఁడైన నాగరువిడలనొ నిది ద్వితీయశుద్ధి సదయహృదయ!
కనుక మతియు నేమివిన నిచ్చగించెదో యడుగు ముత్తరంబు నుడువనుంటి" ౩౪౧

వ॥ అని యిట్లు వాక్రుచ్చుటయు వెండియు నానర్తధరాఖండలుండు ౩౯౨

సీ॥ "అగ్గలం బుగ్రమై యొనరు మహోగ్రమౌ తపము పెంపున మహాధన్యులైరొ?
బహుదక్షిణాకమై పాపఘ్నంబౌ కనౌ మఖములనొనరించి మాన్యులైరొ?
వేదశాస్త్రాత్యమై విఖ్యాతమాత్యమౌ చదువున లబ్ధసౌజన్యులైరొ?
యపగతలౌల్యమై యనితరాలక్ష్యమౌ త్యాగంబునను ఖ్యాతహైన్యులైరొ?
యూర్జితంబైన యెవ్వో హేతువుండకున్న శుద్ధినెనసిన నాగరక్షోణిసురుల
యందఱు లేనియాశ్చర్యదృష్టి పుష్టపలంబుల కెట్టులేర్పడె? చెపుము మునీంద్ర! నాకు"

క॥ అని పృచ్ఛఁజేయుటయుఁ గుశికనందనుండు మఱియునిట్లనియె. ౩౯౪

ఉ॥ "నాగరులందఱుం గుణసనాథులె. యైనను వీరికిం మహా
యోగ మొకండు పట్టి పురుహూతునిచేతను సుప్రతిష్ఠితుల్
గాఁగనొవర్చె నియ్యది యె కారణ మష్టకుల ప్రసూతులే
నాగరధారుణీసురజనంబున గౌరవభాజ్యులై మనన్" ౩౯౫

వ॥ అని యిట్లు వచించుటయు నానర్తదేశవిభుండు ౩౯౬

తే॥ "ఎప్పుడావసుధామరులింద్రుచేత సంప్రతిష్ఠితులైరి యీ స్థలమునందు?
బలిమి నేల ప్రతిష్ఠింపవలసివచ్చె? విస్తరంబుగ వాక్రువ్వవే మహాత్మ!" ౩౯౭

వ॥ అని ప్రశ్నించుటయు గాధినూనుం డిట్లనియె. ౩౯౮

శిఖరిణి॥ "హిరణ్యాక్షుండన్ రాక్షసునకును నయ్యింద్రునకు సం
గరం బెంతో ఘోరంబుగ నడుమఁ బ్రాక్కల్పమున నో
ధరాజానీ! యం దెందఱొ పడిరిపో దైత్యులు సురల్
చిరం బన్యోన్యంబుం గడుఁ బెనఁగి పోరి నిహతులై ౩౯౯

తే॥ అంత నింద్రనిహతులైన యసురులెల్ల స్వగురువిద్యాబలంబున బ్రదుకఁజొచ్చి-
రొక్కరేనియు జీవంబునొందరైరి వేలుపులు. దానిఁజూచి తా వెఱఁగుపడుచు

కం॥ ఒకనాఁ డింద్రుఁ డుపేంద్రుని నికటంబున కరిగి యిట్లనెను. "లోకోద్ధా
రక! ధారాతీర్థంబునఁ బ్రకటప్రహరణములకును భయపడ కెదుఁదన్ ౪౦౧

ఆ॥ ఎదురునడచువారి కేగతిగల్గునో ప్రాణభీతిచేతఁ బాఱిపోయి
మృతినిగాంచువారి కేగతిగల్గునో నాకు శ్రీజనార్దనా! వచింపు" ౪౦౨

కం॥ అనియడుగుడు మధుసూదనుఁ "డని ధారాతీర్థభూమి నభిముఖులై యీ
ల్గినవారు పునర్జన్మంబును బొందరు ఛిన్నబీజపోల్కి సురేశా! ౪౦౩

చం॥ భయమునఁ బాఱుచున్ రిపుల బాణతతిన్ నిజపృష్ఠమందునన్
రయమునఁ గొట్టగాఁబడి ప్రణష్టకళేబరులైన భృత్యులెం
తయు నిలఁ బ్రేతలయ్యెదరు" నాఁ బురుహూతుఁడు వెండియుం గడున్
వయిమునఁ గేలుమోడిచి జనార్దనుగూరిచి భక్తి నిట్లనున్. ౪౦౪

ఆ॥ "కొంతమంది యమరు లెంతయు శూరులై పగఱ కెదురునడచి ప్రాణములను
విడిచి. రెంతొమంది వెన్నిచ్చిపాఱుచు నిహతులైరి యుద్ధమహిని దేవ! ౪౦౫

కం॥ కావునఁ బ్రేతత్వం బీదేవతలకుఁగూడఁ గలిగితీరునో లేకా
కావలులగు దానవులకె యేవంవిధనియతిగలదొ యెఱిఁగింపు" మనన్ ౪౦౬

కం॥ "సందేహము లేదుండఁ బురందర! వెన్నిచ్చి పాఱి రణమున హతులౌ
నందఱును బ్రేతత్వము నందుదు రెవరైన నేమి. యదిగాక మఱిన్ ౪౦౭

తే॥ విషముద్రావియొ లేక యావీతిహోత్రచయము దూఁకియొ మడిసిన యాత్మఘాత
కులు కృతఘ్నులుగూడ శోకహరభేది! యధికప్రేతవిగ్రహు లగుదు రవని ౪౦౮

తే॥ పసులకొమ్ములచేతఁ బొడ్వంగఁబడియొ వన్యమృగములకోఱల వ్రచ్చఁబడియొ
మృతినిగాంచినయట్టియు వృత్రహణ! ప్రేతలయ్యెద రుజ్ఝితప్రీతులగుచు" ౪౦౯

కం॥ అని మధుసూదనుఁ డనుటయు విని లేఖర్షభుఁడు మరల "విష్ణూ! యత్నిం
తును గావునఁ బ్రేతత్వంబును వారు దొరంగు తెఱఁగు బోధింపు" మనన్ ౪౧౦

ఆ॥ "భాద్రపదమునందు బహుళచతుర్దశీతిథిని వారిఁగూర్చి దేవనాథ!
గయను భక్తిపూర్వకముగ శ్రాద్ధముఁబెట్టి ముక్తిగలుగు నిక్కముగ నప్పుడె" ౪౧౧

కం॥ అని హరి పల్కిన శక్రుం "డని శస్త్రచ్ఛిన్నదేహులగు వారికి నీ
దినమే యెటులయ్యె శ్రాద్ధమ్మునకై యన్నింటిలోన ముఖ్యం" బనఁగన్. ౪౧౨

కం॥ "భూతప్రేతపిశాచము లాతతకూశ్మాండములును నమరారులుఁ దా
మేతద్వాసరమందున భూతేశుసకాశమునకుఁ బోయి యదృచ్ఛన్ ౪౧౩

కం॥ "అరుణుఁడు కన్యారాశికిఁదిరిగిన యాసమయమందు దీనులమా మా
కొఱకై యొకదిన మీయవె కరుణను వంశజులు శ్రాద్ధకర్మము సేయన్. ౪౧౪

ఉ॥ తద్దినమందుఁ బెట్టఁబడు తద్దినమందు భుజించి వెండి మే
మద్దినమేగుదెంచుకఱ శాత్మను దృప్తినిబొందియుందు" మం
చొద్దికతోడ వేడుటయు నుగ్రుఁడనన్ "విను డీచతుర్దశిన్
దద్దయు భక్తి శ్రాద్ధమును ద్వత్కులసంజనితుండు పెట్టుచోన్. ౪౧౫

కం॥ ఏడాదివఱకు క్షుధచేఁ బీడితులరుగారు మీరు. ప్రేతలు! చనుఁడీ.
యేఁడేని భవద్వంశపువాఁడు గయం బిండమిడిన వడిముక్తులరే. ౪౧౬

ఆ॥ శస్త్రవిహతులకు స్వర్గమేన్ ప్రాప్తించు నిశ్చయముగఁ బ్రేతనేతలార!
యీదినమున శ్రాద్ధ మెవరికి నకృతమౌ నద్దెమెల్ల వారి కంగలార్పె. ౪౧౭

కం॥ ఎవఁడీదినమున శ్రాద్ధముఁ దవిలి యొనర్పండొ భువిని దత్పితరులు తూ
ద్వీకతులయి వత్సరాంతము నవయుచునుండెదరటంచు నలువ వచించెన్. ౪౧౮

తే॥ అట్లుగావున సర్వప్రయత్నములను సఱపఁదగు నీచతుర్దశి శ్రాద్ధకర్మ
మద్ది యెవరికిఁగూర్చియే యగునుగాక ప్రేతలకుఁజెంది యధికమౌ ప్రీతిఁజేయు"

కం॥ అనియిట్లు చంద్రచూడుఁడు మును ప్రేతశ్రాద్ధమునకు ముఖ్యంబుగ నీ
దినము విధించెను. జని నీకవుఁగుతె యగుచో నొనర్పు మది వారలకున్. ౪౨౦

## — గయాశ్రాద్ధఫలము —

మ॥ భవదర్థంబయి యుద్యమానులయినారో ప్రాణాలు గాపాడుకో
నవలం బోలుమఁ గొట్టఁగాఁబడిరొ యత్యంతంబు పృష్ఠంబునం
దెవ రాలంబున మిత్రివాతఁబడిరో యీ వేగి యవ్వారికిన్
సవిధానంబుగ నాచరింపుము గయాశ్రాద్ధంబు వృద్ధశ్రవా! ” ౪౨౧

ఆ॥ వారు తృప్తులగుచు వరుసగాఁ బ్రేతత్వమునను ముక్తులగుదు ” రని మురారి
యానతీయుటయును హరివాయుం డింకను నెదియొ తెలియఁగోరి యిట్టులనియె.

మ॥ “ ప్రతివర్షంబును నీదినంబె గయకుం బద్మాసనుం డేగి త
త్పితృదేవార్థము శ్రాద్ధముం జలుపు గోవిందా! యటుల్గాన నే
నిత మేన్ శ్రాద్ధముఁబెట్టుపాంటె నటకుం బ్రీతుండనై పోదు. నీ
క్షితి నింకొక్క మహాస్థలంబు చెపుమా శ్రేయఃప్రదం బేగెదన్ ” ౪౨౩

కం॥ అని యీరీతి వచించుచు మనమున ధ్యానించి చిరము మాధవుఁడపుడి
ట్లను. “గలదు దానికంటెను ఘనమగు తీర్థంబె కూపి కామధ్యమునన్. ౪౨౪

ఆ॥ హాటకేశ్వరమున నదియుండు. దానిలో నఖిలతీర్థసహితమగు చువచ్చి
సంక్రమించుగయ నృపా! తచ్చతుర్దశీదర్శతిథులయందుఁ దద్దమహిమ. ౪౨౫

మ॥ రవి కన్యన్ మన నష్టవంశభవవిప్రశ్రేష్ఠులంబిల్చి యం
దెవఁడేన్ శ్రాద్ధముఁబెట్టుచోఁ బితరు లెంతేనిం దరిం త్రింద్ర! యి
భ్భువిఁ బ్రేతత్వము నొందినట్టిరె కడుం బూతత్వముం దాల్చ నా
దివమందుండెడి వారిసంగతి యిఁకం దెల్పంగ నేమున్నదిన్. ౪౨౬

తే॥ తన్మహాక్షేత్రమున సముద్భవముఁజెందినట్టి యష్టకులోద్భవు లనఘులగుటఁ
జేసి యానర్తపతియిచ్చు భూసువర్ణములను బట్టుట కొల్లక తొలఁగిపోయి. ౪౨౭

ఆ॥ మంచుఁగొండపై నచంచలులై తపంబున్న వారు, వారియొద్దకరిగి
సామపూర్వమైన సదుపాయములచేత గౌరవంబుఁజూపి కడుజవమున. ౪౨౮

తే॥ తోడుకొనివచ్చి వారియెదుట యథావిధిగను శ్రాద్ధంబుఁబెట్టుము. తీరు నీదు
వాంఛితము. వచ్చినటువంటియష్టకులజు లచట సుఖముండుదురు త్రిదివాధినాథ!

కం॥ నీతోపాటుగ పేము నేతద్భూసురుల శ్రాద్ధహేతువుచేతన్
బ్రీతిం బూజించెద ” మని యాతీరునఁబల్కి యంబుజేక్షణుఁ డంతన్. ౪౩౦

ఆ॥ పాలకడలికరిగెఁ బరమహర్షముఁజెంది తత్క్షణంబలేచి తద్బలారి
హిమనగంబుఁజేరి యీక్షించె ద్రతస్యులైన యష్టకులుల నగ్రజముల. ౪౩౧

రావిధ మంగయుక్తముగ నన్నిశుభ్రతు ల్పతియించి యాజ్ఞికుల్
గావుటయన్న వాస్తవమె కాని గుణంబు ఖపుప్పు మచ్చటన్॥ ౪౪౨

సీ॥ ఒండొరు ల్విద్వేషమూని తామెంతయుఁ దగవులాడుటలోన దక్షులెపుడు.
నిఁకఁ గట్టైవిలేచి పొయ్యినిబెట్టినట్టులే మాటలాడిన. లేదు మార్దవంబు.
మఱి దురహంకారపరిపూర్ణు. లాత్మలో నొకరినొక్కరు గెల్వ నూహచాలఁ.
దపముమాటఁదలంపఁ దలనొప్పి. భోగలాలసులును. మఱియు స్త్రీలంపటులును.
నిట్టి దుర్గుణములకెల్ల నిరవువార. లఖిలసద్గుణములును మీయందుఁగలవు
వారి ప్రశంసించె మిమ్ముల. నట్లుగాన రావలయుమీరు శాతోద రమణ నటుకు"

తే॥ అని యిటు ల్యాచియించుడు "నదెకతముగ విడిచితిమి మేము స్వస్థాన. మదుగనేల
కానిచో స్వర్గమార్గంబుఁ గానఁబఱచు బహుసుతీర్థంబు నద్దానిఁ బాయఁగలమె.

శా॥ నీతో నచ్చటి కేము వచ్చునెడలన్ నిత్యంబు నీర్ష్యాసమో
పేతుల్ ద్వేషపరీతులైన స్వజనుల్ పెల్లాగముంజేతు. రా
చేఁత ల్మాకుఁతలు కోపహేతువులు. మాచేతం గృతంబైన యీం
తో తీవ్రింబగు తత్తపంబు తుయమౌ నోయింద్రి! యద్దానిచే. ౪౪౫

ఆ॥ అంత మోక్షమునకు నంతరాయముగల్గు. నట్లుగాన నెట్టులరుగు దెంతు ?
మదియుఁగాక యచట నానర్తభూపాలుఁ డెంతయునుఁ బ్రసిద్ధుఁ డీగియందు.

ఉ॥ గుఱ్ఱము లేనుఁగు ల్నగలు గోవులు మున్నగువాని సర్వదా
యొఱ్ఱంగనిచ్చుచుండు నతఁ. డొల్లమటన్న నమగ్నమూను. నా
వెఱ్ఱిమునీనికోపమును వీరి విరోధము సైఁచి యొక్కెటే
బిట్టునఁ జేయఁజాలమటుఁ బెద్దతపంబు పులోమజాధవా ! ౪౪౭

చం॥ మనము చలించినం దపము మంచిగ సిద్ధినిబొంద నేర. దం
దునఁ ద్యజియింపఁగావలె నె దొడ్డదియైన మదీయధామమున్.
జనపతియిచ్చువానిని వెసన్ గ్రహియించినచోఁ దపంబు నా
శనము గుఁ దప్పకంము మును సృష్ట వచించుట యీవెఱుంగవే. ౪౪౮

పీ॥ శ్రీ దశసూనాత్స్యలం దవిలి కావించిన కటికకుఁ దుల తిలఘాతకుండు.
తత్తిలఘాతకదశకంబునకు నేటు కలుగియు నల క్రతుఘాతకుండు.

---

శ్లో॥ శ్రీ దశసూనాసమ శ్చక్రీ దశచక్రిసమో ధ్వజీ
దశధ్వజిసమా వేశ్యా దశవేశ్యాసమో నృపః.

ఈ శ్లోకము ద్వితీయాశ్వాసము ౩౦వ పుటలోఁగూడఁ దెనిఁగింపఁబడినది. కాని యక్కడ సాంప్రదాయికార్థము గ్రహింపలేక మఱొకరీతి వ్రాసితిని. అచటఁగూడ నీవైపద్యము నే చదువుకొనునది. ఈ స్థలమున వ్రాయఁబడిన టీక ననుసరించి పైపద్య మాంధ్రీకృతము.

తద్వ్రతఘాతకదళకంబునకుఁ దుల్య విటసమూహశ్రాంత వేశ్యకాంత.
తద్దశవేశ్యకాంతలకు సమానుండు శిక్షకుండగు నృపశేఖరుండు.
కాన లోభమునకుఁ గైవసంబైయున్న సకలనాగరులకు జతగ మేము.
రమణ రాజోసంగు రత్నాదికమ్ముల నెట్టుగ్రహింపవలయు నింద్ర! యనుచు ౪౪౯
సీ॥ "తండ్రియాజ్ఞ గొనుకు తలఁదాల్పకుంటకుం గొడుకులపైఁ దండ్రి కూర్పమికిని
నత్తపైఁ గోడలు బత్తిచూపమికిని గోడలి నత్త పోరాడుటకును
మగనికిఁ బెండ్లాము మార్మసంగుటకును బెండ్లమున్ మగఁ డేడిపించుటకును
నన్నతోఁ దమ్ముని కానుకాల్యములేమి కన్న తమ్మునితప్పు లెన్నుటకును
నక్క చెల్లెలిసేమంబు నరయమికిని జెల్లె లక్కను గరము ద్వేషించుటకును
జుట్టములు నొండొరు ల్బట్టు గొట్టుకొనుట కమ్మహాక్షేత్రపుం మహత్త్వమ్మె కతను.
ఆ॥ ఆపురంబుక్రింద హాటకేశ్వరదేవుఁ డున్నవాఁడు. వాని యురుప్రతాప
తపనుఁ డఖిలజనులఁ దపియింపఁజేయుటం బోరొకళ్ళకొకరి కేరపడెదు. ౪౫౧
కం॥ వినరే సీతాలక్ష్మణు లనఘుండగు దాశరథియుఁ నరుదెంచి యటన్
మనసులుఁగలియక యొండొరు లనుకోఁదగనట్టిమాట లనుకొను టలుకన్. ౪౫౨
చం॥ అయినను నొక్కమాస మట సాగ్రహాశ్రితుఁడై వసించినన్
గయివసమౌను మోక్షము. సుఖింపను స్వర్గతుఁడై యదేవిధం
బయిదుదినంబులున్న. ననఘాత్ములు! కావున రండు పోద మ
య్యాయనముఁగూర్చి. కల్గదిఁక నచ్చటిపాఱుల కీర్ష్య మాపయిన్. ౪౫౩
ఉ॥ వారలు మిమ్ముఁగన్గొనియు వారలఁగన్గొని మీరు నింకఁ గ్రో
ధారుణితాక్షులౌదురని యాత్మఁ దలంపకుఁ డార్యులార! మీ
కేరికి వస్తువాహనము లీయఁడు బల్మియొనర్చి పామి. యీ
తీరగు మత్ప్రసాదమున. దీనికి సందియముండ దింతయున్. ౪౫౪
కం॥ మీ పుత్రులకుం బౌత్రుల కేపురుషులు కన్యకలను నీయంగలరో
యాపురుషులకున్ వెయిరెట్లౌ పుణ్యము గలుగు బ్రాహ్మణాగ్రణులారా! ౪౫౫
కం॥ రవి కన్యాగతుఁడగునెడ నెవఁడు గయాకూపి రాక నెంతయు శ్రాద్ధం
బు విధించెడినో గయాశ్రాద్ధవిధికి వెయిరెట్లుఫలము తక్కరగతమా. ౪౫౬
ఆ॥ శ్రాద్ధమునకుమీరు చనుదెంచరేని నాతోఁడనిప్పుడటకుఁ జూతుఁ దేవ
దపము భంగమొంద శపియించిపోగుదు. నెఱిఁగి సత్వరముగ నరుగుదెండు" ౪౫౭
కం॥ అనియీవిధమున ననియుని కొన కింద్రుఁడు తనదు కనులకొన లెఱ్ఱఁగఁజే
సినఁ గని చనుదే లేచిరి యెనమండ్రుఁకొలాలపెద్ద. లెవరన వారల్ — ౪౫౮

సీ॥ కర్ణపూడను పేరఁ గాలెకుఁ బ్రథముండు కౌండిన్యుఁడన ద్వితీయుండుపరఁగు.
నష్టాశపానకుం డొగిని తృతీయుండు. శాక్యపుఁడను జతుర్థాఖ్యవాఁడు.
ద్వ్యషుఁడు నాఁబడి నొడికేఁ బైవచ్చూతఁ, దగను రాజాదాపుఁ డాఱవదఁడు.
శాకిస్త్యాశ్వలాయనగలవాఁడు నప్తముఁ. డగు శ్లోకసంఖ్యకుం డష్టముండు.
నీటలాష్టకమును గాక యగ్నిష్వాత్తముఖరౌ పితౄళ్ళ మొట్టమొదల.
యాప్పనీమాలైన యల్ల విశ్వేదేవతలను బిలువఁబంచెఁ గులిశధరుఁడు. ౪౬౦
తే॥ అప్పటిఫంబున వారి కాహ్వానమంపి కదలెఁ గదు శ్రద్ధమైఁ జమత్కారనగరి.
కప్పుడె లోకపితామహుండైన బ్రహ్మ చనియె శ్రాద్ధార్థమై తాను సరిగ గయకు.
కం॥ ఆయనచేఁ బిలువంబడి యాయమరేంద్రుండు వెట్టనగు శ్రాద్ధమునం
దాయానంబొనరింపక వే యరిగిరి గయకుఁ దాము విశ్వేదేవుల్. ౪౬౧

## —• ఇంద్రుఁడు విశ్వేదేవతల శపించుట •—

కం॥ వేగంటియొఁ దత్పురమున కేగి గయాకూపి నాడి యెంతయు శ్రద్ధన్
దాఁ గుతపకాలమందున "నాగచ్ఛంతు పితర" యని యాహ్వానిఁపన్. ౪౬౨
ఆ॥ దేవరూపులగుచు శీఘ్రమైఁ గొందఱుఁ బ్రేతరూపులగుచుఁ బ్రీతిఁ గొంద
ఱంద రరుగుదెంచి యష్టకులబ్రాహ్మణుల సకాశమందు నిలువఁబడిరి. ౪౬౩
కం॥ కానీ విశ్వేదేవులు రానంబడరైరియందుఁ. గాలవిలంబం
బేని సహించి తదీయాయానంబునకెదురుచూచె హరిహయుఁ డచటన్. ౪౬౪
ఆ॥ అగ్రపూజ్యులగుట నవ్వారి రాకకై యెదురుచూడఁజూడ నివ్విధమున
నింతలోన నాదగ్ని యేతెంచి యయ్యింద్రుతోడ నరవి నిట్టులనియె. ౪౬౫
కం॥ "విశ్వేదేవులు గయకున్ విశ్వస్పృహాహూతులగుచు వేంచేయఁగ నా
కేశ్వర! మాచితి. నీపై విశ్వాసమొయున్న నేలవెడలరు రటకున్". ౪౬౬
కం॥ అనియిట్టివిధమునఁ గలహాశనముని వచియించుటయును శతమఖుఁ డటనుం
డినభూమిదేవులెల్లనువినఁ గోపావిష్టుఁడగుచు వే యిట్లనియెన్. ౪౬౭
శా॥ "విశ్వేదేవులు లేకకె పెట్టుమను నీవేళం బితృశ్రాద్ధ. మీ
విశ్వంబందున నిక్లై పెల్లరును గానింపంగలా. రిందుఁ ద
ద్విశ్వేదేవుల కగ్రిపూజయిడి యావెన్కం గృతశ్రాద్ధము
క్తశ్రేశేతుసమీమ మానవభువిం దాఁబడ్డ వర్షంబటుల్". ౪౬౮
కం॥ అనియిట్లుపలికి స్వారాట్టని మును వాటుతైన దిజజులందఱకుం దా
నొనరిచె కేకోద్దిష్టములను సాకల్యముగ నో యిలావిభువంద్రా! ౪౬౯

ఆ॥ ఇట్టితఱిని నెవ్వరెవరికిఁ బిండంబు వైవఁబడెనొ వారివారికైన
యతను వాణియొకటి హరిహయా! వినుమంచు బయలునుండి సకవి బయలు వెడలె.

కం॥ "ప్రేతలగుచు నపగతసంప్రీతిని మనువారి కెల్లఁ బిండములిడి యా
ప్రేతత్వంబును బాపితి వై తేయరిపూ! త్వదీయ దయ యెంతదయా. ౪౭౧

ఆ॥ యాగ్యమానులగుచు నొరగి స్వర్గంబున దివ్యరూపములను దేజరిల్లు
వారు ముక్తులైరి వాసవా! నీవెట్టు శ్రాద్ధమునను నీ ప్రసాదమునను." ౪౭౨

కం॥ అని యిట్లు బయలు వెడలుటను విని యనిమిషపతి ప్రమోదవివశత నాహా
యని తత్తీర్థమహాత్త్వము వినుతించెఁ గరంబు. నట్టి వేళకు సకిగన్. ౪౭౩

శా॥ వేధశ్శ్రాద్ధము పూర్తిచేసి గయ విశ్వేదేవతల్ప్రీతి స్వ
ర్నాథున్ డాయఁగవచ్చి "వెండియును గార్యం బింద్ర! శ్రాద్ధంబు. ని
ర్బాధంబౌనది మత్సనాథమయినం. బాడౌను లేకున్నచో.
నీధర్మంబు గ్రహించి శ్రాద్ధఫల మెంతే నొంద నూహింపుమా. ౪౭౪

ఆ॥ తాత మొట్టమొదలు తాఁబిల్చుటం జేసి గయకు నేగి శ్రాద్ధకర్మమును ము
గించి నీదు శ్రాద్ధకృత్యంబునకు దవ్వునుండి వచ్చియుంటి మో మహేంద్ర!" ౪౭౫

చం॥ అనవిని యాశచీమనుఁ డాగ్రహపూరితుఁడై "ధరిత్రి నీ
దినము మొదల్గ నెంతయును దీనత మిమ్ముల బిల్చి శ్రద్ధమైఁ
బొనరుపఁబడ్డ శ్రాద్ధ మటుపూర్వము పెట్టిన శ్రాద్ధముల్ ఫలం
బును నిడఁజాల వీరలు కుబుద్ధిని జేసిన చేఁత వెల్లనన్. ౪౭౬

కం॥ ఏకోద్దిష్టంబుల నరలోకంబున నెల్లవారలుం జేయఁగలా
రీకరణిఁ గట్టుచేసితి. మీ కిటుఁబని లేదు పొండు మీ యిండ్లకిఁకన్. ౪౭౭

కం॥ భూతప్రేతాదికమగు నేతచ్ఛ్రాద్ధక్రియలకు హేతువయిన యే
జాతము విశ్వేదేవులు ప్రోతురొ యద్దాని నేను బ్రోచెద నింకన్. ౪౭౮

ఆ॥ యత్నపూర్వకముగ యజమానుఁ డేన సంయోజనంబొనర్చి యోజ శ్రాద్ధ
మేను వాత మొనర్చ నేగదు నయ్యాని దూరదూరమునకు ద్రుతముగాను" ౪౭౯

కం॥ అని గంభీరంబగు వాణిని విశ్వేదేవతలకు నిష్ఠురముగ వా
కొని పతి "పితరులు లేకుండని శ్రాద్ధము పెట్టుఁడింక నాగరు! లనుచున్ ౪౮౦

ఆ॥ ఆజ్ఞయనిరివార. లంత విశ్వేదేవతలు కుగబ్ధిమూనిఁగి పలవరింపఁ
గములనుండి నీళ్ళు కాల్వలై పాఱెను ధరణితలము నెల్లఁ దడుపుకొనుచు. ౪౮౧

కం॥ ఆవెచ్చనికన్నీటం బ్లావితమగు నేలపైని బ్రభవించెను భూ
తావళియు నండములు సంఖ్యావర్జితముగను వింటె యానర్తపతీ! ౪౮౨

సీ॥ కప్పు వైచినయట్టు కంటికింగనుపట్టు బహుదీర్ఘ మగు కోఱపండ్లతోడఁ
గఱకుకొయ్యలమాడ్కిఁ గడునిక్కిపొడిచి వంచిన వంగనటువంటి చెవులతోడఁ
గొసలువోఁద్రుంచిన కుశలవిధంబుగాఁ జక్కనిల్చిన శిరోజములతోడ
నగ్నికణంబుల ననుకరించుచు బిట్టు రక్తంబుఁగక్కు నేత్రములతోడ
నతిభయంకరంబులౌ ప్రాణులొకకొన్ని యందేములను జననమందిలేచి
శాపనిహతులైన సకలవిశ్వేదేవతలఁగుఱించి యిట్లుపలికెనపుడు. ౪౮౩

కం॥ "మాకందఱకిని మిక్కిలి యాఁకలియగుచున్న. దితరమదుఁగంబో. మీ
వా కవధరించి వేగమ మాకుఁ భోజనమునిడుట మంచిదిమీకున్". ౪౮౪

కం॥ అనియిటువారుచ్చుటయును విని వారల కిట్టులనిరి విశ్వేదేవుల్.
జనలోకంబున మమ్ములవిజాగ శ్రాద్ధములు శ్రద్ధఁ బెట్టెదరింకన్. ౪౮౫

ఆ॥ వానియందొసంగు వరభోజనంబులఁ గుడువుఁ డేగిమీరు కొడుకులార!
యనియిటుల్వచించి యరిగిరి బ్రహ్మలోకమునకపుడు వారు కష్టముగను ౪౮౬

ఆ॥ అరిగి కేలుమోడ్చి "యార్య! నీచేమేము ప్రాక్స్మ మంత్రితులము శ్రాద్ధమందుఁ.
గాన మున్నెవచ్చి గయలోన శ్రాద్ధనిర్వర్తనంబు సేయవలసివచ్చె. ౪౮౭

కం॥ తనశ్రాద్ధమునకెయుండుగఁ జనుదేరము మేపటంచు సక్రోధుండై
ఘనవాహనుండు మమ్ములఁ బనివడి శపియించె శ్రాద్ధబాహ్యులు గాఁగన్. ౪౮౮

కం॥ నీసన్నిధి కరుదెంచితి మోస్రష్టా! మమ్ము శ్రాద్ధయోగ్యులు గాఁగన్.
జేసి కరుణింపు మనుటయు నాసారసయోని యతికృపాళుండగుచున్. ౪౮౯

కం॥ సహితద్విశ్వేదేవుఁడు సహకూశ్మాండగణుఁడగుచు శక్రునికడకున్.
రహిఁ బయనమయ్యె. నా వృత్రహుఁడచట దివౌకసులకు శ్రాద్ధక్రియలన్. ౪౯౦

— ♦ బ్రహ్మ విశ్వేదేవతల ననుగ్రహించుట ♦ —

కం॥ నిర్వర్తించినవాఁడై సర్వంసహాఁ దీర్ఘయాత్ర సలుపఁగడఁగె. న
వ్విర్వురు నొకచోఁగూడ సుపర్వేశుఁడు సరవి నర్ఘ్యపాద్యంబులతోన్. ౪౯౧

ఆ॥ ఎదురుగానుబోయి యిచ్చియవ్వాని సాష్టాంగముగనుమ్రొక్కి ప్రాంజలియయి
స్వాగతంబు నీకుఁ జతురాస్య! నా జన్మత్రయముగూడ నీదుదర్శనమున. ౪౯౨

కం॥ తెలియఁగఁబడినది. పూర్వము సలిపితి శుభకర్మమేను. సలుపుచునుంటిన్.
సలుపుదుఁ బరలోకంబునఁ గలదంతయు వ్యక్తమయ్యెఁ గట్టిగ నాకున్. ౪౯౩

తే॥ అంతయును నిర్వహించెద. నట్లుగాన నిస్పృహుఁడవైన నీవును నేఁడిటేల
రావలసివచ్చెనో చెప్పు రయమ యనుచు నింద్రుతోడఁ జతుర్ముఖుం డిట్టులనియె.

ఆ॥ "పిండంబిడ్వకుండ నేనును శ్రాద్ధంబుఁ బెట్టవలనుపడదొ ప్రేతతోడ
నగ్రపూజ్యులైన యట్టి విశ్వేదేవతలను శ్రాద్ధబాహ్యులుగాను. ౪౯౫

తే॥ చేసితివిగాన నటువంటి చేఁతఁ జేసినట్టి నీచే నమంగళ మాచరితము.
అప్రమాణంబుగావించి తఖిలమైన శ్రుతుల స్మృతులను. నీక నేమిగతియొ యెఱుఁగ

శా॥ పిండంబూర్వుఁడు నేఁడు పిల్చితివి. నా వెన్కన్ నిమంత్రించితి.
వీరిని బరికింప వీరియెడఁ దప్పే లేదు. కానన్ బహి
ష్కారంబున్ మరలింపు. శ్రాద్ధమున యోగ్యత్వంబు గోలోకమున్
వీర లొందుదు రన్న వారు మిగులన్ వీక్షింపు మాఖండలా! ౪౯౭

కం॥ ఏకత్వాహ్వకమునగు నాతత్శ్రాద్ధంబు సఫలమగునని మును సం
ప్రీతికఁ దెంచితి బ్రాహ్మణజాతమున. కనత్యమెట్లు సలిపెద దానిన్". ౪౯౮

కం॥ అనియిట్లు వక్కాణించుడు "జనఘా! నేనును దురాగ్రహంబున శపియిం
చినవాఁడఁ. గాన నాపలుకు యనృతంబెటుగాకయుండు నటుచేయుమిఁకన్".

కం॥ అనవుడు వెండియు వనజాసనుఁ డిట్లను. "యూమ్మనుక్తి సత్యంబగున
ట్లొనరించెద విశ్వేదేవనిమిత్తం బాలకింపు వాసవ! దానిన్. ౫౦౦

కం॥ ఏకోద్దిష్టంబని కడువీఁకను నే శ్రాద్ధమీవు విశ్వేదేవుల్
లేకుండఁ బెట్టుమంటివొ పాకారీ! యద్ది పెట్టఁబడు లోకులచే. ౫౦౧

ఆ॥ కాని ప్రేతపక్షగతమౌ చతుర్దశియందె శస్త్రహతుల కది సమస్త
మాస్పృతావాహమునను నట్లు విశ్వేదేవతావివర్జితముగఁ దద్విజాళి. ౫౦౨

కం॥ సలిపిన శ్రాద్ధమునను ఫలమొలయును మద్వాక్యమహిమ. నొరు లీరీతిన్.
సలిపిన ఫలముండదు నాపలుకున నిస్సంశయముగ బల్యభియాతీ! ౫౦౩

ఆ॥ శస్త్రనిహతిఁ జచ్చు జనులకుఁ దచ్చతుర్దశిని గాక యితరతరుణమునను
సలుపఁదగదు శ్రాద్ధ మలఘు విశ్వేదేవతావివర్జితముగ దేవనాథ! ౫౦౪

కం॥ సలుపంబడుచో భూతంబులు తచ్ఛ్రాద్ధాన్నమెల్ల భుజియించు"నటం
చల బ్రహ్మ యీవిధంబునఁ బలుకుటయును సమ్మతించె వజ్రధరుండున్. ౫౦౫

కం॥ లోకపితామహుఁడగు తన్నాకిజ్యేష్ఠునిగుఱించి వినయసంయుతులై
వాకొనిరి యీవిధంబున వీఁకను దదనంతరంబ విశ్వేదేవుల్, ౫౦౬

కం॥ "మాకన్నిటం బుట్టెరి యీకొడుకులు శుద్ధికులగుచు. నిచ్చితి మేమున్
బాకారి మీఁదియలుకను మాకుం జెడినట్టి శ్రాద్ధమఖముల దేవా!

క॥ కావున నస్మద్వాక్యము నా వాసవువాక్యమును యథార్థంబగు న
ట్లీ వాలోచించి కరుణ మావారందఱికిఁ దృప్తి మతిమఱిఁగలుగన్ ౫౦౯

తే॥ మంచియాహారమును నిరూపించి(బ్రోవు" మని కరంబిట్లు(బ్రార్థింప విని విధాత
"బ్రాహ్మణులు శ్రాద్ధవేళలఁ బాత్రములకుఁజుట్టు భస్మంపురేఖలం బెట్టుచుంద్రు.

క॥ ఏకోద్దిష్టమొ పార్వణమో కా కిఁకొక్క శ్రాద్ధమో యగుఁగా కా
రేకలు లేకుండినచో మీకాడుకులు గుడుచునది సమృద్ధిగ నచటన్. ౫౧౦

ఆ॥ పాప్పములను దఱుపఁబడుట భూమి కుళబ్దవాచ్యయయ్యె. దానివలనఁబుట్టె
నండగణము. దాననైరి మీ ర్కానఁ గూశ్మాండులనుచు ఖ్యాతినందఁగలరు" ౫౧౧

క॥ అని పేరువెట్టివారల కొనరిచి ముత్తెఱఁగులుగను నొగి నగ్నికి వా
యున కాదిత్యున కర్పించినవాఁడయి యీవిధమునఁ జెప్పెను మరలన్. ౫౧౨

మ॥ "యజురాఖ్యంబగు వేదమందుఁగల యా"యద్దేవ" యన్బు క్రియన్
బ్రజ లవ్వారికి భాగమీయనగు. నింకం గోటిహోమంబులో
నిజభాగంబున మీరు తృప్తులగుచున్ నిశ్చింతమైనుండు" రం
చజుఁడీరీతివచించి తత్క్షణమునం దంతర్ధిఁజెందెం జుమీ. ౫౧౩

క॥ ఆవిధమాగాను విశ్వేదైవతములు ప్రీతులైరి. తత్కూశ్మాండా
ఖ్యావళియు విశేషించి ముదావృతమయ్యెను నరేంద్ర! యాలించితొకో. ౫౧౪

తే॥ అట్లుకూశ్మాండజంబగు నగడువలన బ్రాహ్మణులు శ్రాద్ధములయందు భస్మరక్ష
సలుపఁగడఁగిరి. నాగరబ్రాహ్మణాళి కీదృశంబగురక్షలే. దేలయనిన ౫౧౫

ఆ॥ వారిస్థానమందె మీఱి కూశ్మాండముల్ జననమందుకతన సదయమగుచు
వారిశ్రాద్ధములను గోరవు ఛిద్రముల్. భర్తృయజ్ఞుఁడుడిపె భస్మరక్ష. ౫౧౬

తే॥ హరిహరయుండును బరమేష్ఠియరుగుపిదపఁ దచ్చమత్కారనగరస్థ ధరణిసురుల
కందఱికిని గృతాంజలియగుచు వినయ మెంతయునుదోఁప భక్తిమై నిట్టులనియె.

తే॥ వినుఁడునామాట నాగరవిప్రులార! వినినతరువాతఁ జేయుఁ డవ్విఁకదాని.
దేవదేవుఁడయిన శూలి దివ్యలింగ మేను స్థాపింపఁదలఁచితి నీ పురమున" ౫౧౭

చ॥ అనియిటులవ్వచించుటయు నర్హతమంబగు స్థానమెక్కడ
యున్నియమిన నేతకున్ మహీసురావళి చూపెను. దత్స్థలంబునన్
ఘనమగులింగమున్నిలిపి కైవసముం బొనరించివారికిన్.
జనఁ ద్రిదివాలయంబునకు స్వాంతము రంజిల నమ్మహేంద్రుఁడున్. ౫౧౮

—• ఇంద్రుఁడు బాలమండనమున లింగప్రతిష్ఠ సేయుట. •—

వ॥ అనవుడు శాస్త్రమహీపతి. ౧౨౦

ఆ॥ "ఆర్య! చెప్పితివి గయాకూపికామహాత్త్వము సవిస్తరముగఁ గ్రమముగాను.
బాలమండనము ప్రభావంబుగూడ మాకెఱుఁగఁజేయుమయ్య కరుణయుంచి.

కం॥ మతియును నేస్థానమున న్సురపతి లింగప్రతిష్ఠ నూతనముగఁ దా
జరిపెను? దత్పూజనమున ధరణిజనులు పొరయఁగలుగు తత్ఫల మేమో". ౧౨౨

వ॥ అనిప్రశ్నించుటయు విశ్వామిత్రుం డిట్లనియె. ౧౨౩

కం॥ "శివలింగము నిలుపుటకై పవిధరుఁ డాక్షేత్రమధ్యభాగంబున నె
ప్డవనీబ్రాహ్మణముఖులను బవిత్రమగుస్థలము వేఁడె బాగుగనపుడే ౧౨౪

సీ॥ ఎచట దితీదేవి యెంతయుం దపమొండె సురలఁ గెల్వఁగఁజాలు సుతునిఁగోరి
మరుదాహ్వయములతో గరిమమై నెచట నా దితి కుద్భవించిరి సుతులు పెక్కు
రెచటఁ దత్సుతులెల్ల రింద్రుచే హతులయ్యు వృద్ధినొందిరిచాల మృతులుగాక
యెది మేధ్యతమమైన యుద్ధపదంబంచు మేటికీర్తి గాంచె వాఁడుఁగోలె
నట్టి బాలమండనాఖ్యమహాస్థాన మాబాప లేఖ రెంచి చూపుటయును
గ్రతుభుగీశ్వరుండు కలయ విలోకించి యిట్యుతోడ భక్తి నిట్టులనియె. ౧౨౫

తే॥ "సద్గురూ! శివలింగసంస్థాపనంబు సలుపఁదలఁచినవాఁడ నీస్థానమందుఁ
బ్రళయమునఁగూడ క్షతిలేనిభంగిదాని కొకమహార్థంబు పెట్టు మత్యుత్తమంబు".

కం॥ అనియిటువక్కాణించుడుఁ దనమనమునఁ బెద్దప్రొద్దు ధ్యానించి యతం
డను "మాఘసితత్రయోదశి యినవాసరయుతముఁ బుణ్యబుత్సాన్వితముల్. ౧౨౬

కం॥ అయి కడుబాగుగనున్నది. స్వయముగ శివలింగమీవు స్థాపింపుము. సం
క్షయమందకుండునది. హరిహయ! యాకల్పాంత మధిగతాభ్యుదయంబై." ౧౨౭

కం॥ అనవిని యానందాంబుధి మునిఁగి శునాసీరుఁ డదియె మూర్తంబున గా
యనవాదనములతోడను మొనయుచుఁ బుణ్యాహఘోషములు సెలఁగంగన్.

ఆ॥ బాలమండనంబు పజ్జఁ దల్లింగప్రతిష్ఠఁజేసి భూమిదేవతలకుఁ
దనియఁ గుడువఁబెట్టి దక్షిణ యాఘాటుమనెడి స్థానమిడియె నర్హభంగి. ౧౩౦

కం॥ హాటకూలమునందుండెడి, దింకం జుట్టును గరంబు నింపగు గోడల్
పొంకముగఁ గలిగినది సుగుణాంకా! యాస్థానమదె సమర్పితమయ్యెన్. ౧౩౧

తే॥ ఇట్లు సామాన్యముగనిచ్చి యెల్లద్విజుల కష్టకులజులఁబిలిచి "చంద్రార్కకాలి
కంబుగా మీకుఁ బంద్రెండు గ్రామముల సమర్పణము సేతుఁ గైకొనుఁ డార్యులార!

కం॥ కైకొనియవి యీలింగము వీఁకం జింతించు చెప్రను విప్రులు ! మనుఁ ” డం
చీకరణిని వాకొనుటయుఁ బా శారింగూర్చి యిట్లుపలికిరి వారల్. ౫౩౩

ఆ॥ “ విప్రధనము మఱియు విబుధులధనమును నటు తటాకభవము నల్పమేని
యెవఁడుతినునొ వాని యేడేకుతరముల ప్రాక్తనులును గ్రిందఁబడఁగలారు. ౫౩౪

తే॥ అస్మదన్వయభవుఁడెవఁడైన వాని గుడుచుచో మే మధస్థలిం గూలఁగల, మ
టంచు భయమందుచున్నార, మందువలన యీవ్మరుక్తముగావింప నొప్పుకొనము ”

చం॥ అనియిటు లెద్దు రాడుటయు నప్డు సుఁతుం బ్రవరత్రయా ప్త కీ
ర్తనుఁడగు దేవశర్మ కృతపాప్రగుపకారుఁడు శక్రుఁ డేదియో
మనమున నుండియుండు టనుమానముఁజేసి భయంబు భక్తియుక్
బెనఁగొన దోసిలొగ్గి యతిపేశలభావుఁటోడ నిట్లనుక్ ౫౩౬

పంచచామరము॥ “ అపుత్రకుండనైన వాడు నన్వయంబు వర్ధిలక్
గృపం గృతజ్ఞుఁ డింక దేకరిక్తవర్గకుండునా
సుపుత్రు ధర్మవేత్త నిమ్చుచోఁ ద్వదీయ శంభులిం
గపూజసేతు ” నా నతండు కౌతుకంబునొందుచుక్ ౫౩౭

సీ॥ సకలప్రపంచంబు క్షయముగాంచెడి దాఁకఁ దనసంతతిని నిల్ప దక్షుఁడగుచు
మనుజులెల్లఁగూడఁ దనుజూచి శేర్పుకో వ్రతముఁబూని యథార్థవాదియగుచు
దుష్కృతి యెంతయు దూరంబునకుఁబోవ ననవరతంబు ధర్మాత్ముఁడగుచు
దేవస్వమును దానుదినకుండుటేకాక ప్రజల కయ్యది బోధపఱచుకొనుచుఁ
జెలఁగునట్టి సుతుఁడు గలిగెడునీకుఁ, దదన్వయమునఁబుట్టు వాత్మజాతు
లందఱుం గడు న్మహాత్మత వేదపారగతఁ దత్సమానులగుదు రిలను ౫౩౮

కం॥ మఱియొకవ్యాహారంబును ధరణీసురవర్య ! వినుము, తద్విధమున నిం
దరుడెంచియున్న భూసురవరులందఱుఁగూడ వినుఁడు. వక్కాణింతుక్. ౫౩౯

ఆ॥ బాలమండనాఖ్యఁ బరఁగు నీతీర్థమం దీచతుర్ముఖముల నెసఁగునట్టి
యలఘులింగ మనఘ మస్మత్ప్రతిష్ఠితంబైనయది చతుర్ముఖాజ్ఞవలన. ౫౪౦

కం॥ ఎవరీతీర్థంబునఁదా మవగాహనమాచరించి యాహ్నికమగునై
నవహితులై పితృతర్పణము విధింతురొ తత్పితలకు మోక్షముగలుగుక్. ౫౪౧

తే॥ ఈ మహాదేవునకు భక్తి నేనొసఁగిన ద్వాదశగ్రామములనుండు మేదినీసు
రులు పితృశ్రాద్ధమున ముందు సలుపవలయు నీమహేశ్వరశ్రాద్ధంబు నేమమునను.

తే॥ అట్లు ప్రథమంబుఁ గావించి యధికభక్తి నిజపితృశ్రాద్ధకృత్యము లైనఁ బూనిన
విఘ్నములులేక యెంతయు వృద్ధిగలుగుఁ, గాకయుండిన విఘ్నము ల్గలిగితీఱు.

తే॥ మాఘశుక్లత్రయోదశి మఱకుండ వచ్చి యిచ్చటి కాగ్రామవాసిజనులు
బాలమండనమునఁ గ్రుంకి భక్తి నేతదాఖ్యలింగంబుఁ బూజింప నబ్బు సుగతి.

క॥ మాయకలింగార్పిత సద్గ్రామస్థద్విజుల కెంతకాలంబునకేన్
మైమఱచి పీడసలిపెడి పామరు లగుదురు వినాశభాజులు ధరణిన్. ౫౪౫

తే॥ ఆసముద్రసరస్సులో నవనిమీఁద మను సుతీర్థంబులన్నియు మాఘమాస
మందు శుక్లత్రయోదశి నరుగుదెంచు బాలమండనమునకు నోపాఱులార "! ౫౪౬

ఆ॥ అనియుపన్యసించి యగ్రమందున్నట్టి యష్టకులఁగాంచి యాగ్రహమున
వీరలేదుగురును వినక నామాట కృతఘ్నులైరి, కాన దండ్యులింక. ౫౪౭

## ఇంద్రుం డష్టకులనాగరుల శపించుట.

క॥ కృతమును మఱచిన సకలక్షితిజనముం గూర్చి యిటులఁ జెప్పినవాఁ డా
ఋతవాదియును స్వాయంభూసుతుఁడును నగు మనువు మున్న-చూడుఁడు దానిన్

శ్లో॥ కృతఘ్నేచ సురాపేచ చోరే భగ్నవ్రతే శఠే
నిష్కృతి ర్విహితా సద్భిః కృతఘ్నే నాస్తి నిష్కృతిః. ౫౪౮

సీ॥ సర్గాదిగా వేదశాస్త్రంబులన్నింటిఁ బాలించుకొనివచ్చు బ్రాహ్మణులను
దధిపయోఘృతముల ధరణీజనంబును దృప్తిపెట్టుచునుండు ధేనువులను
సృష్టికృత్యమునఁ దత్స్రష్టకు బాసటై ప్రజ వృద్ధిఁజేసెడి భామినులను
బిట్టుజతంగూరి కట్టినఁ గొట్టినం బ్రతిసేయలేనట్టి బాలకులను
ఎవరి తెరువుఁబోక యెచటనో కూర్చుండి ధ్యానమును బొనర్చు తాపసులను
దునుమఁదగదు. కాన దోషులేయగుదురు గాక, వీరి దునుమఁగడఁగ నేను " ౫౫౦

మ॥ అని వాక్రుచ్చి సదర్భమైన జలముల్ హస్తంబునం బట్టి " ని
ర్ధనులై పోఁగలవారు వీరు, మఱియుం దద్వంశజుల్ గూడ నే
జనులన్ యాచనఁజేసి యన్నమును వస్త్రంబుల్ సమార్జించి జీ
వనముం జేతురొ కన్నుఁబోలెం దుద కవ్వారిన్ విసర్జించుచున్. ౫౫౧

ఆ॥ కఠినమానసులును గరుణావిహీనులుం దిండిపోతు లగుచుఁ దిరుగుచుందు "
రని శపించి మరల నవశిష్టనాగరభట్టులను గుఱించి యిట్టులనియె. ౫౫౨

ఆ॥ " ఇమ్మహేశు మీ రెల్లరుఁ బూజించి భూతలీయసుఖము పొందుపొంటె
నైదుదినములందు నబ్దాంతమందిందుఁ, జూపుఁడయ్యవారిఁ జోటొకండు ". ౫౫౩

క॥ అనియిటు వాక్రుచ్చుటకును ననుకూలంబైన స్థలము నగుపఱచి వెసన్
మనముల నుప్పొంగుచు నిట్లనిరి శునాసీరుతోడ నవనీదేవుల్. ౫౫౪

ఆ॥ "బ్రహ్మకాలమనుచుఁ బంచరాత్రములును మనుజలోకసుఖము ననుభవింపు,
మలఘుగీతవాద్యములతోడ నీవు మహోత్సవంబు సేయుచుండు మచట" ౫౫౫
క॥ అనవిని యత్యంతంబును మనమున సంతోషమంది మఘవంతుండ
య్యనఘద్విజులకుఁ బూజనమొనరిచి స్వర్లోకమునకు నొయ్యనఁ జనియెన్. ౫౫౬
ఉ॥ మాఘసితత్రయోదశిని మర్త్యులు దేవమునింగి యొక్కమా
టా ఘనమైనతీర్థముల యన్నిట మున్గి గడించునట్టి సం
శ్లాఘనభాగ్యపుణ్యమును జక్క గడింతురొ తాదృశప్రభా
తాఘహా బాలమండన మహాత్త్వము సర్వము నీకుఁ జెప్పితిన్" ౫౫౭

— గౌతముఁ డింద్రాహల్యల శపించుట. —

వ॥ అనియిట్లు నొడువుటయు నానర్తధరాపురందరుండు. ౫౫౮
తే॥ "ఏలభూలోకమందున నింద్రునికి యేనుదినములవఱకెయుం జేరుపడియెఁ ?
దక్కవేలుపులుంబోలెఁ డిక్కనాళ్ళ మనుటకభ్యంతరంబేమి ? యనఘ! చెపుమ
ఆ॥ వత్సరాంతమందు వచ్చి యాపాకారి యవనినుండునట్టి యహములెవ్వి ?
యిందుకొఱకుఁగాను నేనేల నిర్దిష్ట ? మంతయును వచింపవయ్య నాకు." ౫౬౦
వ॥ అనియడుగుటయు విశ్వామిత్రుండు వెండియునిట్లనియె. ౫౬౧
ఆ॥ "పంచరాత్రములకుఁ బైని ధరాస్థలి నేలయునికి లేదొ యింద్రునకును
వినిచెదం దదర్థ మనఘాత్మ! యొకగాథ. యవహితుండవగుచు నాలకింపు ౫౬౨
క॥ అలరె బృహత్కల్పంబున నెలమి బృహత్సేనుఁడనెడి యింద్రుఁడు త్రిజగం
బులకు దొరయయి యటం బూజలఁ గైకొను చసురవర్గసంహారకతన్. ౫౬౩
క॥ ఒకసమయంబున నాతం డకుటిలుఁడగు గౌతమర్షి యబల నహల్యన్
సకలాంగసుందరిం గని ప్రకటంబగు మోహమునను బ్రతిదివసంబున్. ౫౬౪
చ॥ సమిధలకున్ ఫలంబులకు సంయమి మిత్రులతోడఁ దా నర
ణ్యమునకుఁబోవువేళలను నాకమునుండి ధరిత్రి డిగ్గి యా
కమలదళాక్షి నెంతయును గౌఁగిటఁజేర్చి రమించుచుండుడున్
సమిదళనుండు గౌతముని సన్నిధికేగి వచించె నంతయున్. ౫౬౫
చ॥ అదివిని తత్క్షణంబ యతఁ డాత్మగృహంబునకేగి చూచుచున్
మదవతిఁగూడియుండు శతమన్యుఁడు దిగ్గనలేచి భీతిమైఁ
జెదరినవస్త్రమేని సరిచేసికొనం దడవుండకున్కి న
వ్యుదిరొలలిం బలాయనపరాయణుఁడయ్యె. నిఁకేమి చెప్పుదున్. ౫౬౬

పంచచామరము॥ అహల్యగూడ వచ్చినట్టి యాత్మనాథుఁ జూచితా
మహాభయంబుతోడ లేచి మ్లానమైనయాస్యమున్
మహిం బడంగ వంచి మాటుమాటు లేకయుండ నా
గ్రహంబుఁ బెంచి గౌతముండు కన్ను లెఱ్ఱఁజేయుచున్. ౫౬౮

శా॥ "శక్రా! నాప్రియభామినిం జెఱచి-తీచైదంబు మాన్యంబు గా
దే. క్రూరా! వృషణంబు లూడిపడు నీ కిమ్మృత్తిఁ జేసి-యీ
వక్రత్వంబున కిద్ది చాలమిని నీవక్త్రంబుజం బింకవో
న్యాక్రాంతంబగు-వేయియోనులవు నీ వాధారమై తేఁకమా. ౫౬౯

తే॥ మూఁడుజగములదొంగని మునిరుఁబోకు ఖలుఁడ! వానని యూపద ల్గలుగునీవు-
నందు భూలోకమునను నీ వడుగుపెట్టఁ బగిలి తల తక్షణము వేయిబ్రద్దలగును"

మ॥ అని యింద్రున్ శపియించి పత్నిదెస కాస్యంబున్ వెసం ద్రిప్పి క
న్గోనలన్ నిప్పులురాలఁ జూచుచును నెగ్గుల్వల్కి భర్త్సించుచున్
"జనదూష్యంబగుచేఁత చేసితివి-కానన్ రాయివైయుండు పా"
ప్మని యిట్లుంగి శపించుటే తడవుగా నయ్యోష యట్లాయెపడెన్. ౫౭౦

కం॥ వృషయాను దచ్ఛాపంబున వృషణములం గోలుపోయి వేవక్త్రము వే
ఝష కేతునింద్లఁగలదయి మషిఁబూసిన కాగితంబుమాదిరి గాఁగన్. ౫౭౧

ఆ॥ వ్రీడతోడ నేగి విజనమౌ మేరుకందరముఁజొచ్చెఁ దనదుపురికిఁజనక-
తెలియఁజాలరైరి తెఱఁగంటు లాతండు కొండబిలములోన నుండి నూటఁ. ౫౭౨

కం॥ నాక మరాజకమగుటను భీకరదానవులచేతఁ బీడితులగుచున్
బాకాభిమాతిలేమికి శోకించిరి నాక-లతనినువతియుఁ నటులన్ ౫౭౩

చం॥ భయపడుచున్ సుపర్వగురుపార్శ్వముఁ జేరి "మహాత్మ! మామక
ప్రియుఁ డెటకేగెనయ్య" యని పృచ్ఛయొనర్చుటయుం జిరంబు ధ్యా
నయుతతనుండి జ్ఞాననయనంబున వీక్షణఁజేసి చక్కగన్
రయముగ దేవమంత్రము పురందరుసన్నిధికేగి యిట్లనున్. ౫౭౪

ఉ॥ "ఏమిది రాజ్యభోగములనెల్ల విసర్జనఁజేసి నిర్జనం
బౌమహిఁ నాశ్రయించితివి-యన్నియుఁగల్గియు ధ్యానమానితీ-
వేమినిమిత్త? ముగ్రతప మీగతిఁజేయుచునుంటి-వెంటినీ
కేమితటస్థమయ్యె?" ననియొంతయుఁ బ్రశ్నముఁజేయఁ జేయఁగన్ ౫౭౫

కం॥ భగవదనతఁ గడుసిగ్గున మొగమెత్తఁగలేక బాష్పములఁ దడిసి మొదల్
విగతాధముగా దైన్యం బగుపఱచుచు జంభభేది యపుడిట్లనియెన్- ౫౭౬

కం॥ "ఏల నిఁక నెంతమాత్రము త్రైలోక్యముగూడఁ-జూడు తద్గౌతమురు
ణ్మూలంబుగ నాకియ్యెడ నేలీలలుగలయవస్థ యేర్పడినదియో. ౫౭౭

కం॥ వేయోనిచిహ్నమ్ములల యీయాననమునను బోయి యేమని యాదై
తేయారుల సంభావనఁజేయంగలవాఁడ ? నీవెచెప్పుమాచార్యా ! ౫౭౮

కం॥ శోభాయమాన యాశచి, నాభార్య, తదంగనాజనమతల్లి, ముఖం
బీభగముఖమునఁజని నే నేభంగిని ముద్దులాడి యిష్టముదీర్తున్ ? ౫౭౯

ఆ॥ మర్త్యలోకమునను మహనీయులెల్లరు నాకుఁజేయుపూజ నష్టమయ్యె
నొక్క-కారణమున నుగ్రుఁడై గౌతమసంయమీంద్రుఁ డిచ్చు శాపమునను" ౫౮౦

కం॥ అనియిటువాక్రుచ్చుచుఁ గడుఁ బనవుచు వేలుపులతోడఁ బయనంబై య
మ్మునిశార్దూలముపాలికిఁ గొనకొని పవివిని స్వయంబ గురుఁ డిట్లనియెన్. ౫౮౧

చం॥ "హరిహయుచేత వీడఁబడినట్టి జగంబులు మూఁడుగూడ న
ధ్వరములులేక దానవులబాధల కగ్గములయ్యె, సిగ్గునన్
మరల స్వకీయరాజ్యమును మానసమందునఁ గోరఁడాతఁ డే
త్తెఱఁగుననేని శాపమును ద్రిప్ప ననుగ్రహముంచి సన్మునీ !" ౫౮౨

చం॥ అనవిని గౌతమర్షి "యయథార్థముగాదు మదుక్తి, నోటవా
కొనఁబడు దానిలోన నిఁకఁ గొంచెమొనర్ప" ననన్ సురేజ్యుఁ "డీ
యనిమిషులెల్లరున్ హరియు నట్లు స్వయంబుగ నమ్మహాత్ముఁడున్
వినయముతోడవచ్చి నిను వేఁడుచునుండినవారు చూడుమా. ౫౮౩

తే॥ నలువనుడి కన్యథా నీవు నడవఁగూడ, దట్లుగావున విప్రేంద్ర ! యమరపతికి
శాపమోక్షముగావించి సత్కరింపు" మనుచు నతని మనోదార్ఢ్యమును నెఱింగి

ఉ॥ వెన్నుఁడు మున్నుగాఁగలుగు వేల్పులతోడ విరించిమోలకున్
గ్రన్ననఁబోయి "వాసవుని గౌతముఁ డల్గి శపించె, నీసడిన్
గన్న నిశాచరాళి త్రిజగంబుల వ్యాకులపెట్టఁ జొచ్చె, నే
మున్నది యింక, సిగ్గుపడి యొల్లఁడు రాజ్యమతండు" నావుడున్ ౫౮౫

ఆ॥ పద్మజుండు త్ర్యక్షపద్మాక్షసహితుఁడై యిందు చింద్రుఁడున్న గుహకుఁబోయి
రయమ గౌతమర్షి రావించి యతనితో నెల్ల రాలకింప నిట్టులనియె. ౫౮౬

కం॥ "కామాతురుఁడై యింద్రుఁడు నీమడఁతిం జెఱచుటన్న నింద్యమె-నీత
ప్పేమియు నుండదు తాద్వృద్ధి మంతులఁబట్టి బిట్టు దిట్టుటలోనన్. ౫౮౭

తే॥ కాని తపముల కోరుపు కడుఁబ్రకాశిల్ల-మెల్ల త్రైలోక్యరాజ్యంబు నితఁడు మరలఁ
జేయునట్లు ప్రసాదంబు సేయుమయ్య గౌతమా ! యింక నీ కేమికలుషవలయు.

ఆ॥ ఇచ్చి యండములను నితనికిఁ గ్రమ్మఱ నాననమును రహితయోనిఁ జేసి
భూతలమున కెపుడుఁ బోవఁదా నభ్యంతరంబుగలుగకుండ రయమ సలుపు" ౫౯
కం॥ అనియిట్లుబోధపఱచిన విని యనిమిషనిష్ఠమైన విశ్వాసముతోఁ
గొనితెచ్చి మేషవృషణము లునిచె సహాల్యాపపతికి నుర్వీరమణా! ౬౦
కం॥ ఆయ్యాడుగులమీఁదం జయ్యనఁ జెయిపై చుటయును జక్షుస్సులుగా
నయ్యె నవన్నియుఁ-బదపడి నెయ్యమునను గౌతముం డనిమిషులతోడన్ ౬౧
శా॥ "వేగంబిం బొనరించినాఁడ మఘువున్-వేల్పుల్! వినుం-డెంతయున్
బాగా వీక్షణశోభగల్గి మను నీపై నేతదాస్యంబు-దు
శ్చాగాండుండయిహూడఁ దొంటిదగు పుంస్త్వంబందు లోపంబు లే
కింగండందు స్వరాజ్యమున్ సలుపుఁగానీ యేగలేఁ దుర్యుకిన్" ౬౨

## —§ ఇంద్రగౌతమసంవాదము. §—

మ॥ అనివాక్రుచ్చుచు నింతలోపలఁ ద్రిలోకాకీర్ణ మా వేల్పురా
యని మోమయ్యె మునీంద్రుసత్తను సహస్రాక్షుండు శోభాయుతం
బున-నస్థానేఁడు గౌతమర్షి చరణాంభోజంబులన్ వ్రాలి "యో
యనఘా! మర్త్యమునందు నాకగు సపర్యల్చాల దుష్ప్రాప్యముల్. ౬౩
కం॥ వానికి భంగమువాటిలె నేని త్రిలోకేశసంజ్ఞ యెడలెడి-నటులన్
గానటులఁ బ్రసాదింపుము" నా నాతం డక్కటికమునను విన నమరుల్ ౬౪
తే॥ అయిదురాత్రులు భూలోకమందు నీకు భక్తి జరుపంగఁబడుఁ బూజ ప్రజలచేత
నెంతయుం దృప్తినొందెద వీవుదాన నొక్కవత్సరమగుదాన నొందినట్లు. ౬౫
సీ॥ ఏదేశమున నానో యీయుత్సవంబు దా నాదేశమునఁ గలఁ వదుగుపెట్టు
దేవపురి నైదునా ళ్ళమహోత్సవమగు నాపురి దొరకగు నక్షయంబు
ఏగ్రామజనులెల్ల రీమహంబును జేతు రాగ్రామజనులకు వ్యాధులుండ
వేపల్లెలోపల నీపండు వగుచుండు నాపల్లియం జింత లాశ్రయింప
వెచటఁ బంచరాత్ర మీక్రమం బలరారు నచట నావుపాడి కతిసమృద్ధి,
యధికమేల యిట్టులగుచోటు లోకయుద్ధ మఖిలసుఖములకును నాస్పదములు"
కం॥ అనియిటు వక్కాణించుచు మనమున యోజించిచాల మఖవంతుండి
ట్లను, "నాదునుత్సవంబున కనఘా! పాత్రీ స్త్రయమిడితి, కట్లగు నెడలన్. ౬౬
సీ॥ ఏడాకులరఁటుల నెంతయురమ్యమై జాజిపూవాసన ల్చాలఁగలిగి
మంకెనపూలచే మతిమతివ్యాప్తమై కలువలు తామర ల్కరమెసంగి
తుమ్మెద లెల్లెడ జుమ్మని కదుప్రమోదఁ బందువెన్నెలల రేల్నిండియుండఁ

బచ్చనిపై రులం బంటునలంతివా నఖిలసత్వములను వార్ష మిడఁగ
నలరునట్టి శరత్కాలమందునమనుజులమ్మఁసత్సవ మొనరించునట్లుచేయు,
నీగతిని బాలవృద్ధుల కెల్ల రకది మిగుల నానందదాయకం బగునుగాక" ౫౯౮

క॥ అనివర్ణించుటయును మునినాథుఁడు శ్రవణయుతమున నీకు జనుల్
పొనరించెదరు మహోత్సవ, మొనయుముసంతృప్తి నిర్జరేశ్వర! మతియున్ ౫౯౯

తే॥ రేవతీయుతమందున నాకధూటి మానభంగంబుఁజేసితి గాన నీదు
సుకృతి పరికటీకృతంబుగా వికృతకాంగి జననమయ్యెడునీకుఁ దద్భంబునందు. ౬౦౦

ఆ॥ దాన మామకీనధవళయశోజ్యోత్స్న యలము మూఁడులోకములను గూడ,
నితయుఁడెవఁడు నిట్టి యేనమ్మ గావింప భయము నొందు ధరఁగపడుదునవుచు. ౬౦౧

క॥ శ్రవణాదిపంచతారలు భువిపయి వేర్వేఱ నీదుపూజనమునకున్
సవనసమానములగు వాసవ! తీర్థమయంబులను నసందేహముగన్. ౬౦౨

క॥ ఎవఁడేకోర్కెనిగోరుచు భవదర్చనసేయు పత్రియుఫలపుష్పములన్
బవిధర! వానికి లబ్ధములవు నవి, కానీ త్వదర్చయ యనర్చ్యయగుటన్. ౬౦౩

శా॥ ఈ వస్మత్ప్రియ బ్రాహ్మణిం జెఱచి నాకిట్లాటఁ జెట్లన్ భవం
బౌ విచ్ఛిన్నసుసృష్టి వేదవిదితవ్యానిత్యకర్మ్యల్మకన్
శీవిం దావకసర్వమంత్రములచే నిల్పంగలాఁడంచునీ
ప్రావీణ్యంబునఁ జొచ్చి మానవకృతార్చం గొమ్మసంతృప్తియా. ౬౦౪

క॥ ఎవఁడేవిధి సుప్తంబగు భవదీయంబైన మూర్తి బాగుగ లేపున్
భువి వాని కావిధంబున నవు నర్గలమైనసిద్ధి యస్వప్నపతీ! ౬౦౫

తే॥ పంచరాత్రవ్రతస్థుఁడు బ్రహ్మచర్యమూనిపట్టిఁడు నగుచు శాస్త్రోదిత ఫల
పుష్పములతోడ నీపూజ పొనరుచునరుఁ డిశరపత్నీరతాఘుముం జితుపఁగలుగు.

శ్లో॥ "నమ శ్శక్రాయ దేవాయ శునాసీరాయ తే నమః
నమ స్తే వజ్రహస్తాయ నమ స్తే వజ్రపాణయే" ౬౦౬

క॥ అనునీమనువున నెవ్వఁడు నినుఁగూరిచి యర్ఘ్యమిడునో నిత్యమెయిని వాఁ
డును నన్యదారసంగమఘునపాపమునుండి తొలఁగుఁ గ్రతుభుగధీశా! ౬౦౭

ఆ॥ ఎవఁడు నీకు నాకు నిపుడైన సంవాద మధికభక్తిఁజదువు నాలకించు
వాఁడు వత్సరంబువఱకాచరించిన వృజిన మంతరించు వేల్పుఱేఁడ!" ౬౦౮

తే॥ అనినవిని తెలఁగటులు వార్ష పడుచుఁ జనిరి యమరావతికి శక్రసహితులగుచు-
గౌతముండును క్రోధసంకలితుఁడగుచుఁ దవదునాశ్రమభూమికిం జనియె నపుడు.

## —• అహల్యాశాపవిమోచనము •—

కం॥ చని గౌతమముని యాగతి యనుఁగుం గొడుకయిన యా శతానందునకున్
వినుచుడు జరిగినసంగతి వినయావనతుఁడయి యతఁడు వే యిట్లనియెన్.

తే॥ "తండ్రి! యంతయు సరియె. నాతల్లి కేల శాపమోచన మబ్బఁగి సలుపవైతి?
నా వెతే వెడిపనికూడ నరసిచూడ నలవి కానిది కాదునీ. కట్లుగాన. ౬౧౨

కం॥ దీనుఁడ నత్యంతితుఁడఁ న నా నాథు పదంబుతో సమాగమ మగున
ట్లో నాయన! కరుణించుము నానతయి మ్మాకె శుద్ధయగు పాచితముల్. ౬౧౩

కం॥ అనియిట్లు వేడుకొనుటయు మునియిట్లను. మద్యభాండమును శుద్ధముఁజే
యను సాధ్యమైన నగు విటజనరేతస్స్రుక్తభగము సంశుద్ధియిడన్. ౬౧౪

కం॥ కలుద్రావినబ్రాహ్మణుఁడును నిల వాజిహోమమునను నెనయు విశుద్ధిన్
బలు తింగిని సాధించియుఁ గులటాంగన శుద్ధ గాదు కొంచెముగూడన్. ౬౧౫

కం॥ తలచుగను సురాభాండము పరిశుద్ధినిగాంచు వహ్నిఁ బతితంబై. య
క్కరణిఁ బరపురుష రేతఃపరిపూరితభగయు నగ్నిఁబడి శుద్ధయగున్. ౬౧౬

కం॥ ఈ కారణమునఁజేసియె యోకొడుకా యమ్మదంబ కొసఁగితి శాపం
బేకృచ్ఛ్రమ్ములవలనను నాకె విశుద్ధాత్మగా దిఁకని నొడువుటయున్. ౬౧౭

ఆ॥ అట్టులైన నగ్నియందైన దూఁకుదుఁ. బడుదుఁ బోయి పెద్ద బావినేని.
గరళమేనితిందుఁ. గాని మాతృవియోగమును సహింపఁజాల జనక! నేను. ౬౧౮

మ॥ మనుహారీతపురోగమర్షి కృత ధర్మగ్రంథము ల్లేవె? యిం
కను నైతిహ్యపురాణము ల్లలవు వీఁకన్ వాని శోధించి నా
యన! మాయమ్మకుఁ జెప్పు మేదొ యొకప్రాయశ్చిత్త. మద్దానిచే
తను శుద్ధంబొనరింతుఁ. గాదనిన సంత్యక్తంబులౌఁ బ్రాణముల్." ౬౧౯

తే॥ అని శతానందుఁ డనుటయు విని మహర్షి పెద్దయుంబ్రొద్దు ధ్యానించి ప్రేమ నతనిఁ
గౌఁగిటను గ్రుచ్చి బాహుయుగ్మమున మఱియు నెలమి మూర్కొని తచ్చిరం
[బిట్టులనియె. ౬౨౦

ఆ॥ "తనయ! యాత్మహత్య యొనరించికొని యిట్లు కలుష మేల మూటగట్టుకొనెద
వింతసాహసంబు నేలకావించెద? వాలకింపుమయ్య యస్మదుక్తి. ౬౨౧

కం॥ పుత్రా! నీజనయిత్రి పవిత్రయగుచు మామకీనవేశ్మములోనన్
రాత్రిందివములు మనుఁ. జిన్నేత్రమునం గంటి దీని నేను నిజముగన్. ౬౨౨

ఉ॥ రావణుసంహరించుటకు రాముఁడు నాఁగ నరాకృతిన్ ధరన్
శ్రీవిభుఁ డర్కవంశమునఁ జెల్వుగఁబుట్టుఁ దదంఘ్రిసోఁకునన్
బావనయౌచు నీప్రసువు మానవరూపమున దాల్చుఁ గ్రమ్మఱన్.
గావున నంతదాఁక తమగల్గి నిరీక్షణసేయు మాత్మజా!" ౬౨౩

కం॥ అనవిని మంచిదియని యమ్మునినూఁడు జనని శాపమోచనకాల
మ్మున కెదురుచూచుచుండెను. దనయుల కుండదె యపేక్ష తల్లులమీఁదన్. ౬౨౪
తే॥ అంత బహుకాలమునకు జనార్దనుఁడు పంక్తికంఠవధార్థమై పంక్తిరథుని
యింట రామావతారంబు నెత్తియుండ బాల్యమందునె యాభగవాను నేను.
చం॥ క్రతువును సాఁగనీక బహుకష్టము పెట్టెడి దుష్టరాక్షస
ప్రతతిని రూపుమాపుటకు బల్మిని దోడ్కొనిరాఁగ నేడ్తెఱన్
హత మొనరించె వారల. మదధ్వరముం బరిపూర్ణమయ్యె నో
క్షితిపతి వీనులంబడియె సీత స్వయంవరమాట యయ్యెడన్. ౬౨౫

ఉ॥ ఏలిక లంద ఱం దరుగ నేనును దద్రవివంశభూమిభృ
ద్బాలకుఁడైన పంక్తిరథుపట్టినిఁ దోడ్కొనిపోతిఁ, బోవఁ బో
నోలిని గౌతమాశ్రమమునొద్ద విశాలశిలాస్వరూపయై
నేలఁ బరుండియున్న సువినీత యహల్య గనుంగొనంబడెన్. ౬౨౬
చం॥ పదపడి రాముఁగన్గొని " కృపామతి నియ్యుపలంబుమీఁద నీ
పదవనజంబు మోపుమయ పంచజనత్వమునొందు. గౌతమ
క్షిదయితయీపె. యల్కఁబతిచేత శపింపఁగఁ బడ్డదె యిటన్
బెద శిలయైన" దంచు నిటు నేను వచించినవాఁడ భూధవా ! ౬౨౭
ఆ॥ అటు మదుక్తమగుడు నవికల్పముగ నతం డతికుతూహలమున నట్లుచేయ
నపుడెయద్ది మానవాకృతిధరియించి దివ్యరూపయగుచుఁ దేజరిల్లె. ౬౨౮
కం॥ అంతం దా మునుసలిపిన మంతువు స్వాంతంబునందు స్మరణమునకు రా
నెంతయు బిడియంపడు చక్కఁత జోహారులర్పించి గౌతమమునికిన్. ౬౩౦
కం॥ " పరపురుషునితో సురతము జరిపినగరితకు విరించి సముచితమని యే
ర్పఱచిన ప్రాయశ్చిత్తము సరవినివచియింపవయ్య స్వామీ ! నాకున్. ౬౩౧
కం॥ నేనది దుష్కరమైనను బూని యొనర్చికొని శుద్ధిఁబొందెద"నన న
మ్మౌనియుఁ బెద్దయుఁబ్రొద్దిద ధ్యానించి తదబ్జముఖికిఁ దా నిట్లనియెన్. ౬౩౨
తే॥ అఱువదెనిమిదితీర్థంబులందుఁగ్రుంకు చాచరింపుము నూఱు చాంద్రాయణములు
వేయికృచ్ఛ్రంబులును. వాన వీన నుండి యీవు సంశుద్ధవయ్యెద విందువదన ! "
మ॥ అని యిబ్భంగి వచింప నావె "యటులే" యంచుం బ్రతిజ్ఞన్ వహిం
చినదై తత్స్థలవర్తిలింగముల నన్నింటిన్ సమర్చించు చో
య్యన వారాణసియాదిగాఁగలుగు నా యష్టోత్తరంబైన వ
స్త్వనఘక్షేత్రములం జరించెఁ బృథివీశా ! యెంతయున్ భక్తితోన్. ౬౩౪

ఆ॥ ఆవిధంబునఁ జరియించు చన్యభూటి హాటకేశ్వరమున కేగి యచ్చటికను
నాగరుండొక్కరుఁడు వచ్చి నాగలోకపుం బథంబగు నాగబిలంబు పొడచ్చె.
తే॥ తత్పథంబున నేగి పాతాళమునకు నఖిలదేవాదిదేవుఁ డాహాటకేశు
పూజ సేయుచునుండిరి పూర్వమందుఁ దీర్థయాత్రికులౌ మునుల్ పార్థివేంద్ర! ౬౩౬
ఉత్సాహము॥ అంత "దేవదేవుఁడైన హాటకేశు దర్శనం
బింతదప్పు రచ్చికూడ నేను జేయకున్న యో
నుంతయేని యాత్రవలని సుఫలముండ దందుచే
నెంతయుం దపంబొనర్తు నేతదర్థ మిచ్చటన్." ౬౩౭
తే॥ అనివిచారించి కరము నుగ్రమగు తపంబు సలుపుచును శివలింగసంస్థాపనంబు
చేసి ముప్పూటలును సమర్చించుకొనుచు గౌతమునిగోల యటఁ జాల కాలముండె
ఆ॥ మంచియెండవేళఁ బంచాగ్ని మధ్యమం దారుబయట వానకాలలోనఁ
గొంతుబంటినీటఁ గ్రుంకి హేమంతమం దాయహల్య తపము నాచరించె. ౬౩౯
క॥ అంతంత శ్రమలకోర్చి యింత తపించినను హాటకేశ్వరలింగం
బింత కనఁబడదు ధాత్రీకాంతా! యంతటను గొంతకాలంబునకున్. ౬౪౦
క॥ మరలెత్తఁ దల్లిమీఁదం దరలి శతానందమౌని తత్తత్క్షే
త్రములన న్వేషించుచు నరిగెను శ్రీహాటకేశ్వరాహ్వయమునకున్. ౬౪౧
ఆ॥ అరిగి ఘోరతపము చరియించుజనయిత్రిఁ గాంచి మానసంబు కరఁగి నీర
మగుడుఁ గరయుగంబు మొగిచి దైన్యంబుతో బిట్టుదుఃఖపడుచు నిట్టులనియె.
ఆ॥ "ఇచటఁ జేరి కాయ మేటికి శుష్కింపఁజేసె దుగ్రతపముఁ జేసికొనుచుఁ
దిరిగి తలుపదేశతీర్థంబు లటనుండు శంభులింగములను జక్కఁ గంటి. ౬౪౩
తే॥ ఈరసాతలగత హాటకేశలింగ మేనరుండును వీక్షించియెఱుంగఁ డవని.
నొకటి దర్శింపఁబడకున్న నుండుఁ గాక. నాదుతండ్రియె నీకిచ్చినాఁడు శుద్ధి.
తే॥ అట్లుగావున నేగుద మరుగు డెమ్ము జనకునాశ్రమమునకు నోజనని యింక.
దారులం జూచుచున్నాఁడతండు నీదురాక కై కర్షకుండు వర్షమునుబోలె."
ఆ॥ అనుడు "నెంతవఱకు హాటకేశ్వరదేవ దర్శనంబు నాకుఁ దనయ! కాదొ
యంతవఱకుఁ గూడ నరుదేర నాదేవుదరిసెనంబొనర్చి యరుగుదెంతు" ౬౪౬
క॥ అనుడు శతానందుం "డోజననీ! యిది గట్టియైన జనకుసకాలం
బున కేనును నీతోడన చనియెద"నని శంభులింగసంస్థాపకుఁడై ౬౪౭
శా॥ ముప్పూటల్ ఘనచందనాదికములం బూజించు చాలింగమున్
బుష్పంబుల్ వ్యయుఁ బాలు నెయ్యి పెరుగు న్నైవేద్యముల్ పెట్టుచుం

చుప్పుం గారము లేని యోగిరము సూర్యుండేగుపైఁ దానుదిం
చిప్పాటుం దపముండె నాతఁడును నెంతేఁగాల మోయేలికా! ౬౪౮

శా॥ వేదోక్తంబగుసూక్తము ల్చదువు చవ్విప్రోత్తముం డెంతయో
యాదేవున్ భజియించెఁగాని యెటులున్ వార్షంపఁడం డాతఁడా
మోఁదన్ గౌతముఁ డెంతో కాలమునకుం బ్రేమాస్పదుండౌ సుతున్
దా దర్శింపఁగఁబోయి యందు నిజమాతంగూడి యుగ్రంబుగన్ ౬౪౯

కం॥ తపమున్న కొడుకుఁగని మొద లపరిమితంబైన హర్షమందియు మగుడన్
నృప మానవసహజంబగు నపథమునఁ బ్రవిష్టుఁడగుచు నాత్మగతమునన్ ౬౫౦

ఉ॥ "కష్టముకష్ట మౌర! యధికంబు తపంబు చరించుకొంచు మై
పుష్టినిబాసె నాదు వరపుత్రుఁడు. డెటుల్గానిపోదు నింటికిన్?
నష్టనిజానశాభయగు నాసహధర్మిణి దర్భకజ్జునాఁ
జేష్టలుదక్కియున్న యది చేయఁగఁదగ్గదియెద్ది నాకిఁకన్? ౬౫౧

మ॥ అని చింతించి "తపంబు చాలు నిఁక లెండా. యింటికింబోద" మం
చని వాక్రుచ్చుఁడుఁ దత్తనూభవుఁడు "తాతా! యీపసన్ మాన్పఁగన్
జననింగూర్చి యనేకధా నడిపితిం. దద్ధాటుకేశుం గనుం
గొనకే రాదఁట. యామెవచ్చుఁ జటి కేగన్ రాను పామ్మింటికిన్. ౬౫౨

ఉ॥ ఈయది నాదునిర్ణయ. మిఁకేయది యుక్తమటం చుఁదోఁచునీ
కాయది యాచరింపుము మహామహా!" నావుడు గౌతముండు "తం
డ్రీ! యిది నీదునిశ్చయమయేనియఁ జూపెద హాటకేశ్వరున్
నీయమకుం దపోమహిమ నే"నని చెప్పి యనంతరంబునన్ ౬౫౩

సీ॥ ఆతప శాలమం దారగించుటకుఁగా వ్రతమూనె మును నూఱువత్సరములు.
ఒకనాఁడుమాని వేఱొకనాఁడు భుజువంగ సాహసించెను నూఱుసమలు పిదప.
మూన్నాళ్ళకొకసారి భుజియింపదొరకొనె నంత నింకొక నూఱుహాయనములు
ఫలభక్షణముతోన నిలిపె శరీరంబు నటుపైని మతిమొక్క యబ్దశతము.
నీళ్ళుత్రాఁగియుండె నిష్ఠమై నూఱేండ్లు. గాలితినియె తుదకు గడవెఁ గాల.
మవ్విధమున వేయియబ్దము ల్తపమునందె గౌతమర్షి గూడఁ గాళ్యపీశ! ౬౫౪

చం॥ అపుడు భువిం బగుల్చుకొని యర్కసమద్యుతి సర్వలక్షణం
బు పయికివచ్చె లింగ మదెమూర్తమునన్ భగవానుఁడైన ఖం
డపరశువుం దదీయనయనంబులకుం దగ గోచరించి స
త్కృపమెయి డాయఁబోయి తనకేలునఁ గేలు గ్రహించి యిట్లనన్- ౬౫౫

ఉ॥ "గౌతమ! నీవ్రతంబునను గల్గెఁ బ్రమోదము- హాటకేశ్వర
ఖ్యాతము మామకీనమునునై మను నేత దనాదిలింగము

ద్యోతిత నాగలోకమున నుండి మహీస్థలి కేగుదెంచె నీ
చేతఁ జరింపఁగాఁబడెడి శ్రేష్ఠ తపంబు కతంబున న్మునీ ! ౬౫౬

చం॥ ఎదిమదిఁ గోరి నీవు సుతుఁ డింతి తపంబు చరించుచుంటిరో
యది లభియించె నీదు సతి యర్వదియెన్మిది క్షేత్రరాజముల్
వదలక సంచరించుటను వచ్చినయట్టిఫలంబు గాంచుఁగా
కిదియును గాక వేఱయొక దీవును గోరు వరం బొసంగెదన్ ” ౬౫౭

చం॥ అని యిటుపల్క గౌతమమహాముని “ దేవ ! రసాతలంబునన్
మనునెడ హాటకేశు నొకమాఱు గనుంగొనఁ గల్గు పుణ్యమే
జనముల కీస్థలంబునను జక్కఁగఁ గన్గొనఁ గల్గఁ జేయు మిం
కను గర మెక్కుడై యొలయఁగావలయున్ ఫల మేతదర్చనన్ ౬౫౮

తే॥ చైత్రశుద్ధచతుర్దశి సరిగవచ్చి యెక్కుడగు భక్తి నీ హాటకేశలింగ
మునకుఁ బూజన మొనరించు మనుజులెల్ల దరుగవలయును త్రిదశాలయమున కెలమి

తే॥ నాదు సతిచేత సుతుచేత నవ్యముగఁ బ్రతిష్ఠితములగు లింగము ల్నిష్ఠతోడ
నదె దినంబునఁ బూజించు మనుష్యప్రజయుఁ గలుషములనుండి తొలఁగంగవలయు గిరిశ !”

కం॥ అని కోరుకొనుడు “ నటుఁ గాక ” ని యాఖండలుఁడు హాళి యంతర్ధానం
బునఁ జెందె నాఁటఁగోలెను జనులకుఁ దద్దర్శనమున సమసె నఘంబుల్ ౬౬౧

కం॥ నరులు శతానందేశ్వరు నతియు నహల్యేశ్వరుం గ్రమంబుగఁ బూజిం
చి రహిం ద్రిదివాలయమున కరిగిరి పరసతులఁ గూడినట్టిరు గూడన్ ౬౬౨

తే॥ అంతలో స్వర్గమంతయు వ్యాప్తమయ్యెఁ గలుషతరమగు మానవగణముచేత
నికను నీవెంత యనిన నీవెంతయనుచు సరకుసేయక యుండి రా సురల నరులు

సీ॥ క్రతుకర్మ మొనరింపఁ గడఁగనే యొకఁడేని తల్లింగదర్శనతత్పరతను
సువ్రతం బొనరింపఁ జూచెనే యొకఁడేని లింగత్రయిం గాంగలించుకొనుచు
దానంబు సలుపంగఁ దలఁచెనే యొకఁడేని యాలింగమూర్తి యర్చవిడిచి
తీర్థసేవ యొనర్పఁ దిరిగెనే యొకఁడేని యాహాటకేశంబు నవలకరిగి
యట్లు లింగదర్శనాదికంబులచేత స్వర్గమాక్రమించి జనచయంబు
స్పర్థ పెరుగ సురలు భయపడి వ్యథతోడ నింద్రునొద్దకేగి యిట్టులనిరి ౬౬౪

శా॥ “ భూలోకంబున సర్వధర్మములునుం బోకాడెఁ బాకారి ! దు
శ్శీలం బయ్యెను వచ్చి యిప్పటికి నుర్వీయందు మాతోడ నే
పోలం జూచెడిఁ బూరుషాళి సకలంబున్ గర్వసంయుక్తమై
క్రాలుం జాలఁగ హాటకేశ్వరము నాఁగన్ క్షేత్ర మొక్కం డటన్ ౬౬౫

ఉ॥ అందల గౌతమర్షియుఁ దదంగనయైన యహల్యయున్ శతా
నందుఁడు నాఁగఁ బిల్వఁబడు నందనుఁడుం దపమొండి పెద్దప్రా

ద్దండఱు నన్ని లింగముల నాయన స్థాపనచేసినారు - త
త్సుందరలింగపూజనమ చూ కత మిందులకుం బురందరా ! ౬౬౬

క॥ గౌతముఁ డీతీరునఁ దనుఁ బ్రీతుంగావింపఁ దపము పెల్లున మఱియున్
పాతాళంబుననుండియు నే తెంచినవాఁడు హాటకేశ్వరుఁ డటకున్ ౬౬౭

మత్తకోకిల॥ తత్త్వభావముచేత నేర్పడె ధాత్రి నీవ్యవహార. మీ
పత్త్వయోజనమేనిలేదిఁక శ్రాద్ధదేవున కారయన్-
ద త్త్వసిద్ధములైన నారకతండ ముత్తదియయ్యె- నే
తత్త్వకార మెఱింగి చేయుము దానినాఁగెడి చైదమున్. ౬౬౮

ఆ॥ యజ్ఞవిధులు మగుడ నవనీతలంబున సాఁగవలయు దేవతాగణేశ !
వానివలనితృప్తి వేననుం గలుగదు మనకు నెంతమాత్ర"మనుడు నతఁడు ౬౬౯

క॥ కామాద్యంతశ్శ్రుతుస్తోమంబును బిలిచి "మీరు తొందరగం ద
ద్భూమిపయికి దిగి యందఱు సామర్థ్యముకొలఁది నేనుశాసించువిధిన్- ౬౭౦

ఆ॥ గౌతమేశ్వరునకు ఘన శతానందేశ్వరునకు నట్లె మఱియు నసఘుఁడౌచు
నచటనుండియున్న యయ్యహల్యేశ్వరునకును నిఁకను బూజనంబు లెలమి ౬౭౧

చం॥ జరుపకయుండె మానవుల స్వాంతములన్ మరలింపు"డన్న నా
హరిహాయశాసనంబు తలయందునఁదాలిచి వారు గౌతమే
శ్వరముఖదేవతాత్రితయభక్తమనంబులఁ జొచ్చి యాజనుల్
జరిపెడిపూజ లాఁగి, రరిపట్కముపూనినఁ గానిదేది" నాన్ ౬౭౨

—§ సిద్ధసేనుఁడు రాజ్యభ్రష్టుఁడై చింతించుట. §—

ఉత్సాహము॥ "ఏమిక్షేత్ర మేమిక్షేత్ర మెన్న హాటకేశ్వరం
బో మునీంద్ర ! తృప్తిగా దహోయహో ! వినన్ వినన్-
నా మనోరథంబుదీర నష్టకల్మషుఁడను గాఁ
బ్రేమ శంఖతీర్థమహిమ విస్తరించిచెపుమిఁకన్" ౬౭౩

క॥ అనియాన రత్నపాణిఁడు వినయంబున నడుగుటయును విశ్వామిత్రుం
డను. "వినుము శంఖతీర్థమ్మునకుం గతమగు మఱొక్క మునుపటిగాథన్. ౬౭౪

శా॥ అనర్తంబున కీవు ప్రస్తుతమునం దైనట్లె యన్వ్యండు మున్
దా బాధుండయి కొంతకాల మవనిం బాలించి యామీఁద నెం
తో నింద్యంబగు కుష్ఠరోగమున నే రోగాలిం గృశించెన్ ధరా
జానీ ! యాతఁడు-పెక్కు-తేల-పలుకష్టంబుల్పడెంబో తుదన్. ౬౭౫

సీ॥ తనుఁజూచి భూజను లవుడవ్వులం బోవఁ బెద్దవ్యాధికిఁ బీటఁబెట్టినాఁడు,
కాలుసేతులు కార్యకారులు కానట్టు లూడిపోయిన వేళ్ళ నుండినాఁడు,
పడెడివో వడి లేవఁబట్టుటకై నను గొడుకులు లేకుండఁ గుందినాఁడు
పరరాజులరుదెంచి పురమాక్రమింపంగ హాయంచు గడగడలాడినాఁడు,
రణముసేయలేక రాజ్యంబు గోల్పోయి పాఱి శైవతాద్రి దూఱినాఁడు,
అచటఁగూడ ననుదినాగతప్రతిరోధిబాధ్యమానుఁడగుచుఁ బనవినాఁడు, ౬౭౬
చం॥ అతఁడపు డాంధ్రఁగూడ నటు వాటవికు ల్హరియించుచున్కికిన్
మతి నెదికార్యమంచుఁ బలుమాఱులు చింతిలి నారదుండు స్వ
స్మృతిస్మృతిగోచరింప మెలమెల్లగఁ దా హరివాసరంబునం
దతనిగుఱించియేగ, నపు డమ్మనివర్యుఁడు తీర్థయాత్రలన్ ౬౭౭
ఉ॥ చేయుచు విష్ణుమందిరము చెంతకురాఁ దిలకించి యాతనిన్
డాయఁగఁబోయి మెల్ల నచటం గడుదీనతఁ గూరుచుండి కై
దోయి మొగిడ్చి యిట్టులను “ మద్భ్రాతదనీకతిరస్కృతుండనై
యీయచలంబుఁ జేరితి, నిఁకేమని చెప్పుదు సంయమీశ్వరా ! ౬౭౮
సీ॥ అస్మదీయములైన హస్త్యశ్వరథములే యిపు డాటవికులు తా మెక్కితిరుగు,
టస్మదీయహిరణ్మయామూల్యభూషలే చెంచుతలిపులు కై సేసికొనుట,
యస్మదార్జితమైన యర్థంబె ప్రస్తుతం బనుభూయమాన మంత్రాళిచేత,
నస్మదుద్వాహితలౌ స్త్రీలె యీనాఁడు దాసీలు తురకల తలియబోండ్ల,
కరినృపాలురు రాజ్యంబు నాక్రమించు చపహరింపంగ మిగిలిన యాయొకింత
వైభవముగూడ జడ నారికలతి కోఁడ కైవసంబయ్యె నల్లడి కాంద్ర కిటుల. ౬౭౯
ఉ॥ ఇట్టివిపత్పరంపరల కే గుఱియౌటకుఁ బూర్వజన్మమం
దెట్టియఘంబు సేసితినొ యీవు వచింపు మహానుభావ! ” నా
నట్టినిమీలితాత్ముఁడయి ధ్యానమొనర్చి చిరంబు దివ్యమై
నట్టికనుంగవన్ సకల మాత్మ నెఱింగి మునీంద్రుఁ డిట్లనున్. ౬౮౦
సీ॥ సకలశాస్త్రంబులుం జదివినాఁడవుగాని నా వేదియొఱుఁగని కాఁబుదున్న,
వధ్వరంబులు పెక్కు లాచరించితిగాని సంఘసంస్కారణ మల్పమువఁగడఁగ-
వనయంబు దానంబు లొనరించితివి కాని బెదరించిపంపవు బిచ్చగాండ్రఁ-
బుడమివేల్పుల భక్తిఁ బూజించితివి కాని దూఱిచూండ వెవేవొ కాఁబులఱచి-
యట్లు సిద్ధపన్న గాహ్వాయపురమునం జంద్రవంశ్యరాజచంద్రుఁడవయి
యించుకంతపాపమేన్ జేసియెఱుఁగవు పూర్వభవమునందు భూప ! నీవు” ౬౮౧

చం॥ అనవుడుభూమిపాలుఁ"డటులైనను నీజననంబునందు నా
యొనరిచియున్నయట్టియఘ మొక్కటియుం గనుపట్టదేలయి
ట్లొనరెనురాజ్యవిప్లవ మహో మునీ! యిప్పుడెఱుంగనయ్యెఁబో
ధనరహితుండు లోకమునఁ దా మను టెంతయు వ్యర్థమం చెదన్. ౬౮౨

సీ॥ ధనహీనుఁడై నయాతండు జీవించియు మృతుఁడపోయవ్వాని నెవ్వఁడడుగు ?
రాజునుగోల్పోవు రాష్ట్రి మున్నదియయ్యె లేనిదేయొకఁడొందు దాన సుఖము ?
నక్షోత్రియునకిచ్చునది యీయునియుదయాయెవనిచే నయ్యది యెన్నఁబడును ?
దక్షిణాహీనమై ధరనైనయజ్ఞంబు కానిదేయటు వేనికాను దృప్తి ?
ధనవిహీనునిచుట్టంబ త న్నదేని యడుగునను భీతిఁ బెట్టును బెడమొగంబు
వెనుక నాచేత సంతృప్తిఁవెట్టఁబడియుఁ గాంచినన్ని ప్రదవ్యేగు ఘనులభంగి- ౬౮౩

తే॥ ఉత్తమాన్వయసంభూతు యోగ్యుడైన విత్తహీనుని స్వజనంబు విడిచిపోవు-
సుందర రసాలమైనను శుష్కవృక్షమును బులుంగులు విడనాడి చనువిధమున- ౬౮౪

క॥ తనకార్యంబునుగూరిచి ధనహీనుఁడు ధనికునిల్లు తాఁ జొచ్చెడిచోఁ
గని చీదఱపడుఁగానీ మనసిచ్చి రవంతయేని మాటాడఁడహో! ౬౮౫

క॥ ఎంచఁదగులోభియైనను సంచితధనుఁడయ్యేనేని చని వానినె యా
చించుచునుందురుమనుజులు కొంచెమొ గొప్పయొ యొసంగఁ గొనునూహమెయిన్-

శా॥ "నాకుం దొల్లి టిచుట్టమీవు-వెనుకన్ నాతండ్రి నీతండ్రి య
స్తోకస్నేహముగల్గివర్తిలిరియిచ్చో నేలాకో నాపయిన్
నీకేలేదది" యంచు విత్తయుతుసాన్నిధ్యంబునంజేరి యే
మో కోలాహల మాచరింత్రు ద్విజులయ్యున్ లోకు లర్థాశతోన్- ౬౮౭

క॥ దారిద్ర్యసహితుఁడెవ్వఁడు తా రాజ్యం బెవఁడుసేయుఁ దన్మనుజుల వ్వా
న్నీరజములకుఁ బ్రకోపం బారూఢిగ నగుచునుండు నమరమునీంద్రా! ౬౮౮

ఆ॥ అధనుఁడయ్యె నెవ్వఁ డడియాసపడుచుండు నెవఁడు కుపితుఁడగు ననీశుఁడయ్యె
నా విచారశూన్యులగువార లిరువురే కాయశోషఁజేయు కళికముండ్లు. ౬౮౯

క॥ ధనలుబ్ధు లర్థరాత్రమ కనుకని సేవింత్రు వల్లకాడును గూడన్-
జనయిత్రినవదలియేనియు ననయము బహుదూరమునకు నరుగుదు రకటా! ౬౯౦

చం॥ ధనికుఁడు మూర్ఖుఁడయ్యె నగు దండిమనీషి-మనీషియయ్యె ని
ర్ధనపురుషుండు మూర్ఖుఁడగుఁ-దద్ధనవంతుకులంబు నీచమ
య్యును ఘనమౌఁ-గులీనుఁడయియుం గులహీనుఁడగున్ దరిద్రుఁ-డీ
ధనమహాప్రభావ మేమనదుగా-దానులఁజేసెడి నెంతవారలన్. ౬౯౧

—♦ లిఖితుఁడు శంఖుని చేతులు తెగఁగొట్టుట. ♦—

చం॥ అనవినినారదుండు కరుణాళుతఁ బెద్దయుఁబ్రొద్దు ధ్యానముం
బొనరిచి సాదరంబుగను " భూధవ! నీకు విశుద్ధియావిధం
బును నిజరాజ్యముం బగుడఁ బొందువిధంబును గూడఁ జెప్పెదన్.
వినుము మిల హాటకేశమన విశ్రుతమా నొకక్షేత్ర ముండెడిన్. ౧౯౨

తే॥ మూఁడుజగములవారికిం బూజ్యమైన తన్మహాక్షేత్రమునను దీర్థంబు నొకటి
యఖిలపాపవినాశకంబగుచునుండు. శంఖతీర్థంబటందురు జనులు దాని. ౧౯౩

తే॥ అచట వైశాఖమాసమం దాదివారయుక్తశుక్లాష్టమిని భాస్కరోదయమున
స్నానమొనరించుమనుజుండు సకలకష్టములను దొలఁగి యున్నతిగలిగి యొప్పు.

తే॥ అన్నిటం దుర్లభంబైన యద్యదిష్ట మభిలషించునో నిస్సంశయముగ దాని
నపుడ పడయును శంఖేశ్వరాభిధానతత్తటస్థితశివలింగదర్శనమున. ౧౯౫

ఆ॥ ఇంతదవ్వువచ్చి తీవు స్వదేశస్థశంఖతీర్థవిధమె సరిగవినవె ?
శంఖతీర్థవిధము శంఖేశ్వరునివిధ మెఱుకపఱతువినుము మహేశ! నీకు. ౧౯౬

ఉ॥ ఉండిరి శంఖుఁడున్ లిఖితుఁ డున్ననిము న్నొకతల్లిబిడ్డ లం
ద్దండులు వేదశాస్త్రములు ధాత్ర్యమరేంద్రులు. వారివ్విధమ్ములై
దండిగ నాశ్రమంబులను దౌదవులన్ రచియించి యప్పుడ
ప్డాండొరు చూచుకొంచుఁగర ముగ్రతపంబు చరించి రోప్రభూ! ౧౯౭

ఉ॥ ఆమునిజంటలో లిఖితుఁ డగ్రజుఁ డాతనిఁ జూచిరా మదిన్
బ్రేమజనింపశంఖునకుఁ బ్రీతి నొకానొకనాఁడు మెల్లఁద
ద్ధామమునొద్దకుంజని యతం డటలేమిని బ్రొద్దుపోక నా
రామవిహారమున్నలుపు చందలి పక్వఫలంబులం గనెన్. ౧౯౮

క॥ కని యగ్రజు నెడలంగలచనువున నొకకొన్ని త్రెంపుసమయంబునకున్
జనుదెంచిలిఖితుఁడచటికిఁ దను నడుగక త్రెంపినట్టితమ్మునిమీఁదన్. ౧౯౯

చం॥ అలిగి " దురాత్మ! యేమిపనిరాయిది ? పెంచుచుఁబెద్దఁజేయు నా
ఫలములఁగొన్నవాఁడవు తపఃకృయమానటు. భూమిదేవతా
కులమునఁబుట్టి చౌర్యమునకుం దలపడ్డవిధంబుఁజూచి పె
ద్దలు నిను నిందసేయు దురితంబు గడించితివీవు " నావుడున్. ౨౦౦

ఆ॥ " ఏకగర్భభవులమిరువుర, మదియుమంగాక జ్యేష్ఠుఁడవును నాకు నీవు
పృథివి నెందువిన్నఁ " బితృసమోజ్యేష్ఠ " యన్ శ్రుతి ప్రసిద్ధయగుచు శ్రుతులఁబడెడి

ఆ॥ కాన బిత్పృధనమున నూనున కధికార ముండియుండవొక్కొ పండితేంద్ర!
చౌర్యమిదియటంచు జాల గఠోరోక్తులాడుచున్న వాఁడ" వనుడు నతఁడు.

చం॥ ఇరువురఁజేలిపోక యొకయింటన యుండినయప్డు తండ్రిసొ
మ్మరయక తీయవచ్చుఁగొడు. కందున దోషము రాదు కాని యె
వ్వరికృహమందువారు స్థిరవాసముసేయుచు వేఱుపోయియుం
మరలఁ దదీయవిత్త మణుమాత్రముగొన్నను జౌర్యమయ్యెడిన్. ౨౦౩

తే॥ కొడుకుసొత్తు విభక్తుఁడై కూడఁ దండ్రి కొనునుగాకది యొక దొంగతనముగాదు
మనువు దీనికిఁ జెప్పెఁ బ్రమాణముగను శ్లోక మొక్కటి. యద్దానిఁ జూచుకొనుము.

శ్లో॥ త్రయఏవాధనాఃప్రోక్తా భార్యా దాస స్తథాసుతః
యత్తే సమధిగచ్ఛంతి. యస్యతే తస్య తద్ధనం." ౨౦౪

చం॥ అనవుడు శంఖుఁ "డియ్యది మహా తస్కరచౌర్యము యయ్యెనేని నా
యొనరిచియున్నయట్టి యలఘూగ్రతపంబు నశింపకుండఁగన్
నను మును శిక్షితుంజలుపు" నా లిఖితుండు దయానపేతుఁడై
యనుజు భుజద్వయింగ్ నఱకె నక్కట! స్వచ్ఛతగాన్ క్రేటునన్. ౨౦౬

ఆ॥ అహహ! యాబ్రాహ్మణుఁడు ఛిన్నహస్తయుగళుఁడై వ్యధంపడుచుంగూడ నదినిజాగ్ర
జుని ప్రసాదంబుగా మదిం జూచెఁగాని యన్యథాయెంచఁ. డెంతసహనమొ కనుము.

కం॥ అంతట సకలేష్టదమని యెంతయు భావించి హాటకేశ్వరమునకున్
జింతిలక పోయి యటనొక కాంతిసరఃప్రాంతమందుఁ గడునిష్ఠమెయిన్.

సీ॥ వర్షరుతువునఁ బెద్దవర్షంబులందుండి శతరుద్రములఁజాల జపమొనర్చెఁ.
జలికాలమున శీతజలములనిలుచుండి సామరుద్రముల వ్యాత్తన్ములఁజలిపె.
నలఘుగ్రీష్మమునఁ బంచాగ్నిమధ్యస్థుఁడై భవరుద్రములలెస్స బఠనసేసె.
మఖకాలమునఁ బసాపడుచుం ప్రీతిఁ బ్రాణరుద్రముల స్తోత్రంబుసలిపె.
నొగిని స్కందనూక్తయుత నీలరుద్రపారాయణంబుమిగులనాచరించెఁ
దానునిలిపినట్టి స్థాణుభాస్కరవిగ్రహములయెదుటఁజేరి యాద్విజుండు. ౨౦౯

ఆ॥ అంత వేయియేండ్ల కాదిత్యముఖరాష్ట్రమూర్తియైనయట్టి మూఁడుకనుల
సామి దర్శనంబొసంగి "శంఖా! నీదుతపము నన్నుఁ జాలఁ దనియఁజేసె. ౨౧౦

చం॥ ఎదివదిఁగోరి యాతపము నీవు చరించుచునుంటొ దాని ని
చ్చెదఁజెపు"మన్న నాద్విజుఁడు చేతులుమోడ్చి "మహేశ! నీవు స
మ్ముదమునుబొంది యిష్టవరమున్ దయసేయఁదలంచెదేని నా
కుదితనుఁలౌఁగాక మునుపుంజినభంగి మదీయహస్తముల్. ౨౧౧

శా॥ శాపై నక్కుటికంబుఁ జూపుచును గంగాజాట! యీలింగమం
దే ప్రొద్దున్ రహి సంక్రమించినను. మింకేత జ్జలాధారమున్
నా వేగం బ్రథితంబొనర్చి యొగి దీనన్ స్నాతుఁడౌ వారి దు
గ్ధప్రాపార్థంబును బెద్దఁజేసి యిడు నాచంద్రార్కమిందుంచు " నాన్.  ౭౧౨

మ॥ " ఇది వైశాఖసితాష్టమీదినము. వ న్నీనాఁడు దర్శించితే.
వదియే హేతువుగాఁగ నేతదురులింగాకారముం జొచ్చి యుం
డెద నీయొక్కదినంబు. వచ్చి యెవఁడేనిన్ భానువారాన్వితై
తదహోవస్నునఁ దావకీనఘనతీర్థంబందు సుస్నాతుఁడై  ౭౧౩

తే॥ త్వత్ప్రతిష్ఠితమన్మూర్తి తద్భక్తితోడఁ బూజింపఁగలిగినఁ దోడుతోడ
వాఁడు కుష్ఠాదిగదముల వీడి నాకు లోకమొందును. వలదిందు నీకు శంక.  ౭౧౪

కం॥ మఱియొకనాఁడేనియు నీకరణిని దృత్తీర్థజలవగాహ మదర్చా
పరిచర్యల జరిపినను తెలుఁగక చేసినయఘంబు లెల్ల నశించున్.  ౭౧౫

శా॥ ఆమాడ్కిం దెగఁగొట్టఁబడ్డ భవదీయం బైన కైదోయి యా
దా మత్ప్రోక్త సమస్తలక్షణయుతైకద్యోగసుస్నాతవా
చో ముఖ్యున్నటులుండు నెండి. యిప్పుడే చూపింతు. నిందాడియా
నామూర్తిన్ విధిచోదితంబుగ వెసన్ క్ష్మాపాల! పూజింపుమా.  ౭౧౬

శా॥ ఈ వైశాఖసితాష్టమీదినమునం దిందాడి మన్మూర్తి సం
సేవింపన్ వికలాంగులైన యొరులున్ శీఘ్రంబుగన్ ముక్తి గం
ద్రోవిప్రా! " యని యష్టమూర్తి నిజఖద్యోతస్ఫురన్మూర్తి చేఁ
దా వ్రాసిచ్చి యదృశ్యుఁడౌటయును నాతం డప్డు శుద్ధాత్మతన్.  ౭౧౭

మ॥ అభిషేకం బొనరించి యాసరసిలో నాదిత్యు నర్చించియున్
శుభమౌఁగాకని తన్నుఁదాను గలయంజూడన్ యథాపూర్వమౌ
ద్విభుజంబు ల్కనుపట్టె దేహమునఁ బృథ్వీపాల! యమ్మేదినీ
బుభుఁడు ద్రంపడి నాఁటఁగోలెఁ దప మందే చేసి ముక్తింగనెన్.  ౭౧౮

కం॥ కావున నీవును భూవర! యా వైశాఖీయమగు సితాష్టమిదినమం
దావిధమున నే స్నానము గావించి యజింపు మష్టకరవిగ్రహమున్.  ౭౧౯

కం॥ ఎవఁడియ్యది ప్రతిదినమును రవిముందఱఁగూరుచుండి రహిఁ బఠియించున్
శ్రవణింపుఁ దదన్వయసంభవులుం గుష్ఠంబుచేతఁ బడ రొక్కపుడున్. "  ౭౨౦

## —♦ తాంబూల ప్రభావము. ♦—

మ॥ అని దేవర్షి వచించుడున్ విని నృపుండౌ సిద్ధసేనుండు త
ద్ఘనవైశాఖసితాష్టమీతిథియు మార్తాండీయవారమ్ముగా

డను రాఁ గల్యమునంద పోయి కడువేడ్కఁ శంఖతీర్థంబులో
మునుకన్వైచి యిహార్చనంబు సెఱపంబో యెట్లొ కష్టంబుగన్. ౨౨౧

ఆ॥ అంతఁ దత్క్షణంబ యపగతకుష్ఠుఁడై దివ్యదేహుఁడగుచుఁ దేజరిలుచు
ధరణిపాల! యతఁడు పరమసంతోషంబు పడసె. నంతకన్న భాగ్యమున్నె.

తే॥ అవలఁ దాంబూలచర్వణప్రాప్తమైనకోలకుఁ బాచితమొనరించుకొని యతండు
స్వపితృపైతామహంబగు సకలరాజ్య మాక్రమించుచు శ్రీమంతుఁడై చెలంగె.

ఆ॥ నాగవల్లిపైనె నలిగియో చినిఁగియో చూర్ణమయియొ యున్న పర్ణములను
భక్షణంబు సేత పాపంబుగావున దానిఁగూర్చి పాచితంబు వలయు ౨౨౪

ఆ॥ శంఖతీర్థరాజసంబంధమై నట్టి దీని నీకు వినిచినాను సరిగ
నింకను నేమివినుట కిష్టంబుగలదొ వచింపవయ్య. చెప్ప సిద్ధముంటి." ౨౨౫

వ॥ అనివక్కాణించుటయు నానర్తనృపాలుండు. ౨౨౬

ఉత్సాహము.—"చూర్ణపర్ణభక్షణమున క్షోణినాథునింట వి
స్తీర్ణమైయెసంగులక్ష్మి చెదరిపోయెననుట యా
కర్ణనంబు సేయ నయ్యెఁ గరమువింత. యెటులిఁకన్
నిర్ణయించెఁబాచితంబు? నీవనుడువు మద్దియున్." ౨౨౭

వ॥ అనియడుగుటయు విశ్వామిత్రుండిట్లనియె. ౨౨౮

చం॥ "తములపుటాకు పావనము. ధర్మదమున్ విధితోడ దాని వ
క్త్రిమునఁ బ్రవేశపెట్టనగుఁ దప్పిన దోషము. గావునం బ్రయ
త్నమునను నంతొ యింతొ మును దానము సేసి యనంతరంబునన్
దములమ సేయుటొప్పును సనాతనపద్ధతి నుండువారికిన్." ౨౨౯

వ॥ అనియిట్లు నొడువుటయు వెండియు నమ్మహీవల్లభుండు. ౨౩౦

కం॥ "తాంబూలి యేప్రకారమునం బుట్టెను? దాని చర్వణంబు నశాస్త్రీ
యంబుగఁ జేసెడిచో దోషం బెటులఘటిల్లుఁ. జెపుము సంయమివర్యా!"

వ॥ అనఁబ్రశ్నించుటయు మఱియువిశ్వామిత్రుం డిట్లనియె. ౨౩౨

తే॥ "ప్రశ్నభారంబునిడితి నాపైని గాని యుత్తరంబిత్తుఁ గౌతుకంబున్న నీకుఁ
జూర్ణదళభక్షణంబునఁ బూర్ణదోష మేలప్రాప్తించునదియును నోలి వినుతు.

చం॥ అమృతముఁగూర్చి పూర్వము సురాసురు లబ్ధి మథించి. రష్ట క
వ్యముగనొనర్చి మందరము వాసుకి యోక్త్రముగానుజేసి పు
చ్ఛము నసురుల్ ముఖంబు బలి చక్కఁగఁబట్టిరి. విష్ణునాజ్ఞచేఁ
గమఠము మోమనొప్పుగా నెఁ గష్టమునోర్చి కవ్వపుంపులన్. ౨౩౪

క౦॥ తరిగొండ యంత బలిమిని గిరగిరఁ ద్రిప్పంగఁబడుడు క్షీరసముద్రాం
తరమునఁ బ్రభవించెను మొద లురుతరరత్నములుమూఁ డహోయన. మఱియున్.

సీ॥ అర్గళంబును నల్లనైనబట్టలతోడ దడమైన యదెవన్నె యొడలితోడఁ
బల్లకీబొంగుఁ బోల్పఁగఁదగు ముకుతోడఁ గడుఁ బెద్దదగు తలకాయతోడఁ
బోలుగజ్జనుబోలు పొడవైన మెడతోడ గుట్టువెక్కైడి జానపొట్టతోడ
నటుకులయంతేసి యలఁతికన్నులతోడఁ గంచిచేటలవంటి కాళ్ళతోడఁ
గప్పపండ్లతోడఁ గర మడ్గలిగించు చొకఁడు నట్టిరూపె యొలసి క్రేలఁ
గొడుకుఁగుఱ్ఱఁ బట్టుకొని మాలుబరువుననుండు వాని పెండ్ల ముట్టిపడిరి. ౨౩౬

క౦॥ తరుచుచుఁ దరుచుచు నుండిన గిరివరముఁ బరిత్యజించి గీర్వాణులు వా
శరు లంతకుమిక్కిలి యా వరరత్నములను గ్రహింపఁ బరువెత్తి రటున్. ౨౩౭

క౦॥ పరువెత్తి యచటనుండిన పరమవికారంపుఁబోడలి భార్యను భరన్
సరిగం గనుగొని వెనుకకు నరుదెంచిరి బిట్టు నవ్వ నన్యోన్యంబున్. ౨౩౮

క౦॥ పదపడి బలి సాంజలియయి యదితిజులకు మాకు ముఖ్యుఁడగు హేతువుచే
నెది మొదలు పుట్టు నయ్యది త్రిదశజ్యేష్ఠుండు పొందితీరఁగవలయున్. ౨౩౯

ఆ॥ తత్సమర్పణమునఁ దప్పక యీమంథనమున విష్టసిద్ధి యామరుమనకుఁ.
గాన నయ్యజుండు కైకొనఁగాక యీమూఁడురత్నములనుగూడ" ననుడు.

సీ॥ బలిపల్కినది చాల బాగుగానున్న దం చురరీకరించె నాయుక్తి శౌరి.
బాగుబాగని పదింబదిగఁ బ్రశంసించె రూఢి బోళాశంకరుండు దాని
నింతకం టెవిశేష మేమియుండు నటంచుఁ బురహూతుఁ డొట్టివేల్పులు పొగడిరి.
మాదొర యెంతయు మంచినోజనఁ జేసెనని నిరీక్షించి వాకొనిరి యసురు.
లంతలోన బ్రహ్మ యనభిలాషుండయ్యు వారిమాటమీఁది గౌరవమున
రత్నములనుమూఁడు రమణమై గ్రహియించె. మరల నెల్ల రబ్ధి తరిచి రంత.

సీ॥ సుడియొక్కఁ డొలయుడుఁ బొడమె వారుణి. బలి రహిఁ దానిఁగొనె బలారాతియొసఁగ
నిఁకనొక్కయావర్త మేర్పడఁ గౌస్తుభం బుదయించె. హరి దాని నెద ధరించె.
మఱియొక్కయుదకభ్రమంబురా జాబిల్లి కలిగె. నాతని శూలి తలను జేర్చె.
వేఱొక్కటంబుట్టెఁ బారిజాతము. నందనమున వేల్పులు దాని నాటుకొనిరి.
వత్సయుతకామధేను వాపయిని బుట్టి చనియె గోలోకమునకు ద్యోసరణిఁబట్టి
వైద్యరాజయినట్టి ధన్వంతరియును నమృతకలశంబు కైకొని యవల వెడలె. ౨౪౦

ఉ॥ అంతట నొక్కమాఱె సుర లాశయ తీయది మాది మాది యం
చెంతయు గుంజులాడుదు మహీశ్వర! వైష్యుఁడు దేవతాళికిన్

గాంతసుధాకళశందలఁపు క్రవ్యభుగాళికిఁ జేరఁజిక్కె. న
త్యంతము లుబ్ధులై తరిచి రంబుధి యందుఁగూడి వెండియున్. ౨౪౩

చం॥ పదపడి శుభ్రవస్త్రయుతు బంకజహస్తయునై వెలుంగు శ్రీ
యుదయమునొంది తానదని యోగ్యుఁడటంచు హరిన్ వరించె. స
మ్మదమునఁ గ్రమ్మఱం దరువ మండుచు లేచెను గాలకూట. మ
య్యదిగని దేవదానవులు హాయని దూరముపాఱి రేమనన్. ౨౪౪

ఆ॥ తీవ్రమైనదానిఁ దీవ్రపరాక్రముండగు కృశానురేతుఁ డందుకొనుచు
భక్షణంబుసేసెఁ బదపడి. యదె హేతు వతఁడు నీలకంఠుఁడై రహింప. ౨౪౫

ఉ॥ మందరవాసుకిప్రభృతి మంథనసాధనముల్ త్యజించి య
ల్లం దదనంతరంబున విలాపరిపాల! సుధానిమిత్తమై
యందఱుఁ బోరొనర్చిరి సురాసురు లొండొరు. యోషిదాకృతిన్
బొంది యుపేంద్రుఁ డప్సరుల మోహపయోనిధి ముంచె నాదటన్. ౨౪౬

ఉ॥ ఆవగలాడిముచ్చటల కగ్గలమున్ బలి మోసపోయి గో
త్రావర! పొందుసేసి యమృతంబునొసంగెను. దానిఁగొంచు నిం
ద్రావరజుండు స్వాకృతి రయంబుగ వేల్పులఁజేరి "తృప్తిగన్
ద్రావుఁడు చావులేకమని దైత్యులగెల్తు" రటంచుఁ బల్కుడున్. ౨౪౭

తే॥ వారు మంచిదియని యటు గూరుచుండి క్రోలి రమృతంబు నందఱుంగూడి వరుసఁ
బడసి యమరత్వముం ద త్ప్రభావమునను వసుధవీడులఁ బరిమార్చి రాలమందు.

ఉ॥ పానవిధిన్ విధుంతుదుఁడు బాగుగ దైవతవేషధారియై
తానును గూరుచుండి సుధ ద్రావఁగడంగుడు గుర్తుపట్టి రా
భానుఁడు చంద్రుఁ డయ్యసురుఁ. బద్మదళాక్షునకున్ వచించి. రా
థీనిధి వానిశీర్షమును ద్రెంచె సుదర్శనచక్రధారలన్. ౨౪౯

కం॥ తలదెగఁగొట్టఁగఁబడియును నిల్వాలక యమరభావమెనసిన యామె
క్కలుఁడగు రక్కసుఁ గనుగొని వలమురిదాల్పపుడు సాంత్వవాక్యంబులచేన్.

కం॥ "వదలుము రాహూ! దైత్యులఁ. బ్రిదశులకున్ సమ్మతముగఁ దేజరిలుము. ని
న్నిదిమొదలుగ గ్రహమండలిఁ బదిలముగంజేర్చి భక్తిఁ బ్రజ పూజించున్."

చం॥ అనిపచియింప వల్లెయని యాదితిసూనుల నుజ్జగించి య
ల్లన గ్రహమండలస్థుఁడయి లాభమె నష్టియె చేసికొంచు భూ
జనుల సమర్చనంబులను జాలగ్రహించుచునుండె నాతఁ. డ
య్యనిమిషు లెంతయున్ విజయమందిరపాంపతిమంథనంబునన్. ౨౫౧

తే॥ త్రావఁగా మిగిలిన యమృతమును సురలు చందనమునకుఁ గొనిపోయి నాగరాజ
కట్టుకంబము మొదటను బెట్టుటయు నహర్నిశము లవస్రావియైన దాని. ౨౫౩

ఉ॥ ప్రేటుల కుం గమండలువు భిన్నముగా నటు సంచరించెఁ దా
వాటపుఁదీవయొక్కటి. యది వైళను తద్గజబంధనంబుపై
నీటుగఁ బ్రాఁకుచుం గరము నివ్వటిలం బొడగాంచి దేవతల్
గాటు సుగంధముం గలిగి ప్రాకుచునుండు తదీయపత్రముల్. ౨౫౪

తే॥ త్రెంపి భక్షింపఁగఁ దొడఁగిరి. దేవవైద్యులైన ధన్వంతరియు దాని నరసి సరిగ
నాగబంధోద్భవంబౌట నాగవల్లియన స్వర్గస్థానమునను నిది యుంచుఁ బలికె. ౨౫౫

తే॥ తములంబయ్యె డీవిధమునఁ బ్రముఖంబులతోడ సతియు ఖాదిరపుం జూ
ర్ణముతోడఁ గూడ సంయోగమ్ముఁ జేసెనతండు దానిఁ గడుఁ జతురుండై ౨౫౬

ఆ॥ అంతఁ గొంతకాల మరుగుపై వాణికత్సరిక నామధేయధరణినాథుఁ
డింద్రుఁ గూర్చి తపము నెంతయుఁ గావింప మెచ్చి యచటికపుడు వచ్చియతఁడు

తే॥ "ఓయి ధరణీశ! నీచేయు నుగ్రతపము వలన మిక్కిలి సంతోష మొలసె నాకు.
నీదు మదిఁ గోరు కోరిక యేదొ చెప్పు మిచ్చిపోయెద" ననపుడు నెలమి వొంది ౨౫౭

కం॥ ఆ రాజన్యుం డిట్లను. "గోరాజా! మెచ్చి నాదు కోరిక యిడదేన్
సారెకు నీలోకమునకు నే రా సువిమాన మొకటి యీఁగదవయ్యా." ౨౫౮

కం॥ అనియిట్లు వేడుకొనుటయు మనసారఁ గవేగమైన మహితవిమానం
బును గరుణ నొసఁగె నింద్రుఁడు. దినదిన మదియెక్కి యతఁడు త్రిమ్మరఁగలిగెన్.

కం॥ చనుదెంచి త్రిదివమునకుం దను దర్శించి చనునపుడు దైవతవిభుఁడా
యనకుం దాంబూలంబిడి యనిపెను వాఁ డతనివీఁడి యక్కాటికమునన్. ౨౬౦

ఆ॥ పరమహర్షమునను భక్షింప నద్దాని వృద్ధనకును గామవృద్ధియయ్యె.
నంత నింద్రునడిగి యవనికిం గొంపోయి నాటెఁ దనదుతోఁట నాగవల్లి. ౨౬౨

ఆ॥ అది క్రమక్రమముగ నఖిలదేశంబుల వ్యాప్తమగుడు దాని భక్షణమున
నఖిలజనులుగూడ నయిరి కామాత్ములు. యజనయాజనాదు లంతరించె. ౨౬౩

కం॥ అంతం గ్రతుభుక్పంక్తి చింతిలుచుం దమ్మిచూలి చెంతకుఁ జని యా
వింత నివేదించిరి. యమ్మ్యాతరమున నే యతండు యజనార్థముగన్ ౨౬౪

తే॥ పుష్కరక్షేత్రమునకుఁ దాఁ బోవుటయు దరిద్రదేవత కడు దేవురింపుతోడ
నతనికడకేగి యభివాదమాచరించి యెంతయును వినయంబుతో నిట్టులనియె.

తే॥ "బ్రాహ్మణులయిండ్లలోనుండి పనవుమంటిఁ గాన ధనికులగృహములం గాఁపురంబు
నేయ నొక స్థానముఁ జూపవే. యుచటను ద్రుప్తితోడ వసింతు నో దేవ! నేను"

కం॥ అనియిటు వ్రాఁకమ్చుటయును వనజాసనుఁ డాత్మఁ గొంతవడి ధ్యానంబున్
బొనరిచి దరిద్రదేవతఁ గనుగొని మోదాప్తుఁ డగుచుఁ గడ కిట్లనియెన్. ౨౬౭

సీ॥ "నలుగురుముడిచినట్టి నాగవల్లిదళాలు స్థానంబులగునీకు జడియకోయి.
పర్ణాగ్రములు నీకు భార్యలు నీకును విడుదులగును దుఃఖపడకుమోయి.
తొడిమలన్నియును నీదు కొడుకునవును నీకు నెలవులయ్యెడు మదిం గలఁగకోయి.
రాత్రివేళల ఖాదిరంబగుపొడి మీకు ముగురకుం డెంకియౌ వగవకోయి.
యేరుపఱచినాఁడ నీవాలిగింటిని మీకుఁగా దరిద్ర! వీఁక నేఁగి
భాగ్యవర్ధ్యహానులు ప్రభువులకృములుం జొచ్చి ఛిద్రములను జూచుకొనుము"

కం॥ అనియాగతివచియించెను జననాథ! దరిద్రుఁగూర్చి చతురాస్యుఁడు. దీ
ని నెఱుంగక యా భూపతి యొనరిచెఁ దాంబూల మవిధి నొగి సిరి తొలఁగెన్.

కం॥ తాదృగ్విధతాంబూలాస్వాదనమునసైన దోసఁగు సకలంబును నా
భూదయితుఁడు పాచితమునఁ దాఁ దొలఁగంద్రోసికొనియె ధారుణినాథా!

ఆ॥ పర్వకాలమునను బండితబ్రాహ్మణుఁ బిలిచి యతని పాదములను గడిగి
కట్టఁ గప్ప రెండు పుట్టంబు లర్పించి యర్ఘ్యభంగిఁ బూజ లాచరించి ౨౭౧

ఆ॥ స్వర్ణపర్ణములను స్వచ్ఛమౌ ముత్తెంపుఁ జూర్ణములఁది చాల శుభ్రమైన
రౌప్యఖాదిరమున రమ్యమై దూర్యపుం గ్రముకములను విడెముగట్టి దాని. ౨౭౨

శ్లో॥ యన్మయాభక్షితం పూర్వం వృంతం పత్రసముద్భవం
చూర్ణపత్రం తథైవాన్య ద్రాత్రౌ ఖాదిరమేవచ
తస్యపాపస్య శుద్ధ్యర్థం తాంబూలం ప్రతిగృహ్యతాం. ౨౭౩

కం॥ అనుమంత్రంబున నవ్విప్రునకు సమర్పింపవలయు ముదమున. విప్రుం
డున్ను వక్ష్యమాణమంత్రంబును నుడివి గ్రహింపవలయు భూవర! దానిన్. ౨౭౪

శ్లో॥ యజమానేనతాస్థాయ సర్వపాపవిశుద్ధయే
అజ్ఞానాత్ జ్ఞానతోవాపి యత్తాంబూలం ప్రభక్షితం ౨౭౪
భక్షయిష్యసి యచ్చాన్య త్కాదాచిత్కం ప్రసాదనాత్
తస్యదోషో నతేభావీ మమవాక్యాదసంశయం. ౨౭౫

తే॥ ఈవిధంబునఁ దాంబూల మిచ్చె నేని చనుఁ గుతాంబూలభక్షణజనితదోష
వట్లువవరించి నాఁడుఁ దేవనిపతికిఁ బొచ్చిశంబున జేయించి పావె నఘము. ౨౭౬

తీర్థపుం బ్రభావము గీర్తించెద నా మహాత్మ్యుండు ఖననసాధనం బెద్దియు లేకుండఁ దన చేతిమీఁదుగా నొక కుండంబు ద్రవ్వి ధ్యానబలంబునం బాతాళంబునుండి గంగను రప్పించి దానఁ బూరించె. భూతలంబున కానీతంబగు తద్గంగాజలంబు నిర్మలంబును స్వాదువును నై స్నాతుల సర్వపాపంబులును హరింపఁగలిగియున్న యది. గామునీంద్రుఁ డచట నాదిత్యుఁ బ్రతిష్ఠించియున్నవాఁడు. మాఘశుక్లసప్తమీభానువాసర మాత్రా దంబునఁ గ్రుంకి యయ్యాదిత్యున కభివాదమాచరింప నఖిలదుష్కృతంబులును నఖిలాఘంబు లును నశించు. దాని పశ్చిమోత్తరదిగ్భాగంబున ధన్వంతరిచే నిర్మింపఁబడి సర్వరోగ నివారకంబగుచు నొక నడబావియుండెఁ. దొల్లి యచట ధన్వంతరి తపంబొనరింపఁ బెద్ద కాలంబునకు భాస్కరుండు ప్రత్యక్షమై వరమడుగుమన నతండు. ౭౮౯

కం॥ "ఏతత్కుండంబున సుస్నాతుండగునట్టిజనుని సకలామయముల్
ధూతములు కావలయు ఖద్యోతా! నాశితసమస్తదురితవ్రాతా!" ౭౯౦

వ॥ అని ప్రార్థించుటయు సూర్యభగవానుం డిట్లనియె. ౭౯౧

ఆ॥ "ఎంతయుం బ్రశస్త మీ మాఘశుక్లసప్తమి మదీయవాసరమునఁ గూడి.
యిట్టిదినమునందు నే నుదయించుచో నిందుమునుఁగువాఁడు పొందు శుభము.

తే॥ సామయుండైన నగును నిరామయుఁడు. నిరామయుండైనఁ బడయు నిష్టార్థములను
మొగి నిహాముత్రఫలభోగమున విరాగి యచట స్నాతుండుగా మోక్షమే ఘటించు."

వ॥ అనియిట్లుకీర్తించి యర్యముం డంతర్ధానంబుఁజెందుటయు ధన్వంతరి సంత సించి స్వస్థానంబునకుఁజనియె. నంతఁ గొంతకాలంబునకు ౭౯౪

సీ॥ శ్రీమదయోధ్యాపురీపరిపాలకుం డున్నరశ్యున్వవాయోద్భవుండు
నడిగిన లేదనఁటువంటి నెఱదాత కృతమునకుం బ్రతికృతివిధాత
యర్థదేహులఁగాక యన్యులఁ గన్నెత్తియైనఁ జూడని ధీరుఁ డధికశూరుఁ
డత్యంతతేజస్వి యరినిషూదనుఁడునౌ రత్నాఢ్యుఁడను మేటిరాజొకండు
పూర్వకర్మవశత భూరికుష్ఠవ్యాధి కగ్గమగుచు దాని నపనయింపఁ
దిరిగె మజ్జగములు. తినె నౌషధంబులు-దానములను దనిపె ధరణిసురుల ౭౯౫

వ॥ కాని యెన్నిచేసినను నెక్కుడయ్యె యాబాధ్య మతని క్షీణింపఁజేయుటయు విరక్తుఁడై రాజ్యభారంబు పుత్రుపైఁబెట్టి చెప్పవలసినబుద్ధులు సెప్పి స్నేహితుల కప్ప గించి దేవతలం బూజించి భార్యలను బంధువులును జెలికాండ్రును సేవకులును వలదు వలదని వారించుచున్నను వినక యగ్నిం బ్రవేశింపనున్న సమయమం దొక దివ్యతేజస్వి బ్రాహ్మణుం డొకఁడేగుదెంచి యత్యంతవిషాదమందున్న యాపురంబు నవలోకించి యాశ్చర్యపడి యందొకజను నాహ్వానించి ౭౯౬

కం॥ "పెద్దలు పిన్నలుగూడం దద్దయు వాపోవ మదముదక్క యనూనా
పద్దతనున్నది యీపుర. మిద్దియొకత మిటులననికి కెఱుఁగం జెపుమా." ౨౯౭

వ॥ అనియడుగుటయు నతం డిట్లనియె. ౨౯౮

ఉ॥ "ఈపురమేలునట్టిదొర యెంతయుఁ గుష్ఠముతోడ సంయుతుం
డై పడలేక బాధ జ్వలదగ్నిఁ బ్రవేశము సేయుచున్న వాఁ
డో పథికా! యతండు సుగుణోదధి. యట్టిని వీడియుండలే
కీపగిదిన్ జనంబు తపియించెడిఁ. జెల్లుటనిక్క మండటన్." ౨౯౯

వ॥ అనినవిని యా కార్పటికుండు ద్వరితంబ రాజుపాలికింజని. ౩౦౦

చం॥ "నృప! సకలామయంబులను నిర్వృతిసేసెడి తీర్థముండఁగా
నిపు డొక కుష్ఠకాద్యమున కెంతయుఁ జింతిలి పావకంబునన్
వపువు దహింపఁజేయకుము. నాయొడలున్ భవదంగమట్లె కా
నపుడట స్నానముఁ సలిపి యైతినిటు లక్ష్మిత దివ్యదేహుఁడన్. ౩౦౧

తే॥ సప్తమీభానువారము సవిత్రుదయమందుఁ బోయి యజ్ఞాగ్రస్తుఁ డచట స్నాన
మాచరించిన నీరోగుఁడగును నపుడ. యట్లు పాపవినిర్ముక్తుఁ డగును మఱియు"

వ॥ అనిచెప్పుటయు రాజిట్లనియె. ౩౦౩

సావిత్రి॥ "ఏదేశంబందుండెం దాదృక్తీర్థశ్రేష్ఠం.
బోదివ్యాంగా! నాకీ వాదేశించి మ్మయ్యా" ౩౦౪

వ॥ అనియడుగుటయు మఱియు నాకార్పటికుండు. ౩౦౫

చం॥ "కలదిల సాగరాఖ్యఁ గడు ఖ్యాతము క్షేత్రము. కుష్ఠరోగసం
కలితుఁడనై తదంతర మొకానొక కాలమునందుఁ దీర్థయా
త్రల నొనరించుచుం జనుచుఁ దత్స్థలవర్తి తపస్వియొక్కఁ డి
బ్బలురుజపొందిన నన్ను బాగుగఁ జూచి కృపావిశిష్టుఁడై. ౩౦౬

ఆ॥ 'జలములనుశేయించు చక్రికిఁ బశ్చిమోత్తరదిశం జెలంగుఁ గరము పుణ్య
మైన తీర్థమొకటి యనఘవిశ్వామిత్రమునివినిర్మితంబు మోక్షదంబు. ౩౦౭

ఆ॥ చనుము మాఘశుక్లసప్తమీభానువాసరమునందు నీవు సరిగ నటకుఁ
జని యినోదయమున స్నానంబు గావింపు. నీదు కుష్ఠబాధ్య మేదునంత.' ౩౦౮

చం॥ అనవిని యాదివారయుతమాఘ వల సప్తమి నేను దత్స్థలం
బున కతిభక్తితోడఁ జని పుణ్యతమంబగు తద్గృదంబునన్
మునిఁగి వినిర్గతుండనయి మూర్తి కనుంగొన నీదృశంబుగన్
గనఁబడితిన్. యథార్థమును క్ష్మాపరిపాలక! నీకుఁ జెప్పితిన్. ౩౦౯

ఆ॥ అట్లుగాన నీవు నరిగి యాసప్తమీభానువాసరంపు భాస్కరోద
యమున నచటఁ దీర్థమాడుము. నీవ్యాధియడఁగుఁ. బాతకంబు నంతమొందు ”

వ॥ అనినవిని యాక్షణంబ రత్నాక్షుఁ డాకాశికావడివాని వెంటం జని మాఘశుద్ధ సప్తమీభానువాసరంబున విశ్వామిత్రతీర్థమందుఁ గృతావగాహుండై హస్తంబున విడువం బడి సంతసంబునం బొంగుచుఁ గార్పటికునకు మూఁడుకోట్లమాడలర్పించి,

ఉ॥ త్సాహము:—“భవదనుగ్రహమునఁ జేసి భయదమైనయట్టియీ
తెవులువోయెఁగానఁ బొమ్ము తీర్థవాహ! నేనిటఁ
దవిలి తపము సేసికొందు దారతోడఁగూడి—యి
య్యవనికేశ విభుండు తనయుఁ డతఁడు దక్షుఁ డోమఁగన్.” ౮౧౩

వ॥ అనివచించి యాయనను సేవకులను నిండ్లకుఁబనిచి యాశ్రమంబుగట్టించికొని కళత్రసహితంబుగా నచట వసించి సిద్ధిం బొందె. నతనిపేర వెలసినతీర్థంబు సర్వవ్యాధిహరంబును సకలపాతకనాశకంబును నయ్యె. దేవదేవుఁడగు దివాకరుం డతనిచే నటఁ బ్రతిష్ఠితుండై రత్నాదిత్యనామంబునఁ బ్రసిద్ధికివచ్చె. సప్తమీభానువాసరంబునం దాతీర్థంబునం గ్రుంకి యయ్యాదిత్యు దర్శించినఁ బాపంబులనుండి తొలఁగి సూర్యలోకంబునకుఁ జను. మఱియొక క్షేత్రం బచట వర్తిల్లెడి. తత్ప్రదేశంబున గ్రామ్యుండగు నొకజనుండు కుష్ఠరోగంబున బాధపడుచుండియుఁ బశువులంగాచి జీవించుచు నొకనాఁడు కొండక్రిందిభాగమం దప్పనులమేపుచుండ నందొక్కటి తృణలోభంబున యూథంబువిడిచి చని సప్తమీరవివాసరంబున నమ్మడుఁగునం బడుటయు నదియెఱుంగక వాఁడు తక్కుపసులం దోలుకొని సాయంసమయమం దింటికిఁజనఁ దృవదుస్వామి వానిపాలికింబోయి గద్దించుచు

కం॥ “రాలే దేలర ఖల! యీవేళను మా పాడియావు వేశ్మంబునకున్
దోలుకొనిరమ్ము. దానిని మాలోఁగిలిఁ జేర్పకున్న మననీ నిఁకనిన్.” ౮౧౪

వ॥ అనినవిని వాఁడు భయపడి యాక్షణమ పగ లది తిరిగిన మార్గంబువట్టిపోయి రాత్రివేళయగుట గాఢాంధకారంబునఁ బెనుగోతింబడి కొట్టుకొనుచున్న దాని యఱపు దూరమున వినరా నందు దూఁకి పంకంబునుండి పైకిలాగి మెలమెల్ల నతనియింటికిం దోలుకొనిపోయి యప్పగించి స్వగృహంబునకుఁజని పండుకొని తెల్లవారినపిదప లేచి స్వశరీరంబుఁ జూచుకొని కుష్ఠవినిర్ముక్తమై మంచిచాయనుండుట కాశ్చర్యపడి

కం॥ “ఏమిది యాకస్మికముగ నామయ మెడలినది. నిశ్చయంబుగ నిది వి
శ్వామిత్రతీర్థమహిమము. నే మునిఁగితి దానఁ బశువు నెమకుచు రాత్రిన్. ౮౧౫

వ॥ అనివిచారించి యపగతకండూతియై యధిక తేజంబునం బొదలు నప్పశుపాలకుండు మరల నాతీర్థంబున కరిగి యయ్యటవీమధ్యస్థితుండగు నాదిత్యు ధ్యానించుచు నందుఁ దపంబుండి పరమసిద్ధిం బ్రాపించె. గాన సర్వప్రయత్నములచేతను నందుఁ దీర్థమాడి భాస్కరుం బూజించునది. యిక్కలి కాలంబునఁగూడ సప్తమీభానువాసరంబునఁ దత్పుణ్యతీర్థజలస్నానంబున శుచియై యెవఁ డాదేవు భక్తిచేఁ బూజించు వాఁడు విముక్తపాతకుండగుఁ. దదగ్రంబునం గూరుచుండి యెనిమిది వేలగాయత్రీమంత్రంబు జపించిన నీరోగుండును నిష్కల్మషుండును నగుఁ దదుద్దేశంబుతో శ్రద్ధమై నెవఁడు గోదానంబొనరించు వానివంశజుఁడుసహితము వ్యాధిచే స్పృశింపఁబడఁడు. కుష్ఠవ్యాధిచేఁ గుమిలికుమిలి పూర్వ మొకభూసురుం డందు రక్తచందనంబున నాదిత్య ప్రతిమ యమర్చి యర్చించుటయు వేయియేండ్లకు దేవుండు ప్రీతుండై దర్శనంబిచ్చి వరంబడుగుమన నతం డిట్లనియె. ౮౧౭

తే॥ "సంతసించితి వేని యోసవిత! నాదు కుష్ఠరోగము హరియించి కూర్పుమయ్య
యట్లు కాకుండ స్వర్గరాజ్యము నిడినను మన్మనఃప్రీతిసేయ దీమాట నిజము" ౮౧౮

వ॥ అనియిట్లు వాక్రుచ్చుటయు సూర్యభగవానుండు ౮౧౯

తే॥ "సప్తమీభానువారము సరిగనీవు పావనహ్రదమున నాడి పండ్లు చేతఁ
బట్టుకొని నూటయెనుబదిపదులు నాకు వలగొనుమ కుష్ఠజాడ్యంబు వదలిపోవు.

కం॥ భూతలగతుఁ డెవఁడైనను నేతద్వ్రతముం జరింప నెల్లగదంబుల్
భూతంబులగునువానికి. నాతర్వాతను లభించు నస్మత్పదమున్." ౮౨౧

వ॥ అనినవిని యాబ్రాహ్మణుం డట్లాచరించి నష్టకుష్ఠుండును నవ్యకాంతియుతుండును నయ్యె. నట్టియాతని నవలోకించి వెండియు సూర్యభగవానుండు

పంక్తి॥ "ఏమిప్రియంబు న్నేమటిచేతున్ నీమత మేదయ్యా మహిదేవా!" ౮౨౨

వ॥ అనిప్రశ్నించుటయు బ్రాహ్మణుం డిట్లనియె. ౮౨౩

పంక్తి॥ "ఎప్పటికిన్ని ప్పదమందే తప్పకయుండన్ మెప్పగు దేవా!"

వ॥ అనియిట్లునొడువుటయు మరల సూర్యభగవానుఁడు ౮౨౪

మధుమతి॥ "మహిసురేంద్ర! యిఁకఁ రహివసింతు నిటుక.
గుహరవాహుఁడు నా విహితసంజ్ఞుఁడవై." ౮౨౫

వ॥ అని తదిష్టవరంబిచ్చి యంతర్ధానంబునొందె. నంతఁ గొంతకాలంబునకు శ్రీకృష్ణుండు సాంబుఁగనుటయూ నతఁడు రాజమార్గంబునఁ జనుచోఁ బురస్త్రీలు మోహించి గవాక్షంబులెక్కి కాంచుచుండెడివారు. ౮౨౬

## —• సాంబోపాఖ్యానము •—

సీ॥ పగ మలందినయట్టి మృగమదంబులతోనె పరువెత్తిపోయెడిఁ దరుణియొకర్త
యొకకంటి కిడిన మేల్రకపుఁగాటుకతోనె వడివడినడతెంచుఁ బడఁతియొకర్త
కలయదువ్వనియట్టి తలవెండ్రుకలతోన వేవేగనరుదెంచు వెలఁదియొకర్త
స్తన్యమిచ్చుచుఁగూడ సంత్యక్తబాలయై శీఘ్రంబ చనుదెంచుఁ జెలియయొకర్త
యొక్కకాలి నుపానహ మెక్కఁదొడిగి తక్కుకాలునఁ బాదుకం ద్రొక్కుకొనుచు
జనును దొరతొర నొర్తుక చంటిబిడ్డ లేడ్వ నత్తలు మామ లెంతేని యఱవ.

సీ॥ కదలక మెదల కొక్కర్తుక నిలుచుండుఁ జిత్రంబునందలి స్త్రీవిధమున.
వేఁడినిట్టూర్పులు విడుచు నొక్కర్తుక బుసకొట్టుచును బిట్టు భుజగమట్లు.
పడు గవాక్షమునుండి పడఁతి యొక్కర్తుక క్షితిమీఁద నెంతయుం జేష్టలుడిగి.
చెప్పు నొకర్తుక చెలికత్తెతోడ నాతనిఁగూడినదియె తా ధన్యయనుచు.
నట్లు నవమన్మథాకారుఁడైన సాంబు రూపరేఖావిలాసంబు లాపురాంగ
నలు గనుంగొని మోహ మగ్గలముగాఁగఁ బరవశతఁజెంది రోనిరాబారులార!

సీ॥ పీతాంబరునిచేతఁ బెండ్లాడఁబడి సపత్నీమాతలైనట్టి కామినులును
నవ్వారియందు శ్రీహరివలనం గల్గి యక్కసెల్లెండ్రైన యంగనలును
నన్నదమ్ములచేత నగ్నిసాక్షికముగాఁ బరిణీతలైనట్టి భామినులును
గులగురులైనట్టి రుంభినీదేవుల పాణిగృహీతలౌ పతివ్రతలును
మోహ మాఁగలేక యాహాయటంచు నాయదుకుమారుఁజూడ నరుగుచుండి,
రదియటుండనిండు. పెదపెద్దలౌ పూరుషులె భ్రమించి రతనిఁ జూచిమిగుల. ౭౩౦

వ॥ అట్లు భ్రమించి వితాకుపడువారును నర్థాపేక్షలేకయే యతని సేవింపనెంచువారును నతనియాననంబు నవలోకింపఁగోరువారును సౌందర్యంబు వర్ణించువారును నై వర్తించుచుండిరి. అంతఁ గొంతవడికి క్షపాసమయంబున నందినియను నతని సవతితల్లి తత్పత్నీవేషంబు వేసికొని తచ్ఛయ్యం బరుండియుండుటయు నతండు రతిక్రియలం బరితృప్తినొంది తచ్చేష్టితంబు లసమానాస్పదంబులుగా ౭౩౧

తే॥ "నాదు ప్రాణాలకన్న నెంతయుఁ బ్రియయగు నంగరాజతనూజ యీయదియె యింగి
రతివమర్కృతు లెఱుఁగ. దౌర! గణికలవు నిట్టి రతిచాకచక్యంబు పట్టువడను"

వ॥ అని వికల్పించి దీపంబు దెచ్చి విలోకించి నందినింగాఁ దెలిసికొని ౭౩౨

తే॥ "అఖిలజనులు తమతమయని యాననమున నుమియ యమభటులు లగ్గలం బుగ్రముగను
దుర్గతిశతంబునం బడఁద్రోయ నకట! యేమిపనిసేసినావె యిసీ సుశీల!" ౨౩౪

వ॥ అని గర్హించుటయు నాబిడ తత్క్షణంబ లేచిపోయె. నంత నతం డార్తనాదంబునం బ్రలపించి కూర్కు సెందక పశ్చాత్తాపమంబుగా రాత్రిశేషంబు వెళ్ళించి సూర్యోదయంబున నావశ్యకకార్యంబులుసహిత పవలఁద్రోసి ధర్మశాస్త్రవిదుం బిలువఁబంచి ౨౩౫

తే॥ "అక్క సెల్లెండ్రతోడను నంబతోడఁ గన్న కూఁతుండ్రతోడను గలసినతని
కెవ్విధము శుద్ధియగునో వాక్రువ్వవయ్య ధర్మశాస్త్రంబులన్ని యముఁ దగఁబఠించి."

వ॥ అనిపలుకుటయుఁ దద్బ్రాహ్మణుం డిట్లనియె. ౨౩౬

కం॥ "పరనారీసంభోగము జరిపినపురుషులకు సర్వసాధారణమై
యొరలెడిఁ బ్రాయశ్చిత్తము ధరణీవర! వర్ణతారతమ్యముతోడన్. ౨౩౭

తే॥ అప్ప సెల్లెండ్రతోడను వదలతోడఁ గన్న కూఁతుండ్రతోడను గలసినతఁడు
తింగినింగాక వేఱొక్కతీరుగా విశుద్ధిఁగాంచుట యెటుఁగూడఁ జూచియెఱుఁగ.

తే॥ ధర్మశాస్త్రంబులందు నేతద్వినిర్ణయంబునకు భిన్నమండ. దియ్యది నిజంబు.
స్మృతుల నన్నింటిఁ బలుమఱుం దిరుగవైచియే వచించితి నివ్విధ మేను నీకు.

తే॥ పాచితంబునుగూరిచి ప్రశ్నసేయఁబడి యథేచ్ఛగ నన్యథా నుడువువాఁడు
పాపమునఁ దాను భాగముం బంచుకొనుచుఁ గర్తవోలెను బడును దుర్గతుల నన్న!"

కం॥ తనలోఁతుంగోతిలోనం గొనకొని నిలుచుండి యెండుగోమయచూర్ణం
బున నాగళముం బోయించి నిజాంఘ్రిప్రాంతమందు నిప్పుంచఁగనౌ. ౨౪౨

ఉ॥ కాలుచుకాంచుచుచ్చునది గాత్రము మెల్లగ. నైన దానికిన్
దాలిమిఁబూని యించుకయుఁ దాఁ జలియింపక యేడ్వ కారమా
లోలుని ధ్యాసతోడఁ బరలోకముఁజేరిన శుద్ధగాత్రుఁడై
యొలి నఘంబువాయును విభూ! యిదె తింగినినాఁబడున్ ధరన్" ౨౪౩

వ॥ అనినవిని సాంబుండు తింగిని సాధించుటకు నిశ్చయించి వాను దేవుఁజేరంబోయి

మ॥ "జనకా! నీప్రియభార్య నందిని ధృతాస్మద్దార నేపథ్యయై
వను వంచించె నఘాత్మురాలు. మదిలోనన్ భార్యగా నెంచి యా
కెను నేఁ జీఁకటియింటఁ గూడితిని. దత్కృత్యంబు లీక్షించుచు పై
ననుమానంపడి గుర్తెఱింగితి. నిసీయం చావలంద్రోసితిన్. ౨౪౪

శా॥ వాఁటుంగోలెను గుమ్మమేరుపడి యెన్నా దేహమం దంత ని
వ్వీటన్ వర్తిలు ధర్మశాస్త్రవిదులం బిల్పించి ప్రశ్నింప నా
మేటుల్ "తెంగినినాచరించుకొను, మామీఁదన్ విశుద్ధుండవై
దాఁటంగల్గు దఘాబ్ధి" యంచనిరి తాతా! దాని సాధించెదన్. ౨౪౬

ఉ॥ నే నెదిరేని కూడనిపనిం బొనరించిన బాల్యమందునన్
దాని క్షమించి వేగముగఁ దండ్రి! యనుజ్ఞ యొసంగు. మే నెడన్
దీనత నన్నుఁ గూర్చి పరిదేవనసేయకు మదంబ. యామె దుః
ఖానల మార్పుమీవు సదుదాహరణంబులఁ జెప్పి మెప్పుగన్" ౨౪౭

వ॥ అనినవిని శ్రీకృష్ణుండు గద్గదస్వరంబున నతని కిట్లనియె. ౨౪౮

ఉ॥ "ఈపని కాముకుండవయి యీవొనరింప. వెతెంగిచేయ వ
ప్పా! పొరపాటునన్ జరిగె. నందున నీకొల యల్పమయ్యెడిన్.
శ్మాపతి యగ్రదండనము సల్పకయున్న నెఱింగిచేయు నా
పాపముమాత్ర మగ్గలము. పాచిత మాచరితవ్య మెంతయున్. ౨౪౯

ఆ॥ కాన నీదు సమ్మగద మేది సంశుద్ధి యొనరఁ బ్రాచితంబు నాచ్చరింతు.
దానమును వచింతుఁ దనయ! యాకర్ణించి యవ్విధమునఁ జేయుమా రయంబ.

ఆ॥ పాపములకుఁ దగినభంగిఁ బ్రాయశ్చిత్తములు విధింపఁబడియె మునులచేత
నవి నిషిద్ధమయ్యె సాపేక్షనిరపేక్ష భేదములనుబట్టి బిడ్డ! మరల. ౨౫౧

కం॥ కావునఁ బ్రాయశ్చిత్తము కావింపు మదుక్తరీతిఁ. గలఁ డిహపరసౌ
ఖ్యావహుఁడై మాతాండుఁడు శ్రీవిశ్వామిత్రమౌనిచే స్థాపితుఁడై. ౨౫౨

ఆ॥ హాటకేశ్వరమున వలరెడి యాదేవు మాఘశుక్లపక్షమధ్యగమగు
సప్తమి రవివారసహితముం బిత్ర్యదేవతాకధంబు నగుచుఁ దనరుతఱిని. ౨౫౩

ఆ॥ ప్రొద్దువొడువ శ్రద్ధఁ బోయి యష్టోత్తరశతఫలములఁగొంచు సరిగ నొక్క
టొకటి పళ్ళెరమున నుంచుచు వలగొను మన్ని పరులు, నమ్మ మవుడ యెడలు.

తే॥ రోగమును నొప్పి లేని పూరుషుఁడు పోయి యెన్నిసారులువలగొన నన్నియాగము
లాదివాకరులోకమం దధివసించు. నేమనచియింతునీకుఁ దత్స్వామిమహిమ.

ఆ॥ ఆదివాసరమున నాదేవునకుఁ బ్రదక్షిణము లాచరించి కేలుమోడ్చి
వాఁడుగూడ రోగవర్జితుఁడగుఁగానఁ గొలువు మధికభక్తిఁ గొడుక! యతని.

ఆ॥ కుష్ఠమెడలు, నీదు కొలవాయు. దివ్యదేహుఁడవు నగుదు, దుఃఖపడకు కొడుక!
హాటకేశ్వరమున నా మహారాశ్రయస్వామియుండియుండ నేమిభయము." ౨౫౮

వ॥ అనినవిని యర్బుదాచలమార్గంబున హాటకేశ్వరంబున కరుగుటకు నిశ్చ
యించి సాంబుండు శుభదినంబున హస్త్యశ్వరథపదాతిసహితంబుగాఁ బ్రయాణంబు

— సాంబుని దీర్థయాత్రకుఁ బంపుచుఁ గృష్ణాదులు దుఃఖించుట. —

సీ॥ కొడుకా! యటంచు వాకొని యేడ్చుచుం బ్రేమఁ దరలిరి తోడ్తోడఁ దల్లులెల్ల
రరిగెఁదా వెనువెంట నశ్రుపూర్ణాక్షుఁడై కుందుచు దేవకీనందనుండు,
దిగులువెల్వఁగఁ జాలు దీనాననంబుతో ననుగమించెను దమ్ము లలరువిల్తుఁ
డక్షీలకంకమై నదలించు చందంబుఁ గదియనేగెఁ గుమారుఁ గానుపాలుఁ
డట్లు చాలదూర మరుగుచో జాతని ప్రసువు జాంబవతి పరరివిధమున
విధిని దూటిదూటి విలపించుచుం బట్టి బిట్టు కౌఁగలించి యిట్టులనియె. ౨౫౯

ఆ॥ "హా! హతాశనైతి - దేహంబు వాసితి - మందభాగ్యనైతి మఱియు నేను.
ఏకపుత్రనైన నాకీవిపద్దశ యనుభవింపవలసె నక్కటకట!" ౨౬౦

వ॥ అని యిట్లు విలపించు నాయమం గని వాసుదేవుండు ౨౬౧

కం॥ "తల విరియఁబోసికొని కనుకొలఁకుల నీరంబు నింపి కుయ్యిడెదేమే
లలిఁ బయనమైన సుతునకు జలజాక్షి! యమంగళంబు సంపాదింపన్. ౨౬౨

తే॥ కుష్ఠమును బాపుకొని నీదుకొడుకు మరలఁ దీర్థయాత్రాఫలంబును దీసికొనుచు
వచ్చు నీయంతికమున కోవనజగంధి! యేలయేడ్చెద వూఱకుండు మింక నీవు"

వ॥ అని చెప్పుచుండుటయు యానంబునుండి డిగ్గి సాంబుండు త్వరితంబుగం
దల్లికడ కరిగి యొరఁగి నవ్వుచు ౨౬౪

ఆ॥ "తీర్థయాత్రఁ జేసి తిరిగి శీఘ్రంబుగా నరుగుదెంచువాఁడ నంబ! నేను.
అస్మదర్థమునను వ్యర్థంబుగా నీవు ఖేదపడకుమమ్మ కేలుమోడ్తు" ౨౬౫

వ॥ అని వాక్రుచ్చుటయు జాంబవతి ౨౬౬

కం॥ "పులులుం బిశాచములు నిను బలిమిని బాధింపకుండఁ బవలును రేయున్
బలుపూనికఁ బాలించుత వల వనదేవతలు గాఢమగు ననుకంపన్. ౨౬౭

సీ॥ తావకశీర్షంబు గోవిందుఁ డోముత - మధుసూదనుఁడు గ్రీవ మనుచుఁ గాతఁ.
గేలుదోయిని హృషీకేశుండు కాచుత - దైత్యనాశనుఁడు వ్యాత్థ్వలి నిలుచుతఁ -
బుండరీకాక్షుండు పోషించుతన్ గర్భ - మరయుత శ్రీగదాధరుఁడు కటిని -
జానువుల్ కృష్ణుండు తాను రక్షించుత - ధరణీధరుం డేలుతం బదంబు"
లని కరంబున స్పృశియించి యంగములను గ్రుచ్చికౌఁగిటఁ శిరము మూర్కొని కరంబు
పనిచి తనయుని శుద్ధాంతజనముతోడ మరలె నిట్టూర్పులన్ విడ్చు చురగమట్లు.

వ॥ భగవంతుఁడైన కృష్ణుండును హాలాయుధాద్యఖిల పుత్ర పౌత్ర మిత్ర యాదవ
పురస్సరంబుగా నశ్రుపూర్ణేక్షణుండును నతిదీనవదనుండును నై యాత్మీయనగరంబు

ప్రవేశించె. సాంబుండు ద్వారకనుండి బయలువెడలి యంబరీషప్రతిష్ఠితుండై యఖిల జంతువుల యఘంబు లడంచుచు పాఱియుండిన సింధుసాగరసంగమంబుఁ జేరనరిగి స్నాతుండై శ్రాద్ధ నర్పించి ద్విజదీనాంధకృపణాదులకు వస్త్రరత్నా ద్యనేకదానంబు లొనరించి త్రిరాత్రంబులుండి వ్యవనాశ్రమంబునకుం జని యటఁగూడ యథాపూర్వం బుగా నన్నియు నిర్వర్తించి మెలమెల్లఁ బుష్కరాదితీర్థంబులం గ్రుంకుచుఁ బోయి పోయి సప్తమీభానువాసరంబున స్వపితృసూచితుండగు కుహారాశ్రయు దర్శించి పూజించి ఫలహస్తుండై ప్రదక్షిణంబు లాచరించుచు సూర్యగాయత్రి జపియించుటయుఁ గుష్ఠంబు నష్టమయ్యె. నంత నెనిమిదివేల గుఱ్ఱంబులను నాలునూఱుల రథంబులను మూఁడునూఱుల యేనుంగులను నైదు గ్రామంబులను ననేక రత్నంబులను నాగరుల కర్పించి గృహంబునకుఁబోయె. నీసాంబోపాఖ్యానంబుఁ జదివినను విన్నను వానివంశం బునఁ గుష్ఠరోగ మేర్పడదు.' ౧౬౯

—: విశ్వామిత్రుఁడు బ్రాహ్మణ్యము సాధించుట :—

ఆ॥ అవ్విధమున పుడమి నఘువిశ్వామిత్రయమిప్రతిష్ఠితుండు నఖిలసిద్ధి
కరుఁడు నైనయట్టి గణనాథుఁ డుండె నా క్షేత్రమందు మానిసింహులార!"

ఆ॥ అనుడు శౌనకాదు "లార్య! యాగణనాథుఁ డెవ్విధమున నచట నేరుపడియె?
నెట్టి దతనిమహిమ? మిప్పుడు మాకు వచింపుమీ" యటన్న సూతుఁ డిట్టులనియె.

సీ॥ చేటలఁబోలు తేసిచెవులఁ దొండంబును మ్యూషకాంగ నేనుఁగు మొగము వెట్టి
పరుషవిశిష్టమై పరఁగంగ రచియించి బాపుగా నాలుగు బాహువులను
గరమువినోదంబుగాఁ గనంబడుటకై యెక్కించి సంప్రీతి నెలుకమీఁదఁ
గుడుములు మండ్రాళ్ళఁ గొనకొని భక్షింప నఖిలసిద్ధిప్రదంబై రహింప
గట్టుపట్టి యొడలిపట్టిచే నొకబొమ్మ యమరుచుటయుఁ దొల్లి యదియులేచి
తారకాసురునకు దైవతములకైన పోరఁజొచ్చి యిట్టు పోరె నార! ౧౭౨

వ॥ ఎవమునుంజేయని యుద్ధమొనరించి లెక్కలేని రక్కసుల యుక్కడంచు టయు క్షతవిక్షతసర్వాంగుండును రుధిరపరిప్లుతుండును దత్సంగ్రామరంగాధికారియు నగు శక్రుండు సంతసించి ౧౭౩

ఉ॥ "మాకొఱకీవు యుద్ధ మతిమాత్రము సల్పి యసంఖ్యదానవా
నీకము గూలఁద్రోసి గణనీయుఁడవైతి విభాస్య! కావునన్
నీకు సమస్తదేవతలు నిశ్చలభక్తిని బూజసేయుదు
ద్గాక-యిఁ కెంత విఘ్నములఁ గష్టములొంది తపించు భూప్రజల్. ౧౭౪

క॥ కార్యారంభంబులనీ కార్యుఁడవని పూజసేయు సర్వాఘల క్తో
యార్యాకుమార ! తత్తత్కార్యంబులు సిద్ధిఁబొందఁగల విఁక మీఁదన్ ॥ ౨౭౫

వ॥ అని బహుమానించి గౌరీశంకరపార్శ్వంబున నదలి పెట్టి సర్వవిఘ్నవినాశార్థమై పూర్వము ధీమంతుఁడగు రోహితాశ్వుండు మార్కండేయమహామునింగూర్చి

క॥ “ భగవానుఁడ ! జను లెల్లరుఁ దగుగతి శుచులయియు చేయు ధర్మక్రియలం
దగపడియెడు విఘ్నంబులు నగమగ నారబ్ధపూర్తి చూడకయుండన్. ౨౭౭

సీ॥ దేవతారాధనాదికముతోఁ గూడి వర్తించునట్టివంటి వ్రతము గాని
శుభపున ముహూర్తనంగూడ యథేచ్ఛమై మనసీని పెను నియమంబు గాని
హృదయంబునభ్య నిత్యమేకాగ్రతఁ గూర్చి తను కార్శ్యమొనరించు తపము గాని
గోభూహిరణ్య రత్నాభరణాఢ్యమౌ నానాప్రకార దానంబు గాని
యున్న నాపై నను గ్రహమించి దాని నానతీయుము వాచంయమాగ్రగణ్య !
భక్తి సత్ఫ్వాచరితమైన బ్రతికిరంపకాల మెటువంటి విఘ్నము ల్గలుగకుండ ”

వ॥ అని ప్రశ్నించుచుటయు నతం డిట్లనియె. ౨౭౯

క॥ “ ఈవిషయంబున నీ కుర్వీశ్వర ! కీర్తింతు సకలవిఘ్నవినాశం
బై వివిధపాపహారమగు శ్రీవిశ్వామిత్రమహానిర్విఘ్నవ్రతమున్. ౨౮౦

క॥ విశ్వామిత్రుండని మును విశ్వఖ్యాతినిబహించి విలసిలెనొకఁడీ
విశ్వంభరకుం దానొక యీశ్వరుఁడగు గాధిసుతుఁ డహీనగుణుండై. ౨౮౧

క॥ మహనీయుఁడగు వసిష్ఠున కహితుండయ్యెను నతండహా ! యతఁ డతనిన్
మహిసురుఁడని యనఁడందున బహుళంబగు వైర మేర్పడె నిరువురకున్ ”

వ॥ అనియిట్లు వచించుటయు రోహితాశ్వుండు ౨౮౩

క॥ “ స్వయముగ బ్రహ్మదులె యెంతయు బ్రాహ్మణుఁడనఁగ నతనిఁ దానేలనఁడా
నయవిదుఁడైన వసిష్ఠుం ? డయయో ! యటువంటికచ్చె యతనికిఁ దగునే ? ”

వ॥ నావుడు మార్కండేయుండు వెండియు నిట్లనియె. ౨౮౫

తే॥ “ క్షత్రియుఁడు పూర్వ మతఁడు-క్ష్మాభరంబు మానియుండు చొకప్పుడు కాననమున
కరిగి వేఁటాడి క్షుత్పిపాసార్తుఁడగుచు నవ్వసిష్ఠునియాశ్రమం బాశ్రయింప ౨౮౬

ఆ॥ ప్రభువటంచెతింగి బలముల కతనికిం గుడువఁబెట్టి యతఁడు గొప్పఁజేసెఁ-
గోరుదానినిచ్చు గో వొకర్కు డాత్మీయ మందిరంబునందు మనుటఁజేసి. ౨౮౭

తే॥ గాధిజుఁడు తత్ప్రభావంబు గాంచియపుడు “ హయగజాదులనిచ్చెద నావునిమ్ము
టంచుఁ బరిపరివిధముల నడిగియడిగి సామమున దానమునఁగూడ సాధ్యపడమి.

ఆ॥ అలుకఁ బెంచియంత నద్దానిఁ బట్టించుకొని చనఁగ వసిష్ఠమునిని గాంచి
"యా మహీశ్వరునకు నిచ్చితో లేక" నన్నటంచుఁ బృచ్ఛ సేయ నాతఁడపుడు

కం॥ "నేని న్నన్నుల కిత్తునె? తా నె బలాత్కారముగ నితఁడు కొంపోవఁగ
బూనినవాఁడటు గావున దానికిఁ దగుపనియొనర్పఁ దలపదు మింకన్" ౨౯౦

తే॥ అనినవిని నందినీధేను వాన్నృపాలబలము గని యావలించుచు బహులు వెడలె
వక్త్రమునుండి పొగలటు పైని భయదమగుచు పంతులు లేచె సేవనిపచింతు ౨౯౧

సీ॥ విల్లమ్ములం దాల్చి వీరులై యనిఁ బల్చి పోరి వైరులఁ గూల్చు బోయవాండ్రు
వశ్యక్రియ లేర్చి వ్యర్థత సమకూర్చి దాయలం దెగటార్చు కోయవాండ్రు
మొతకగోచులు వెట్టి మొలపు లిక్కలుగట్టి యరుల పావల నెట్టు నెఱుకవాండ్రు
కత్తులు ధరియించి గడ్డము ల్సవరించి దురమున విహరించు తురకవాండ్రు
వేనవేలుగఁ దద్వక్త్రవివరమున జనించి యచుకింకరులవలెఁ బెంచి యొడలు
"లేమిటికి చమ్ము సృజియించితి"వటంచు నేకముఖముగ నడుగ నా విట్టులనియె.

కం॥ ఈ రాజభటులు బలిమిం గ్రూరత నను గట్టి పట్టుకొని చనుచుండన్
వేఱేమి కలదు తత్సంహారము సేయుండు మీర లందఱు నొకటై" ౨౯౩

కం॥ అనియిట్లానతియిచ్చుటఁ జని విశ్వామిత్రరాజసైన్యంబులతో
ననియొనరిచి వారలు పదిదినములలో మిగులకుండఁ దెగటార్చి రహో! ౨౯౪

కం॥ విశ్వామిత్రుఁడు కనుగొని యాశ్చర్యద మైనయట్టి యాబ్రహ్మబలం
బుశ్వాసంబులువిడిచి మహీశ్వర! యెల్లరును విన నహీనరవమునన్. ౨౯౫

ఉ॥ "ఇట్టి మహత్త్వ మేరుపడ నేనును నయ్యెద బ్రాహ్మణుండ నా
పట్టికి మోయుమంచు మహిభారము నంతయు నంసపీఠిపైఁ
బెట్టి సుపర్వకోటికిని బెట్టిదమౌ తప మాచరింతు నిం
కొట్టె యటు ల్వనర్ప కెటులో చరియించిన నిశ్చయంబుగన్" ౨౯౬

ఆ॥ అని ప్రతిజ్ఞవట్టి యత్యంతభీకరంబైన తపము సేయఁబూనెఁ గాని
పడయఁజాలఁడయ్యె బ్రాహ్మణ్యమతఁడంత నాసనంబు వెల్లనయ్యె నకట. ౨౯౭

కం॥ పదపడి కైలాసంబున మదవతి హైమవతిఁ గూడి మనుచుండెడి యా
త్రిదశారాధ్య మహేశ్వరు పదవనజములను భజించి బహుభక్తిమెయిన్. ౨౯౮

తే॥ "దేవ బ్రహ్మత్వకాంక్షినై నీదుశిఖరిఁ దపము సేసెద ఘోరమౌ తత్తపంబు
విఘ్నములు లేక పూర్తిగా వృషపతాక! నీవు రక్షింపు శరణుఁ బొందితిని వచ్చి"

కం॥ నావుడు భగవానుండను "నో వసుధానాథ! సిద్ధినొందు నిమిత్తం
బీవు వినాయకపూజను గావింపుము బ్రాహ్మణుఁడవు గాఁగల వంతన్" ౩౦౦

క॥ అనవుడు విశ్వామిత్రుం డను- "దేవా! తద్విధంబు నానతియి-మ్మ
జని మొదలు విఘ్ననాశంబున కాహేరంబదేవు పూజయొనర్తుర్ " ౯౦౧

కం॥ అనుటయు శివుఁడనుఁ- "బార్వతి కొనకొని మును నలుగు వెట్టుకొని రాలిన యా
మనుచేతఁ జేసె నొకబొమ్మను-దనయుఁడటంచుఁజెప్పి మఱిఁ గ్రీడించెన్. ౯౦౩

సీ॥ గండ్రగొడ్డలిఁదొట్టి కలుకుటస్త్రాల్వెట్టి యొప్పారు నాల్గుబాహువులతోడ
నంధకకలశతుల్య కుంభస్థలముఁ జే రాజిల్లు దంతివక్త్రంబుతోడ
గచ్చుఁజేసినమాద్రిఁ గరము నున్నగనొచుఁ బరగుచుండెడి మహోదరముతోడఁ
జూచువారికిఁ జాలఁ జోద్యముం గలిగించు నతిమాత్రమైన దేహంబుతోడఁ
బొట్టిమోకాళ్ళతోడ నాబొమ్మఁదీర్చి "యిది సజీవంబు గానుండి యిపుడు నాకుఁ
బుత్రుఁడుగనుండ లోకులు పూజనలుపఁ గరుణ సేయుము" నా నేను గరము ప్రీతి.

తే॥ సృష్టిసూక్తము మఱియును జీవసూక్తముం బఠించి స్పృశించుడు భూమిపాల!
ప్రాణములువచ్చె నూతనప్రతిమ-కపుడు గట్టుపట్టిసిగుఱిచి నే నిట్టులంటి. ౯౦౪

ఆ॥ "జీవసూక్తమహిమ దేవి! నిర్మించితి నీభవత్కుమారు నేఁ జతుర్థి
నితఁడు నాగణముల కేలికయై గణనాథుఁడనఁబరంగు నీధరిత్రి. ౯౦౫

వం॥ చదువుచు జీవసూక్తమును జాన! చతుర్థి నెవండు వీనికిన్
జెదరనిభక్తిఁ బూజనము సేయునొ వాఁడొనరించునట్టి పె
ట్టిదమగు నెల్లచెదములు తీవి సమాప్తములౌను విఘ్నముల్
మొదటికి నాశమొందు శ్రుతిమూర్త్యుదయంబునఁ జీకటుల్వలెన్. ౯౦౬

శ్లో॥ "నమో లంబోదరాయేతి నమో గణవిభో తథా
కుఠారధారిణే నిత్యం తథా నాక్సంగకాయచ
నమో మోదకభక్షాయ నమో దంతైకధారిణే" ౯౦౭

కం॥ అనుమంత్రంబులచేతను మును పూజయొనర్చి యంత మోదకములతో
డను నైవేద్యము నర్ఘ్యము ఘనముగ నర్పించి యవలఁ గడుభక్తిమెయిన్. ౯౦౮

కం॥ "నేనొకశుభకార్యంబును బూని యొనర్చెదను శంభుపుత్రా! కరుణన్
దాని సమాప్తముఁజేయఁగనా నిర్విఘ్నంబుగాఁగ"నని వేఁడి యటుల్ ౯౦౯

తే॥ విత్తకార్యములేకుండ విధియుతముగ శక్తికొలఁదిని మోదకసంయుతమగు
భోజనంబును బెట్టునా భూమిసురుల" కనుచు నిబ్భంగి నంబిక యగ్రమందు. ౯౧౦

చం॥ పలికితి నేను బూర్వమునఁ బార్థివ! దానికి సంతసించి యా
యలికులవేణి "నేఁటిసుత యస్మదభీష్టసుతుండు, విఘ్నాయుతున్

దాలిత నిదేశక్రమంబుగను దోరపుభక్తిఁ జతుర్థిఁ గొల్చినన్
తొలఁగును విఘ్నసంచయము-తోడనె కార్యములెల్ల నయ్యెడిన్. ౯౧౧

కం॥ గజవదనుని స్మరియించియొ భజియించియొ మొదలువెట్టు పనులన్నియు నే
గజిబిజిలేకుండనె వే విజయంబును గాంచు-నచట వెలసెడి సిరియున్" ౯౧౨

కం॥ అనినొడివెంగాన నీవును జని గణపతిపూజసేయు చవితి-నభీష్టం
బెనసెద"వని పరమేశ్వరుఁ డనుటయు నగాధితనయుఁ డాగణనాథున్. ౯౧౩

తే॥ విధియుకంబుగఁ బూజించి విఘ్నవర్జితముగ నత్యంతఘోరమౌ తపమొనర్చి
పడసె బ్రాహ్మణ్యమును గానఁ బుడమిఱేఁడ ! కొలువుము వినాయకుఁ
[జతుర్థిఁ గోర్కెదీరు. ౯౧౪

ఉ॥ పుత్రులఁగాంత్రపుత్రకులు భూరిధనంబును గాంత్రు నిర్ధనుల్
శత్రుల గెల్తు రేలికలు శ్రద్ధ వినాయకదేవుఁ గొల్చినన్-
ధాత్రి నెవండు దేని మదిఁ దా స్మరియించి తదర్చ సేయునో
పుత్రక ! వాఁడు దాని వెసఁ బొందు గిరీశుఁడు చెప్పినట్లుగన్. ౯౧౫

ఆ॥ అందగత్తెగామిఁ బ్రాణేశ్వరునిచేత వెడలఁగొట్టఁబడిన వెలఁది యీగ
ణేశు పూజసేయ నెంతయు సౌభాగ్య మెనయఁగలదు ధారుణీశ ! గాన. ౯౧౬

కం॥ ఎవఁడీయాఖ్యానము ప్రతిదివసము చదివియును వినియుఁ దెలిసికొనునో వై
భవయుతముగ వాఁడొనరుచు వివిధార్థములును ఫలించు-విఘ్నము లెడలున్." 

వ॥ అని మార్కండేయుండు రోహితాశ్వునకుఁ జెప్పెనని సూతుండు వాక్రు
చ్చుటయు. ౯౧౭

## గద్య

ఇది శ్రీమజ్జగద్గురు గురుకరుణాకటాక్షసంప్రాప్తోభయభాషాపాండిత్య రసవత్కవిత్వ
నిధాన హారితసగోత్రోద్భవ లక్ష్మీనారాయణ పేరమాంబికా గర్భశుక్తిముక్తాయ
మాన విద్వత్సభావిశ్వకృతావధానవిధాన జానపాటి పట్టాభిరామాభిధాన
సమాంధ్రీకృతంబగు శ్రీ స్కాందమహాపురాణాంతర్గత
నాగరఖండంబునం దష్టమాశ్వాసము.



# తప్పొప్పుల పట్టిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౨ | ౭ | చేయునట్టి | చేయుఁట్టి |
| ౩ | ౧౫ | జన్య | జన్మ |
| ౬ | ౨౮ | భ్రాతుండై | భ్రాంతుండై |
| ౭ | ౩౨ | యొనరించు కొమ్మ | యొనరించు కొమ్ము |
| ౧౪ | ౪ | నేయు | సేయు |
| ౧౭ | ౭ | తుష్టాత్మ | తుష్టాత్ము |
| ౧౮ | ౧౭ | పాకశాసనుండు | భానుసూనుఁ డిప్డు |
| ౧౯ | ౬ | సవ్య | సావ్య |
| ౨౩ | ౬ | యిట్ల | యిట్లు |
| ౩౧ | ౧౪ | తిగిగాద | తిరిగాద |
| ౩౮ | ౨౬ | జింతాముణి | జింతామణి |
| ౪౩ | ౮ | నాపాపహా | పాపాపహా |
| ౪౩ | ౨౦ | బింజలాషద | బింజలాపర |
| ౫౧ | ౧౫ | విస్పష్ట | విస్పష్ట |
| ౫౫ | ౧౩ | ఖ్యాలి | ఖ్యాతి |
| ౫౫ | ౧౪ | నమ్రి | నర్మ |
| ౫౭ | ౭ | టోము | ట్టోము |
| ౫౭ | ౧౫ | ఆరిగి | అరిగి |
| ౬౧ | ౧౨ | తదాకృష్ణ | తదాకృష్ట |
| ౬౩ | ౨౯ | స్పహణీయ | స్పృహణీయ |
| ౬౬ | ౨౪ | త్యాజు | త్యాజ్య |
| ౭౪ | ౪ | పత | పర |
| ౭౪ | ౧౦ | ఛీ | చీ |
| ౭౫ | ౧౯ | రాఁక | రాడీఁక |
| ౭౮ | ౨౧ | తుడ | తుండ |
| [illegible]౨ | ౧౨ | చదువున్ | చరువున్ |
| ౯౬ | ౨౨ | క్రీడా | వ్రీడా |
| ౯౭ | ౧౩ | జహ్మ | జిహ్మ |
| ౯౯ | ౧౪ | తాపసియు | తాపసుఁడు |
| ౧౦౩ | ౨ | రోగ్యం | రోజ్యం |
| ౧౧౪ | ౨ | దాయచు | దాయుచు |
| ౧౧౪ | ౨౨ | విపణ్ముల | విపణ్ణల |
| ౧౨౬ | ౬ | త్రిరిపింపు | తీరిపింత్రు |
| ౧౩౩ | ౨౩ | లంఘీవఖా | లందీవఖా |
| ౧౫౦ | ౨౭ | సత్యేతరంబులై ప్యాంతం | సత్యంబులగుచుఁదశ్వాంతం |
| ౧౫౨ | ౧౪ | పడి | పడ |
| ౧౫౨ | ౧౦ | తనయు | తనయ |
| ౧౫౮ | ౨౮ | యగ్దలం | యగ్గలం |
| ౧౫౯ | ౧౩ | మూండదు | మూండదు |
| ౧౫౯ | ౨౯ | మబ్జ | మబ్బ |
| ౧౬౦ | ౧ | నెపుడు | నెప్రుడు |
| ౧౬౦ | ౬ | నియోజింప | నియోగింప |
| ౧౬౧ | ౨౦ | నిశాసంబు | నివాసంబు |
| ౧౬౩ | ౮ | జలాహానం | జలావగాహానం |
| ౧౬౪ | ౧౪ | పోవుటు | పోవును |
| ౧౬౪ | ౧౮ | వాడు | వాదు |
| ౧౬౫ | ౨౫ | కొనును | కొనుమ |
| ౧౬౬ | ౨౬ | వివాహో | వివాహా |
| ౧౬౭ | ౧౨ | కటన్ | కటిన్ |
| ౧౬౭ | ౧౫ | దండము | చందము |
| ౧౬౮ | ౨౨ | దక్కు | దక్కు |
| ౧౬౮ | ౨౬ | బనుల్ | బనుల్ |
| ౧౬౯ | ౧౮ | నూన్మత | నూన్మత |
| ౧౭౦ | ౧౭ | కిల్లు | సిల్లు |
| ౧౭౪ | ౨౩ | మజ్జదురు | మజ్జగదురు |
| ౧౭౭ | ౧ | మహో | మహీ |
| ౧౭౭ | ౨౧ | నూత | నూతి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౧౬౭ | ౧౯ | బ్రాహ్రా | బ్రాహ్మ |
| ౧౬౯ | ౨ | బ్రాహాణి | బ్రాహ్మణి |
| ,, | ౫ | దెవరి | దేవరి |
| ,, | ౨౧ | యెల్లెడఁ | యెల్లెడఁ |
| ౧౭౦ | ౨౭ | నత్రిలోక | దత్రిలోక |
| ౧౭౧ | ౨౦ | వారలో | వారల్ |
| ౧౭౨ | ౬ | పెద్దపేరి లుంగు | పేరెలుంగు |
| ,, | ౧౬ | యెట్లా | యెట్లో |
| ౧౭౪ | ౧౧ | యెటుల | యెటుల |
| ,, | ౧౪ | నికఙ | నికన్ |
| ౧౭౫ | ౨౪ | తదనఁతర | తదనంతర |
| ౧౭౬ | ౧౦ | వసుచే | వసువుచే |
| ,, | ౨౦ | వలికి | పలికి |
| ౧౭౭ | ౨ | నీపగిది | నిపగిది |
| ౧౭౯ | ౧౭ | సేతుని | సేతునని |
| ౧౯౩ | ౬ | దీర్ఘా | దీర్ఘా |
| ౧౯౪ | ౬ | తత్రీర్థ | దత్రీర్థ |
| ,, | ౧౬ | దాయకమ్మలు | దాయకమ్ములు |
| ౧౯౪ | ౨౭ | హారమె | హారము |
| ౧౯౫ | ౫ | వాడు | నాడు |
| ౧౯౭ | ౯ | నౌనఁగన్ | నౌసఁగన్ |
| ౨౦౩ | ౧౨ | ల్మెట్టు | ల్పెట్టు |
| ౨౦౬ | ౧౯ | నిఁటి | నింటి |
| ౨౧౦ | ౩ | బాదత్రికము | బారత్రికము |
| ౨౧౫ | ౭ | గేయమానుఁ | గీయమానుఁ |
| ౨౧౮ | ౧౯ | నింత | నంత |
| ౨౨౨ | ౨౫ | స్థానమెక్క | స్థానమొక్క |
| ౨౨౪ | ౧౪ | వానతండు | నానతండు |
| ౨౨౬ | ౧౪ | సేనేల | నేసెల |
| ౨౩౦ | ౨ | రుత్సవ | ముత్సవ |
| ౨౩౩ | ౩ | డాహాట | డౌహాటు |
| ౨౩౯ | ౨౧ | విహారముల్స లుప్పచందలి | విహారియై యచటు రాజిలు |
| ౨౪౦ | ౨౬ | గోం | గోరి |
| ౨౪౧ | ౧ | పాపె | పాపై |
| ౨౪౨ | ౨ | నెఱపం | నెఱపెం |
| ౨౫౦ | ౧౯ | ద్పదళు | దత్పళు |




చంద్రికా ముద్రాక్షరశాల, గుంటూరు.